ఖమ్మం ద్వితీయ విద్యామహాసభల ప్రత్యేక సంచిక

# క్య ఉపాధ్యాయ




పుటి 3 ★ సంచిక 9 సెప్టెంబరు 1977



యు. టి. యఫ్. ఉద్యమజెండా - అరుణారుణకాంతులు నిండా
వినువీధిని ఎగిరెను చూడు ! మన అందరి పండుగ నేడు !!

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక
*The Largest Circulated C ational Monthly*

# ఖమ్మం విద్యా మహాసభల్లో, ఆగష్టు 18న యం. టి.

# కేంద్ర విద్యామంత్రి శ్రీ పి. సి. చుం

# సమర్పించిన వినతిపత్రం

గౌరవనీయులైన అమాత్యవర్యులకు,

దేశానికి సంబంధించిన బహు క్లిష్టసమస్యల పరిష్కార సాధనలో నిమగ్నులైయున్న మీరు అనేక వ్యయప్రయాసల కోర్చి సరాసరి న్యూఢిల్లీనుండి బ్రహ్మాండమైన మా విద్యా మహాసభల్లో పాల్గొన్నందుకు మేమెంతో కృతజ్ఞులం, మీ రాక మా సంఘానికెంతో గౌరవంగాను, గర్వకారణంగాను భావిస్తున్నాము

దేశానికి ప్రధానమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పునరుద్ధరించి, ప్రజల్లో కల్గించిన భీతావహాన్ని నిర్మూలించి, ఉక్కు కబంధ హస్తాలనుండి పత్రికా స్వాతంత్ర్యాన్ని రక్షించి, పార్లమెంటు, న్యాయవ్యవస్థా సంస్థలను తిరిగి పూర్వపు ప్రాతిపదికపై పునరుద్ధరించి, రాజకీయ పార్టీలను ప్రజాసంస్థలను స్వేచ్ఛగా పని చేయుటకు అవకాశం కల్పించిన జనతా ప్రభుత్వ ప్రతినిధిగా, వీరబెంగాల్ ఉత్తమ పుత్రునిగా మీకిదే మా స్వాగతం!

## అంధకార చిత్రం

దేశంలో వ్యాపించిన అంధకార చిత్రాన్ని పరికించి, ఎంతో బాధా తప్త హృదయభారంతో మీరు మహాసభలలో పాల్గొంటున్న అవకాశాన్ని ఉపయోగించుకొంటూ, అట్టి గాఢాంధకార చిత్రాన్ని దేశాన్నుండి అతి త్వరితంగా తొలగించుటకుగాను తగు సూచనలతో ఈ వినతి పత్రాన్ని మీకు సమర్పిస్తున్నాము.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటినుండికూడా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు విద్యారంగం, దాని ప్రాముఖ్యతల పట్ల చాల ఉదాశీనత, నిర్లక్ష్యం ప్రకటించాయి. 30 సం॥ల స్వాతంత్ర్య పాలనానంతరం దేశంలో 15 సం॥ల పైనున్న వయసుగలవారు 245 మిలియన్లు, 14 సం ల వయసుకంటె తక్కువగానున్న గ్రూపులో 100 మిలియన్లమందీ నిరక్షరాస్యులుగా ఉన్నారంటే, ప్రపంచ నిరక్షరాస్యులలో 50 శాతం మనదేశంలోనే ఉన్నారంటే, విద్యారంగ సంక్షోభతీవ్రత ఎంతగావుందో మనకర్థమౌతుంది. అది భారతదేశ చరిత్రకే పెద్ద మచ్చగాను, ప్రజాస్వామ్యానికి ప్రమాదకరంగాను ఉన్నది. రాజ్యాంగం ప్రకటించిన 27 సం॥ల తర్వాతకూడా రాజ్యాంగచట్టపు 45వ ఆర్టికల్‌లోని 6 14 సం॥ల మధ్యవయసుగల పిల్లలందరికి నిర్బంధోచిత విద్యను 10 సం॥ల లోపునే లభింపచేయాల'నే ఆదేశిక సూత్రం ఇంత వరకూ నెరవేరలేదు ఇప్పట్లో ఆ అవకాశంకూడా కన్పించటం లేదు.

## ఈ సంక్షోభ పరిష్కారానికి మా ప్రతిపాదనలు

### 1. నిరక్షరాస్యతనునిర్మూలిం... : రాజ్యాంగ

ఆదేశిక సూత్రం కనీసం ఇకనుండి ... నా నెరవేరేటట్లు చూడాలి. క్యూబా, ... యత్నా ... దాహరణ ప్రాతిపదికగా మనదేశంలో నిరక్షరాస్యత నిరు... నూటికి నూరుపాళ్ళు అక్షరాస్యత సాధించుటకు ... పదికపై ప్రజా ఉద్యమాన్ని చేపట్టాలి.

### 2. విద్యాహక్కు, పనిహక్కు కల్పి...

రాజ్యాంగంలో విద్యాహక్కు, పనిహక్కు కల్పించే ...లను చేర్చాలి. ప్రతి విద్యాదశ ముగింపులోను వి... ఉపాధి హక్కు గ్యారంటీ చేయాలి. ఉపాధి కల్పించే నిరుద్యోగభృతి చెల్లించాలి.

### 3. బోధనాభాష : ప్రాథమిక విద్యా దశనుండి

యూనివర్సిటీ విద్యా దశవరకు మాతృభాషలోనే విద్యాబోధన జరగాలి. త్రిభాషా సూత్రాన్ని వెంటనే రద్దుచేయాలి. సెకండరీ విద్యాదశలో ఐచ్ఛికంగా మరొకభాషను ప్రవేశపెట్టవచ్చు.

### 4. 10+2+3 విద్యా విధానం : కొఠారీ

కమీషన్ సూచనల ప్రకారం దేశమంతటా ఒకే విధంగా 10+2+3 పద్ధతి విద్యా విధానం అమలు పరచాలి. ... సూత్రంతో విభేదించే రాష్ట్ర ప్రభుత్వాలను దేశవ్యాప్తంగా ఒకే విద్యా విధానం అమలు పరచటానికి వీలుగా ఒప్పించేటట్టు చూడాలి.

### 5. +2 విద్యా దశ : ఈ విద్యాదశకు ఉన్న...

విద్యా కోర్సులకు వెళ్ళటానికి సన్నాహక దశగాను, అంతటితో చదువు ముగించుకోదలచిన వారికి సాంఘికంగా ఉపయోగకరమైన వృత్తి విద్యలద్వారా జీవితంలో స్థిరపడేదానికి వీలుగాను ఉండేటట్టు రూపొందింపబడాలి. ఈ దశను ఉన్నత పాఠశాలల నుండి డిగ్రీ కళాశాలల నుండి వేరుచేసి ప్రత్యేకంగా నిర్వహించాలి.

### 6. ప్రత్యామ్నాయ విద్యావిధాన లక్ష్యం

ప్రస్తుతమున్న విద్యావ్యవస్థ సంపూర్ణముగా మార్చబడ... నిజమైన ప్రజాతంత్ర శాస్త్రీయ విద్యావిధానం దానిస్థానే ప్రవేశపెట్టబడాలి. ప్రజల అవసరాలు, ఆశయాలు, జా... జీవనాలతో మిళితమై కష్టజీవుల సమస్యల్ని పరిష్కరించే విధానంగా రూపొందింపబడాలి.

### 7. ప్రైవేట్ మేనేజిమెంట్లను ర...

విద్యాసంస్థలన్నింటిని ప్రభుత్వం స్వాధీ... ప్రైవేటు వ్యక్తుల, కులాల, మతాల అధిప... ప్రజాతంత్ర పద్ధతులలో నిర్వహణా... చేయాలి. తమ స్వంతనిధులతో విద్యా స...

( మిగతా మూడవ కవర్...

10V01A129

# MESSAGES

Prague.

**Teachers World Federation of Teachers Union Express**

Greetings and wishes success your conference in Khammam Fraternally.

*Yours.*

**Daniel Retureau.**
General Secretary,
World Federation of Teachers Union.
(FISC)

≡≡≡≡

Andhra University
Waltair
Visakhapatnam-530 003
*(A. P.)*

**M. R. APPAROW**, M.A., M.L.A.
*Vice-Chancellor*

I am glad to learn that the Andhra Pradesh United Teacher's Federation is holding its second Conference at Khammam in the second week of July 1977. The impressive list of subjects to be discussed at the conference is a clear indication of the seriousness with which Educationists are trying to solve the problems confronting education in the country. I am particularly happy to learn that the Conference proposes to evolve a comprehensive national educational programme for the country.

I wish the Conference success.

*M. R. APPAROW*

≡≡≡≡

## SRI VENKATESWARA UNIVERSITY

Professor
K. Satchidananda Murty
Vice-Chancellor

*Dear Dr. Murthy,*

I Wish the conference all success.

The Union Education Minister told me that he would be attending your conference.

With best wishes.

Yours sincerely,
K. SATCHIDANANDA MURTY

**Jawaharlal Nehru Technological University**

**M. V. Rajagopal,**
*Vice-Chancellor*

*Dear Dr. Radhakrishna Murthy,*

Thank you very much for your kind letter saying that the Second Educational Conference of A. P. United Teacher's Association will be held during the second week of July 1977. The subjects you have listed for the Conference are very interesting and important and I, therefore, send my best wishes for a very successful discussion at the Conference.

With personal regards,

Yours sincerely,
M. V. RAJAGOPAL

≡≡≡≡

THE VICE-CHANCELLOR

THE UNIVERSITY OF MADRAS

*Dear Mr. Venkataswamy,*

I send you my good wishes.

Yours sincerely,
**Malcolm S. Adiseshiah.**

≡≡≡≡

**Rabindra Bharati University.**
6/4, Dwarkanath Tagore Lane,
CALCUTTA-7.

Dr. P. C. GUPTA
Vice-Chancellor

Dear Sir,

Kindly refer to your letter of 15th June, 1977.

I wish your conference every success.

Yours sincerely,
P. C. GUPTA.

Hyderabad

G. Narasimha Das, B.A.,
Personal Assistant
To the Minister for Medium irrigation
Government of Andhra Pradesh

Sir,

With reference to your letter dated 15—6—77, I am sending herewith the message of the MInister for Medium Irrigation.

Yours faithfully,
G. NARASIMHA DAS

≡≡≡≡

DR. HAJI A. A. NOOR MUHAMMAD
M A., LL. M. J. S. D. (YALE)
Vice-Chancellor
University of Calicut

*Dear Dr. Murthy,*

I am glad to learn that the Andhra Pradesh United Teacher's Federation is holding its Second Conference in the second week of July, 1977. The Conference has an impressive agenda including Symposia, Seminars and Lectures on vital topics connected with the future of education in our country. I hope that the Conference will make useful contributions in this regard.

I wish the Conference all success.

With warm regards.

Sincerely yours,
N. A. NOOR MUHAMMAD.

≡≡≡≡

UNIVERSITY OF MYSORE
Crawford Hall, Mysore.

D. V. URS
Vice-Chancellor
Dear Dr. Radhakrishna Murthy,

I am happy to learn of the Second Educational Conference organised by the Andhra Pradesh United Teachers' Federation. I see from your letter that the Conference will discuss some of the most important problems in Education. I have no doubt it will make a positive contribution towards the resolution of their problems.

Please accept my greetings for the success of the Conference.

With regards.

Yours sincerely,
D. V. URS.

Hyderabad.

J. VENGALA RAO
Chief Minister.

I am glad to learn that the Second Conference of the Andhra Pradesh United Teachers' Federation will meet during the second week of July, 1977. I welcome the seminar, symposia etc., that are proposed to be organised during the conference, the central theme being education. Today, the Nation is passing through a most crucial phase, and therefore, the intellectuals have a definite role to play. So also the youth of the country. It is ultimately for the teaching community to reshape the Youth and the pattern of education so that the rising generation may accept the challenges of tomorrow. I wish the conference all success.

J. VENGALA RAO

≡≡≡≡

V. KRISHNAMURTHY NAIDU
Minister for Medium Irrigation.

I am very glad to know that the second conference of the Andhra Pradesh United Teachers' Federation is going to be held in the second week of July 1977. I wish the conference a grand success.

V. KRISHNAMURTHY NAIDU.

≡≡≡≡

PIDATHALA RANGA REDDI
Minister for Finance

It gives me pleasure to know that the Andhra Pradesh United Teachers' Federation will be holding its Second Educational Conference at Khammam during the second week of July 1977 wherein distinguished educationists will be participating. It is the common man's desire and expectation how best the educationists would contribute towards the imparting of good education to our children. It is in this direction I wish the participants to concentrate.

I wish the Conference all success.

P. RANGA REDDI

**Dr. Ch. DEVANANDA RAO**
Minister for Tourism.

Happy to learn that the 2nd Educational Conference under the auspicious of the Andhra Pradesh United Teachers Federation is proposed to be held during the second week of July. 1977. I am confident that the deliberations of the conference will cover the various aspects of education and will contribute for the betterment of the system. I wish the conference all success

Dr. Ch. DEVANANDA RAO

---

**CHEBROLU HANUMAIAH**
Minister for Transport

Dear Radhakrishna Murthy,

I am happy to know that A P United Teachers' Federation is going to conduct the second conference during the second week of July, '77.

I wish the conference every success.

CH. HANUMAIAH

---

**GOVERNOR** Raj Bhavan
Uttar Pradesh Lucknow

It is a pitty indeed that the percentage of illiteracy–with all its hazards of social, economic and national character–is almost the same as about decades ago. While it is a burning national problem, our teachers owe a grim duty to eradicate it with all their might and provide training to the citizens by which the current and expression of will are brought under control and find fruitful dimensions.

I am happy to know that the Andhra Pradesh United Teachers' Federation is having its Second Conference in the second week of July next and I wish their delibrations all success,

M. CHENNA REDDY

---

Srikakulam

Dear Secretary,
Wishing the function every success.

KAMALAMMA

---

**CENTRE FOR DEVELOPMENT STUDIES**
Trivandrum

Dear Rao
I wish your conference to be a grand success.

Yours sincerely,
K. N. RAJ
Centre for Development Studies.

**SAMAR MUKHERJEE, M. P.**
New Delhi
Dear Swamy
I wish your conference to be a grand success.
With good wishes

Fraternally Yours,
SAMAR MUKHERJEE, M. P.

---

**E. M. S. NAMBOODRIPAD**
Gen. Secretary, Communist Party of India, Marxist.

Dear friend,

I am glad to learn from your letter of that you are holding the second conference of your Federation during the 17th and 18th of this month

While expressing my regret that I shall not be able to attend the conference, as desired by you, I send you my warm greetings and hearty good wishes.

May the Conference help a proper understanding of the educational problems facing the people of the country and unite the teachers of Andhra Pradesh in their endeavour for the democratisation and modernisation of education.

Yours sincerely,
E. M. S. NAMBOODRIPAD

---

అధ్యక్షులు,
**ఆహ్వాన సంఘం,**
మహాశయా,

మీ ఆహ్వానం అందినది.

సరిగా మీ మహాసభలు జరిగే తేదీలలోనే సి. ఐ. టి. యు. జనరల్ కౌన్సిల్ సమావేశం కలకత్తాలో జరుగుతున్నందున మీ మహాసభలకు హాజరు కాలేకపోతున్నాను.

తెలుగుప్రజలందరు ఒకే రాష్ట్రపాలన క్రిందకువచ్చి నేటికి రెండు దశాబ్దాలు కావస్తున్నా, యీ నాటికీ వివిధ వృత్తులలోనున్న తెలుగు ప్రజలు రాష్ట్రవ్యాపిత సంఘాలలోకి పూర్తిగా సమీకరింపబడకపోవడం విచారకరం.

ఈ స్థితిలో ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ తెలుగుగడ్డపైని అన్నిప్రాంతాల ఉపాధ్యాయులను ఒకే పతాకం క్రిందికి తేవటానికి చేసిన నిర్విరామకృషి అచిరకాలంలోనే ఎన్నో సత్ఫలితాలనివ్వటం అనేక జిల్లాలకు నిర్మాణాన్ని విస్తృతపర్చి మారుమూలలనున్న ప్రాంతాలకుసైతం ఐక్య ఉపాధ్యాయ వాణిని వినిపించటం ఎంతో తృప్తి నిస్తున్నది.

ఉపాధ్యాయ సంఘాలన్నింటినీ ఐక్య కార్యాచరణలోకి తేవటానికి మీ సంస్థ చేసిన కృషి ప్రశంసనీయం.

ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికై కృషిచేయడంతో పాటు కార్మికుల, ఉద్యోగుల, తదితర కష్టజీవుల ఉమ్మడి సమస్యలపై ఉమ్మడి పోరాటాలు జరిపే సందర్భంలో మీ సంస్థకూడ సముచితపాత్ర వహిస్తుందని విశ్వసిస్తున్నాను.

మీ మహాసభ దిగ్విజయం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

అభివందనములతో.

**పర్వ సత్యనారాయణ,** అధ్యక్షులు, రాష్ట్ర సి.ఐ.టి.యు.
**జి.యస్. బాలాజీదాస్,** ఉపాధ్యక్షులు, రాష్ట్ర ,,

To

Shri K. NARAYAN RAO
President Andhra Predesh
United Teachers' Federation,
Akulavari Street, Vijayawada-2

Dear Sir,

I was so eager to join your Conference on the 17th & the 18th August, 1977. I am so glad to know that the women delegates at the conference cherish a loving memoray for me and are so eager to be reunited with at your Conference. Unfortunately, however, I am not physically in a position to take the strain and trouble of this long journey from Calcutta and so in spite of best of my wishes I fail to be in your midst on the occasion of your Conference. I hope my friends in Andhra will excuse me my inability to join the Conference. I may convey to you my assurance that I shall avail myself of the next possible opportunity to be in your midt and of the occasion to be happily reunited. I convey to you and through you to all my friends and colleagues in Andhra my sincerest and warmest greetings and my most grateful thanks for thus kindly remembering me.

I wish your Conference all success.

Yours fraternally,
ANILA DEBI
General Secretary,
All Bengal Teachers Association.

---

Mr A. VENKATSWAMI, G S.
Andhra Pradesh United Teachers' Federation

Dear Comrade,

I regrate to inform you that I could not attend your conference due to an urgent piece of work. Com. Panchanan Mandal, President of our association will attend the conference on behalf of our organisation.

In this connection I would like to convey my revolutionary greetings to you and the delegates present Hope to grand success of the conference.

With comradely greetings,
Your sincerely,
GOKULANANDA ROY,
General Secretary,
All Benal Primary Teacners Association.

---

ANDHRA PRADESH
UNITED TEACHERS' FEDERATION.

Delibrations of your conference, we hope, will help for democratisation of education and pave way for building socialism. Wish success of your conference and Express our solidarity.

PAUL RUHIG
President
Educational Scientific and Technical workers
Trade Union of German Democratic Republic
BERLIN — GDR.

# జీవితచందాలు



45. శ్రీ జి. చిట్టిబాబు
వెదురుపాక, తూ. గో. జిల్లా



62. శ్రీ వి. యస్ యన్ వి.
ప్రసాద్ చౌదరి
అమలాపురం, తూ గో. జిల్లా.



82 శ్రీ వై. సూర్యారావు
కోనపోతుగుంట, ప. గో. జిల్లా.



134. శ్రీ యం. వెంకటరామయ్య
భీమవరం, ప. గో. జిల్లా.



136 శ్రీ సి హెచ్. ఎ. యస్.
భాస్కరరావు
కుమానపల్లి, తూ గో. జిల్లా.



137. శ్రీ కె. శివారెడ్డి
నక్రేకల్, నల్గొండ జిల్లా.

138. శ్రీ యం. పాపారావు
సిరిపురం గుంటూరు జిల్లా

140. శ్రీ వి. తాతారావు
పల్లూరు, ప. గో. జిల్లా

141. శ్రీమతి వి.విజయలక్ష్మి
భీమవరం, ప. గో. జిల్లా

142. శ్రీమతి డి. ప్రభావతి
భీమవరం, ప గో. జిల్లా

143. శ్రీ బి. నరసింహారావు
వెంకటాపురం, ఖమ్మంజిల్లా



135. శ్రీ కె సాంబశివరావు
M. Sc. M. Ed.,
మంగళాపురం, కృష్ణాజిల్లా



ఉద్యమానికి, పత్రికకు అన్ని సందర్భాలలో సహకారమందిస్తున్న ఉద్యమ శ్రేయోభిలాషి.
శ్రీ యస్. యమ్. కొండయ్య,
ఎడిటర్, ప్రాధమిక విద్య,
విజయవాడ-2

---

## అందరికీ

## వహా

## అభివందనములు

IKYA UPADHYAYA

Life Subscription 116-00
Yearly „ 10-00
Single Copy 1-00

I ya Upadhyaya
Akulavari Street,
Vijayawada-2

# ఐక్య ఉపాధ్యాయ

సంపాదక వర్గం:
మైనేని వెంకటరత్నం
(ప్రధాన సంపాదకుడు)
నాదెళ్ళ సీతారామాచారి
కోడూరు నారాయణరావు
అప్పారి వెంకటస్వామి
మోతుకూరు నరహరి

సంపుటి 3 | సెప్టెంబరు 1977 | సంచిక 9

## జే జే లు!

1974 అక్టోబరు 20, 21 తేదీలలో రాజమండ్రిలో యు. టి. యఫ్ ప్రథమ మహాసభలు వేయిమంది ప్రతినిధులతో ఉత్సాహ పూరితంగా జరిగాయి.

తిరిగి నేడు 1977 ఆగస్టు 17, 18 తేదీలలో, ఖమ్మంలో ద్వితీయ విద్యా మహాసభలు ఆరువేలమంది ప్రతినిధులతో ఉత్సాహోత్తేజాల మధ్య అత్యంత జయప్రదంగా ముగిశాయి.

నాటికి నేటికి యు. టి. యఫ్. ఎంతపురోగమించిందో యీ మహాసభలు స్పష్టంగా అద్దం పట్టాయి. ఆరువేల ప్రతినిధులేగాక విద్యాగోష్ఠినాడు ఆ సంఖ్య పదివేలకు పెరగటం అపూర్వమైన విషయం.

—ప్రాంతీయభేదాల అడ్డుగోడల్ని బద్దలుగొట్టి, మేనేజిమెంటు అంతరాలనధిగమించి, అన్ని కేటగిరీ ఉపాధ్యాయుల నిముడ్చుకొని విశాలైక్యత ప్రాతిపదికగా ఉద్యమాన్ని వ్యాపింపజేసిన దాని ప్రతిబింబమిది.

—వేతన స్తంభనచట్టం రద్దుకై సాగిన హైద్రాబాద్ సదస్సులో పాల్గొని ఎడతెగని ఆందోళన సాగించి, టెలిగ్రామ్‌ల వర్షం కురిపించి, సి డి రద్దయేదాకా విశ్రమించని దానిఫలితమిది.

—నిర్బంధ రిటైర్ మెంట్, నేటివిటీ ఉత్తర్వులరద్దు, ఇతర సమస్యలపై కార్డు కాంపెయిన్లు, మహా విజ్ఞాపన పత్రాల సమర్పణలద్వారా తమకండగా నిల్చిన సంఘంపట్ల అధ్యాపకులు చూపిన ఆదరణ ఇది.

—బడిదినాలు, పనిగంటలు పెంపు చేసినపుడు వాటి అశాస్త్రీయతను గుంటూరు విద్యాగోష్ఠి ద్వారా వెలుగులోకి తెచ్చి, జె సి టి. ఎ. నిర్మాణానికి ప్రాతిపదిక వేసి, సమైక్య సంఘటిత శక్తిని ముందుకుతెచ్చిన సంఘంపట్ల ప్రదర్శించిన ప్రేమాదరణల పరాకాష్ఠఇది.

—అత్యవసర పరిస్థితిలో సైతం జెండా దించకుండా, పీడితోపాధ్యాయుల కంటిపాపగా మెలగి, వృత్తి భద్రతకు సంక్షేమానికి సమస్యా పరిష్కారానికి అవిరళ కృషి సాగించిన సమరశీల పోరాట సంస్థకు సమధికోత్సాహ ప్రజానీకపు నివాళి యిది.

—సమరశీల సంస్థకు సరయిన వాణిగా 'ఐక్య ఉపాధ్యాయ' పత్రిక నిర్వహించిన పాత్రకు తెల్పిన జేజేలు యివి.




—ఉపాధ్యాయులు తమ సమస్యలకు మాత్రమే పరిమితమైలేరనీ జాతిప్రయోజనాలకోసం సంసిద్ధమై వున్నారని తెల్పిన జాగృతి యిది.

— విద్యావిధానంలో మౌలికమైన మార్పుల్ని సూచిస్తూ వివిధ విద్యావేత్తలతో చర్చలు జరిపి, వాటికొక సజీవ రూపమిచ్చి జాతి ప్రయోజనాలకోసం ఉపాధ్యాయులు కూడా అంకితం కావాలనుకొన్న నిష్ఠా దినమిది.

— వివిధ రాష్ట్ర ఉపాధ్యాయ ఉద్యమాలమధ్య సంఘీభావం, ప్రపంచ ఉపాధ్యాయ ఉద్యమంతో సత్సంబంధం సాధించిన గురుతర గౌరవమిది.

ఆశయబలమే యు.టి.యఫ్. ఆస్తి.
అమరజీవి చెన్నుపాటి అడుగుజాడే దాని వెన్నెలవాడ
నిస్వార్థ సేవకు అంకితమైన కార్యకర్తలే దాని పెట్టుబడి.
పీడితోపాధ్యాయుల అండదండలే దాని పెట్టనికోట.
అందుకే ... ఆ కనివిని ఎరుగని సమీకరణ!
విశాలైక్యతా సార్థకత!
ఉద్యమోత్సాహ పరాకాష్ఠ!

మహాసభలింత జయప్రదం కావడానికి నిర్విరామంగా కృషిచేసిన ఆహ్వానసంఘానికి, విరాళాలిచ్చి తోడ్పడిన విద్యాభిమానులైన దాతలకూ, అహోరాత్రులు శ్రమించి ప్రతినిధులకు సౌకర్యాలు సమకూర్చిన విద్యార్థి వలంటీర్లకూ, ప్రజాసంఘాల కార్యకర్తలకూ, ఇతర విధాల సహకరించిన పెద్దలందరికీ ఈ సందర్భంలో మా కృతజ్ఞతాభి వందనాల నందిస్తున్నాం.

అశేషోపాధ్యాయులు యు.టి యఫ్.ను అపూర్వంగా ఆదరించి, దానిపై వుంచిన గురుతర బాధ్యతల్ని సదాగమనంలో ఉంచుకొంటాం. వారి హక్కుల సాధనకు నిర్విరామంగా కృషి చేస్తూ, ఉద్యోగ ఉపాధ్యాయ సంఘాలమధ్య సమన్వయం సాధిస్తూ జాతిప్రగతికి శక్తియుక్తులాతోడ్పడుతూ యు.టి.యఫ్. తన చారిత్రాత్మకపాత్ర నిర్వర్తింపగలదని యీ సందర్భంలో మనవి చేస్తున్నాం.

మహాసభలు జయప్రదం చేయటానికి తోడ్పడిన వారందరికీ మరొక్కమారు ఇవే మా జేజేలు!

# ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో

## సువర్ణపుటల్ని సృష్టించిన ఖమ్మం ద్వితీయ విద్యా మహాసభలు

### అపూర్వంగా యు.టి.యఫ్.చే నిర్వహణ



మహాసభ జరిగిన 'చెన్నుపాటి నగర్' ప్రధాన ద్వారం

ఉపాధ్యాయుల్లో వినూత్న చైతన్యాన్ని, ఉత్సాహ ఉత్తేజాల్ని కల్గించి, ఉద్యమాన్ని నూతన మలుపుకుతిప్పి, కొత్తఊపు అందించి, ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో సువర్ణపుటల్ని సృష్టించిన ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ ద్వితీయ విద్యా మహాసభలు ఆగస్టు 17, 18 తేదీలలో ఖమ్మం పట్టణంలో కనివిని యెరుగని రీతిలో జరిగాయి.

ఉపాధ్యాయులు తమ సమస్యలకు మాత్రమే పరిమితమై లేరనీ, సమాజాన్ని అందోళన పరుస్తున్న లోపభూయిష్టమైన ప్రస్తుత విద్యావిధానం స్థానే శాస్త్రీయ నూతన ప్రత్యామ్నాయ మార్గాన్ని ప్రజలముందు పెడుతున్నారనీ ఈ మహాసభలు చాటి చెప్పాయి.

ఖమ్మం పట్టణ చరిత్రలోనేగాక, రాష్ట్రంలో జరిగిన ఏ విద్యామహాసభల్లోనూ ఇంతమంది ఉపాధ్యాయులు ఒక్క చోట సమావేశం కావటం అపూర్వ ఘటనగా చెప్పవచ్చు. అంతకు మించి చిత్తూరు నుండి విశాఖదాకా, నల్గొండ నుండి ఆదిలాబాద్ దాకా తెలుగునేల నాలుగు చెరగులనుండి ప్రాంతీయపు అడ్డుగోడల్ని బ్రద్దలుగొట్టి, అంతరాల దొంతర్లను అధిగమించి, విశాల సమైక్యతను సార్థకపరుస్తూ రాష్ట్రంలోని ఉపాధ్యాయులందర్నీ ఒకే వేదికమీదికి తెచ్చిన ఈ మహాసభలు ఉద్యమ చరిత్రలో చిరస్మరణీయంగా ఉండిపోగలవు.

అంతేగాక ఆయా రాష్ట్రాల ప్రతినిధులు, మన రాష్ట్రంలోని సోదర సంఘాల ప్రతినిధులు సౌహార్ద్రసందేశాలిచ్చినపుడు వారు ప్రాతినిధ్యం వహించే లక్షలాది మందితో సంఘీభావం వెల్లడిస్తూ ప్రతినిధులు చేసిన నినాదాలు విశాల సమైక్యతకు చిహ్నంగా, 'పీడితోపాధ్యాయులు ఎక్కడున్నా అందరూ ఒక్కటే!' అనే భావాన్ని వెల్లడిస్తూ ప్రతినిధుల గుండెల్లో శాశ్వత ముద్రలుగా స్థిరపడగలవు. ముఖ్యంగా రెండురోజుల 'విద్యా గోష్ఠి'ల్లో విద్యావేత్తల, ఉద్యమ నాయకుల, వివిధ ప్రముఖుల ప్రసంగాలు చైతన్య స్ఫోరకాలుగా, ప్రామాణికాలుగా ఉన్నాయి. కూలంకషమైన వివరణలు, చర్చలు సాగాయి. జాతి ప్రగతికి వెలుగుబాట చూపే శాస్త్రీయ నూతన విద్యా విధాన సమగ్రరూపం ప్రతినిధుల ముందు, ప్రజలముందు ఉంచబడింది. ఆంగ్ల ఉపాన్యాసాల్ని డా. విఠల్, హిందీ ఉపన్యాసాల్ని శ్రీ కౌముది అనువదించి ప్రతినిధులకు సుబోధకం కావటానికి మహాసభలు మరింత దిగ్విజయం గావటానికి సమర్థవంతంగా తోడ్పడ్డారు.

రెండు రాత్రులూ వైజ్ఞానిక ప్రదర్శనలద్వారా అప్పటి ప్రసంగాల ద్వారా ఉపాధ్యాయుల్లో కళాభిరుచి, వినోద విజ్ఞానాలు అందింపబడ్డాయి.

అంచనాకుమించి ప్రతినిధులు రావటంతో కొన్ని ఆర్థిక చిక్కులు, అసౌకర్యాలు ఏర్పడినా ఆహ్వానసంఘం వాటన్నిటినీ అధిగమించి, సర్వశక్తులూ వినియోగించి వనరుల్ని చేకూర్చి సభల్ని దిగ్విజయం చేసింది.

మొత్తంమీద యు.టి.యఫ్ ఏ ప్రయోజనాన్ని ఆశించి యీ మహాసభల్ని పెద్దఎత్తున నిర్వహించటానికి పూనుకొన్నదో అక్షరాలా ఆ ప్రయోజనాలు నెరవేరాయని చెప్పటంలో అతిశయోక్తి లేదు.

ఈ మహాసభలు యు.టి.యఫ్‌కు గర్వకారణం!

ఈ మహాసభలు వేలాది ప్రతినిధుల చైతన్య జ్వాలా తోరణం!

## స్వాగత దృశ్యాలు

అది ఆగస్టు 16.

మహాసభలకు వచ్చేప్రతినిధులకు స్వాగతమివ్వటానికి



పతాకావిష్కరణ జరుగుతున్న దృశ్యం

ఖమ్మం పట్టణం సర్వసన్నద్ధమయింది. ఆహ్వాన సంఘం పట్టణం లోని పాఠశాలలు, సత్రాలు, హొటళ్ళు, వీలయిన ప్రతి హాలూ ప్రతినిధుల విడుదులకు సిద్ధం చేసింది. జిల్లావారీగా కేటాయించి అన్నిసౌకర్యాలూ సమకూర్చింది. మహిళా ప్రతినిధులకు ప్రత్యేక విడిది సౌకర్యం కలించింది.

పురుషులకు రాధాకృష్ణ బ్రాన్ ఆయిల్ మిల్లుకు చెందిన విశాలమైన హాలులోను, మహిళలకు వర్తకసంఘ భవనంలోను వేలాది మందికి నిర్ణీత కాలంలో భోజనాలు పూర్తయేట్లు ఏర్పాటు చేసింది.

విద్యార్థి వాలంటీర్లు, ప్రజాసంఘాల వాలంటీర్లు బ్యాడ్జీలు ధరించి క్రమబద్ధంగా నియమిత స్థలాల్లో ప్రతినిధుల్ని ఆహ్వానించటానికి, సౌకర్యాలు కలిగించేందుకు సర్వసన్నద్ధం చేయబడ్డారు.

సాయంత్రం ప్రొద్దుటు వాలిందో లేదో నేల యీనినట్లు బస్సుల్లో, రైళ్ళల్లో అందిన ప్రయాణ సాధనాలన్నిట్లో ప్రతినిధులు రాసాగేరు! చీకటి పడేసరికి వెయ్యిమంది చేరుకొన్నారు. తెల్లవార్లూ వస్తూనే ఉన్నారు. రాష్ట్రం నలుమూలల నుండీ వివిధ రవాణా మార్గాలగుండానే కాకుండా మొత్తం 15 ప్రత్యేక బస్సుల్లో కూడా ప్రతినిధులు వచ్చారు. వారందరికీ ప్రొద్దు పోయే దాకా ఆహ్వానసంఘం భోజనసౌకర్యం కలిగిస్తూనే ఉంది.

పట్టణమంతా అలంకరించిన పోష్టర్లు, బ్యానర్లు, రంగు కాగితాల తోరణాలు ప్రతినిధులకు అపూర్వంగా స్వాగతమిచ్చినయ్, తెల్లవారేసరికి ఖమ్మం పట్టణం ఉపాధ్యాయ పట్టణమై పోయింది. వస్తారనుకొన్న ప్రతినిధులు 2 వేలు. వచ్చింది 6 వేల పైన. అంచనా తలక్రిందులై ఆహ్వానసంఘానికది అగ్నిపరీక్ష అయినా స్థిరసంకల్పంతో మహాసభలకు ఎటువంటి అంతరాయం కలుగకుండా నిర్ణీతకాలంలో అంతమందికీ భోజనాలు, విడుదులు, ఇతర సౌకర్యాలు కల్గించటం ప్రశంసనీయం. వలంటీర్లు రేయింబవళ్ళు శ్రమించి మహాసభల దిగ్విజయానికి ఎంతో తోడ్పడ్డారు. ఉపాధ్యాయ-విద్యార్థి ఐక్యత, ఉపాధ్యాయ-కార్మికవర్గ ఐక్యత, ఉపాధ్యాయ-ప్రజాసంఘాల ఐక్యత ఎటువంటి ఆటంకాలనైనా అధిగమింప జేయగలవనే సత్యం ఈ మహాసభలు చూసినవారి కెవరికైనా ప్రస్ఫుటంగాక మానవు. విద్యార్థులు, ఆర్. టి. సి. కార్మికులు, ప్రజాసంఘాల నాయకులు అన్నివర్గాలవారూ నడుంకట్టి మహాసభలు జరిగిన రెండురోజులూ రాత్రింబవళ్ళు శ్రమకోర్చి 'భళీ భళీ ఖమ్మం' అనిపించారు. దానికితోడు వాన లేకుండా ప్రకృతి సహకరించింది. దానితో మహాసభలు అపూర్వంగా దిగ్విజయమయ్యాయి.

## అదిగో చెన్నుపాటి నగర్ !

పట్టణం నడిబొడ్డులో ఓవర్ బ్రిడ్జి ప్రక్కన కమ్మహాస్టల్. అక్కడ 15 వేల మంది పట్టే విశాలమైన ఆవరణ అక్కడ వెలసింది చెన్నుపాటి నగర్. షామియానాల ఆచ్ఛాదనతో సభారంగం సిద్ధంచేయబడింది. ఓపెన్‌థియేటర్ మహాసభ వేదికగా మారిపోయింది. సభాస్థలి అంతా వివిధ సమస్యల ప్లేకార్డులు, విద్యారంగానికి చెందిన వివిధ అంశాలను తెల్పే ఛార్టులు, ఉద్యమ వివరాలు, పత్రిక విశేషాలు, ప్రత్యేకంగా తీర్చిదిద్దిన పెద్ద పెద్ద కార్టూనులు, వాటి వ్యాఖ్యానాలు, జిల్లా వారీగా కూర్చొటానికి ఏర్పాట్లు మహిళలకు, పత్రికా విలేఖరులకు, ప్రత్యేకాహ్వానితులకు, పెద్దలకు, విడి విడి స్థలాలు 'చెన్నుపాటి నగర్' అన్ని హంగులూ తీర్చుకొన్నది. ఉద్యమ పితామహుని వారసత్వం, త్యాగ సాంప్రదాయం, నిరాడంబరత, ఆశయాభినివేశం, అడుగడుగునా వుణికి పుచ్చుకొంది. ఆయన పెద్ద ఫొటో వేదిక అగ్రభాగాన అలంకరింపబడి అందరినీ ఉత్తేజపరచింది.



జాతీయ పతాకాన్ని ఆవిష్కరిస్తున్న
ఖమ్మం జిల్లా కలెక్టర్ శ్రీ యస్. బెనర్జీ

## మహాసభ ప్రారంభం

పతాకావిష్కరణ : ఆగస్టు 17 వ తేదీ ఉదయం 9 గంటలకు జిల్లాకలెక్టరు శ్రీ ఎస్. బెనర్జీ జాతీయ పతాకాన్ని, యు. టి. యఫ్. కార్యదర్శి శ్రీ ఆర్. రాఘవయ్య ఉద్యమ పతాకాన్ని ఆవిష్కరించటంతో మహాసభ కార్యక్రమం ప్రారంభమయింది. ఈ పతాకావిష్కరణ కార్యక్రమాన్ని సర్వశ్రీ బి. సుబ్బరాజు, ఎ. వి. ఆర్. అంజనేయులు, వి. నాగేశ్వరరావు ప్రభృతులు నిర్వహించారు.

ఆ సందర్భంలో శ్రీ బెనర్జీ, 'రాష్ట్రం నలుమూలలనుండీ వచ్చిన ప్రతినిధుల్ని, ఇతర రాష్ట్రాల నాయకుల్ని అభినందిస్తూ, దేశభవిష్యత్తు ఉపాధ్యాయుల చేతుల్లో వున్నదనీ, భావిపౌరుల్ని తీర్చిదిద్దే గురుతర బాధ్యత వారిమీదే వున్నదనీ, శాస్త్రీయ అవగాహనతో పాఠ్యాంశాల బోధన జరగాలనీ, విద్యారంగా




యు. టి. యఫ్. పతాకాన్ని ఆవిష్కరిస్తున్న
శ్రీ ఆర్. రాఘవయ్య, కార్యదర్శి, యు. టి. యఫ్.



సందేశమిస్తున్న శ్రీ యస్. బెనర్జీ



స్వాగతం చెవుతున్న ఆహ్వాన సంఘాధ్యక్షులు
డా. వై రాధాకృష్ణమూర్తి

నికి అనుభవశాలురైన ఉపాధ్యాయులే దారి జూపాలనీ ఉద్బోధించి జాతీయ పతాకావిష్కరణ భాగ్యం కల్పించినందుకు కృతజ్ఞతలు తెల్పారు.

శ్రీ రాఘవయ్య సందేశమిస్తూ 'త్రివేణీ సంగమంలా రాయలసీమ, ఆంధ్ర, తెలంగాణా ముప్పేటుగా కలిసిన శుభ దినమనీ, భావ సమైక్యతను చాటిన భవ్యదినమనీ, యు.టి.యఫ్ పతాక ఛాయలో నిల్చి మంచి భవిష్యత్తుకోసం ముందుకు సాగుదామనీ సందేశమిచ్చి ఉద్యమపతాకావిష్కరణభాగ్యం కల్పించినందుకు కృతజ్ఞతలు తెల్పారు.

రాష్ట్ర సంఘ ప్రధానకార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి అతిథుల్ని వేదికపైకి ఆహ్వానించారు. ప్రతినిధుల కరతాళ ధ్వనులమధ్య, కలకత్తా నుండి వృద్ధాప్యాన్ని కూడా లెఖ్ఖ చేయకుండా ఉద్యమోత్సాహంతో వందల మైళ్లు ప్రయాణం చేసి వచ్చిన అఖిల బెంగాల్ టీచర్స్ అసోసియేషన్ అధ్యక్షులు పశ్చిమ బెంగాల్ మాజీ విద్యామంత్రి శ్రీ సత్యప్రియరాయ్, బెంగాల్ ప్రైమరీ టీచర్స్ అసోసియేషన్ అధ్యక్షులు శ్రీపంచాననమండల్, ఉద్యమ పత్రిక 'టీచర్స్ జర్నల్' సంపాదక వర్గ సభ్యుడు శ్రీ అమితవసేన్, పంజాబ్ ఉపాధ్యాయ నాయకుడు, పార్లమెంటు సభ్యుడు శ్రీ భగత్‌రాం, తమిళనాడు ఉపాధ్యాయ సంఘ నాయకురాలు శ్రీమతి రాధారుక్మిణి, ఆలిండియా ప్రైమరీ టీచర్స్ అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి శ్రీ వై. వి. సుబ్బారావు వేదిక నలంకరించారు.

ప్రారంభసభకు యు టి యఫ్ అధ్యక్షులు శ్రీ కె. నారాయణరావు అధ్యక్షత వహించారు. శ్రీ పి. సాంబయ్యగారి దేశభక్తి గేయాలాపనతో సభా కార్యక్రమం ప్రారంభమయింది.

మొదట శ్రీ వెంకటస్వామి వివిధ ప్రముఖుల మరణానికి సంతాప తీర్మానాన్ని ప్రవేశపెట్టగా సభికులంతా లేచి మౌనం పాటించి శ్రద్ధాంజలి ఘటించారు.

అధ్యక్షులు వేదికపైన ఆసీనులైన వారిని పేరు పేరునా పరిచయంచేస్తుంటే సంతాప తీర్మానాలలో గంభీరముద్రవహించిన మహాసభ ఘూర్ణిల్లిన మహా సముద్రంలా ఒక్కసారి జయ జయ ధ్వానాలతో మారుమ్రోగింది.

పిదప ఆహ్వాన సంఘాధ్యక్షులు డా. వై. రాధాకృష్ణమూర్తిగారు స్వాగతోపన్యాసం ఇస్తూ ఇలా అన్నారు:

'భవిష్యత్ భారతావని యొక్క రూపురేఖలు దిద్దుతున్న విద్యా విజ్ఞాన శిల్పులైన ఉపాధ్యాయలోకం యొక్క ప్రతినిధులుగా మిమ్మల్ని ఈ పట్టణానికి ఆహ్వానిస్తున్నాను.

మీరు ద్వితీయ మహాసభ జరుపుకొంటున్న ఈ సమయం మన జాతి జీవితం ఒక ప్రత్యేకమైన మలుపు తీసుకొంటున్న సమయం...

పంజరంలో బంధింపబడిన ప్రజాస్వామ్యం రెక్కలు విదిలించుకొంటూన్న సమయం...

మేధావుల మెదళ్ళకు వేసిన తాళాలు విప్పుకొంటూన్న సమయం...

— అందుకే మనం విద్యారంగంలో ఎక్కడున్నామో ... ఏదారిన పయనిస్తున్నామో వెనుదిరిగిచూసుకొనే అవకాశం... నిర్భయంగా నిష్కపటంగా మళ్ళీ ఒక్కసారి పరిశీలించుకొనే అవకాశం కలిగింది.

ఈ అవకాశం సద్వినియోగపరచుకోగలరనే ఆశాభావం నాకుందంటూ... ఖమ్మం పట్టణానికిగలచారిత్రక ప్రాధాన్యాన్ని ఉగ్గడించి... విద్యారంగంలోని అస్తవ్యస్త పరిస్థితుల్ని వాటిని సరిదిద్దే మార్గాల్ని సూచిస్తూ అతిప్రతిభావంతంగా ఉద్బోధించి సభకు విచ్చేసిన ప్రతినిధులకు, ఆహ్వానితులకు స్వాగతం పలికేరు. (స్వాగతోపన్యాసం ప్రత్యేకంగా ఇస్తున్నాం.)




అధ్యక్షోపన్యాసం చేస్తున్న
శ్రీ కె. నారాయణరావు, అధ్యక్షుడు, యు. టి. యఫ్.

పిదప శ్రీ నారాయణరావుగారు అధ్యక్షోపన్యాసం ఇస్తూ ఇలా అన్నారు.

'సరిగ్గా నేటికి మూడు సంవత్సరాలక్రితం అనాటి చారిత్రకపరిస్థితుల దృష్ట్యా ఉపాధ్యాయుల్లోని కేటగిరీ భేదాలు, ప్రాంతీయ భేదాలనే అడ్డుగోడల్ని బద్దలుగొట్టి ఒకే ప్రభుత్వం క్రింద, ఒకే విద్యా వ్యవస్థక్రింద అనేక కష్టనష్టాలకు గురవుతున్న ఉపాధ్యాయులందరినీ ఒకే వేదికపై సమీకరించటానికి యు.టి.యఫ్ ఏర్పడిందని, ఆంధ్ర తెలంగాణా సమైక్య ఉద్యమ నిర్మాణానికి మొదటి సంస్థగా తెలుగునాట అది ఆవిర్భవించిందనీ, నేటికి 17 జిల్లాలలో శాఖలుగల్గి, 21 వేల సభ్యత్వంతో పోరాట పటిమగల సంస్థగా పురోగమిస్తున్నదనీ వివరించి, నేటి విద్యారంగ దుస్థితినీ, దాని పరిష్కార మార్గాల్నీ సూచిస్తూ సుదీర్ఘోపన్యాసం చేశారు.

(అధ్యక్షోపన్యాస పూర్తి పాఠాన్ని ప్రత్యేకంగా ఇస్తున్నాం)



ప్రారంభోపన్యాసం చేస్తున్న
శ్రీ సత్యప్రియరాయ్, అధ్యక్షులు, ఎ. బి. టి. ఎ.
అనువదిస్తున్న డా. ఎ. పి. విఠల్

తరువాత శ్రీ సత్యప్రియరాయ్ మహాసభను ప్రారంభించారు. యు.టి.యఫ్. ఉద్యమబీజం నాటిన రాజమండ్రి ప్రథమ మహాసభలకు కూడా ఆయనే ప్రారంభకులు. తన కళ్ళముందు అనతి కాలంలోనే ఆ మహావట వృక్షం శాఖోపశాఖలై ప్రబలంగా వర్ధిల్లినందుకు ముఖంలో అపారానందం, సంతృప్తి ప్రతిఫలింపజేస్తూ ఆయన సభను ప్రారంభించారు.

విద్యారంగంలో నెలకొన్న సంక్షోభాన్నీ, దాని కారణాల్నీ పరిష్కార మార్గాల్నీ ఆయన తన ప్రారంభోపన్యాసంలో వివరించి బెంగాల్ ప్రజాతంత్ర ఉపాధ్యాయ ఉద్యమం తరఫున అభివందనాలనందజేశారు. మరోసారి అందరినీ కలుసుకున్నందుకు తమ ఆనందాన్ని వెల్లడించారు.

పిదప శ్రీ పంచాననమండల్, శ్రీ భగత్‌రాం, శ్రీమతి రాధారుక్మిణి, శ్రీ సి. రామయ్య సందేశాలిచ్చారు. (వివరాలు విడిగా ఇస్తున్నాం)

తరువాత ప్రధాన కార్యదర్శి శ్రీ వెంకటస్వామి సందేశాలిచ్చిన వారికి కృతజ్ఞతలు తెల్పారు. సభా నిర్వహణకు అధ్యక్షవర్గం, స్టీరింగ్ కమిటీ, అర్హతల కమిటీ పేర్లు ప్రతిపాదించి సభ ఆమోదం పొందేరు. అధ్యక్షవర్గం వేదికనలంకరించటంతో ప్రతినిధుల సభ ప్రారంభమయింది.



ప్రతినిధులసభ, అధ్యక్షవర్గం
వేదికపై శ్రీ భద్రయ్య, శ్రీ పి. బి. ముత్తారావు,
శ్రీ యన్. సీతారామాచారి, శ్రీ కె. రాఘవరాజు
దేశభక్తిగేయ మాలపిస్తున్న శ్రీ జి. కె. రామారావు

## అధ్యక్ష, సారధ్య, అర్హతల సంఘాలు

**అధ్యక్షవర్గం:—** సర్వశ్రీ కె. నారాయణరావు, యన్. సీతారామాచారి, పి. బి. ముత్తారావు, కె. రాఘవరాజు, కె. భద్రయ్య, అర్. రాఘవయ్య, పి. వి. సుబ్బరాజు.

**సారధ్య సంఘం:—** సర్వశ్రీ ఎ. వెంకటస్వామి, యం. వెంకటరత్నం, జి. లక్ష్మయ్య, డి. రామిరెడ్డి, కె. తిరుపాలు, యన్. అర్. పోలిశెట్టి, యం. నరహరి.

**అర్హతల సంఘం :—** సర్వశ్రీ వి. సూర్యనారాయణరాజు, యం. యేసురత్నం, పి. సత్యనారాయణ, జి. మల్లయ్య, సి. మహదేవరెడ్డి, టి. బాలకృష్ణమూర్తి, యం. రాయన్న, ఎ. బాబూరావు, బి. వెంకటసుబ్బయ్య.

## ప్రతినిధుల సభ

### ఉద్యమాభివృద్ధిపై కార్యదర్శి నివేదిక

శ్రీ ఎ. వెంకటస్వామి కార్యదర్శి నివేదిక, ఆర్థికనివేదికలు ప్రవేశపెడుతూ ఇలా అన్నారు.

తెలుగునాట యు.టి.యఫ్. మూడేళ్ళ క్రితం సమైక్య సంస్థగాఅవతరించింది ఔనన్నా కాదన్నాఅదొకచారిత్రకసత్యం. తరువాత ఖాజీపేటలో 83 మంది ఉపాధ్యాయ నాయకులు సమైక్య ఉద్యమానికి నిర్మాణ రూపం ఇవ్వటంలో తెలంగాణా



కార్యదర్శి నివేదిక సమర్పిస్తున్న
శ్రీ ఎ. వెంకటుస్వామి, ప్రధాన కార్యదర్శి యు. టి. యఫ్.

జిల్లాలకుకూడా యు.టి.యఫ్. విస్తరించింది. నేడు రెండవ మహాసభ అప్రతిహతంగా జరుపుకొంటున్నది.

ప్రతి పరీక్షా సమయంలోను యు. టి. యఫ్. పీడితోపాధ్యాయుల పక్షాన నిలబడటమేగాక, ఐక్యకార్యాచరణతో పాలుపంచుకొనటంవలన, పోరాట సంస్థగా నిలబడటం వలన, 1974లో 7 వేల సభ్యత్వంతో ప్రారంభమై గుంటూరు సదస్సు నాటికి 14 వేలకు చేరుకొని ప్రస్తుతం 20 వేలను అధిగమించి దినదినాభివృద్ధి నందుచున్నది. క్రొత్త ప్రాంతాలకు విస్తరిస్తున్నదని వివరించి భవిష్యత్ కార్యక్రమాన్ని సభముందుంచారు.



పత్రికా నివేదిక సమర్పిస్తున్న
శ్రీ మైనేని వెంకటరత్నం, ప్రధాన సంపాదకుడు, ఐక్యఉపాధ్యాయ

పిదప 'ఐక్య ఉపాధ్యాయ' ప్రధాన సంపాదకుడు శ్రీ మైనేని వెంకటరత్నం పత్రికా నివేదిక సమర్పిస్తూ ఇలా అన్నారు:

'ఉద్యమోత్సాహానికి, పోరాట పటిమకూ పత్రిక ప్రతిబింబంగా రూపొందింది. దానికింకా సానబట్టి నిగ్గుదేల్చాలి. అత్యవసరపరిస్థితిలో సైతం నిర్బంధాలకు జడవకుండా, సెన్సార్ కొరడా బెదిరింపులకు చలించకుండా, అవకాశవాద నినాదాలు చేసి శత్రువుల ముందు జెండా దించకుండా పోరాట పత్రికగా నిలబడింది. అందుకే వేలాది ఉపాధ్యాయుల ప్రేమాభిమానాలను పొంది దినదినాభివృద్ధి నందింది.

పత్రిక వయసు కేవలం 2¾ వసంతాలే అయినా ఆరు వేల సర్క్యులేషన్‌కల్గి, ఆంధ్రప్రదేశ్‌లోగల అన్ని జిల్లాలకు విస్తరించిందని చెపూ ఈవిధంగా పత్రికా పుత్రికను తమగారాలబిడ్డగా ప్రాణసమానంగా పెంచి పెద్దజేస్తున్న కార్యకర్తలకు, పత్రికా పాఠకులకు, ఉద్యమాభిమానులకు సంపాదకవర్గం తరపున జేజేలు అందించారు. (ఉద్యమ, పత్రికా, ఆర్థిక నివేదికల పూర్తి పాఠాల్ని ప్రత్యేకంగా ఇస్తున్నాం.)

దానితో ఆపూట కార్యక్రమం పూర్తయింది. విశ్రాంతి తర్వాత మళ్ళీ మధ్యాహ్నం 2 గంటలకు ఎడ్యుకేషనల్ సింపోజియం ప్రారంభమయింది.

## నూతనవిద్యావిధానంపై విద్యావేత్తల ప్రసంగాలు

మధ్యాహ్నం ప్రారంభమైన 'ఎడ్యుకేషనల్ సింపోజియం' సభకు శ్రీ యం. మాధవరావు (యమ్. యల్. సి.) అధ్యక్షత వహించారు.

మొదట శ్రీ ఎ. వెంకటుస్వామి అమరజీవి చెన్నుపాటిని సంస్మరిస్తూ తీర్మానం ప్రవేశపెట్టేరు. ప్రతినిధుల హర్షధ్వానాలమధ్య శ్రీ కె. నారాయణరావు ఆయన ఫొటోకు పూలమాల సమర్పించారు.

ఆ పిదప రాష్ట్రసంఘ కార్యదర్శి శ్రీ డి. రామిరెడ్డి ఆంధ్ర, కాకతీయ, కలకత్తా, కాలికట్, విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులనుండి, ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావునుండి ఇతర మంత్రులనుండి ప్రపంచ ఉపాధ్యాయసంఘ ప్రధాన కార్యదర్శి నుండి, కె. యన్. రాజు మాత్యుకురియన్, సమర్ ముఖర్జీ, మొదలగు ప్రముఖులనుండి సి ఐ టి యు. మొదలగు ప్రజా సంఘాల నాయకులనుండి వచ్చిన సందేశాలు సభకు చదివి వినిపించారు.

అధ్యక్షులు శ్రీ మాధవరావుగారు తమ తొలిపలుకులలో ఇలా అన్నారు:

'మనం వృత్తి సమస్యలపై తీవ్ర కృషిచేస్తున్నట్టే, విద్యావిషయక సమస్యలపైకూడా తీవ్రంగా పోరాడాలి. నూతన ప్రత్యామ్నాయ విద్యావిధానాన్ని ప్రజల్లోకి తీసుకుపోవాలి. ప్రభుత్వం నేటినిటీ జి.ఓ. జారీచేసి ఉపాధ్యాయులపై యుద్ధం ప్రకటించింది. ఈ జి. ఓ జారీచేసినప్పుడు మిగిలిన సంఘాలు నిర్లిప్తంగా ఉన్నా యు టి యఫ్. చొరవతో గొంతెత్తి దానిలోని



ఎడ్యుకేషన్ సింపోజియంసభలో అధ్యక్షోపన్యాసమిస్తున్న
శ్రీ యం. మాధవరావు (యం, యల్, సి)

అవసవ్యాల్ని బయటపెట్టింది. ఆందోళన సాగించింది. ఫలితంగా అదియిప్పటికి రద్దయింది. ఈ విధమైన కార్యక్రమాలు కొన సాగిస్తూనే మనం జాతిప్రయోజనాలకుపయోగించే నూతన విద్యా విధానాన్ని సాధించడానికి కృషిచేయాలి. చర్చలుజరిపి, ఆ సారాంశాన్ని ప్రజలకు ప్రభుత్వానికి అందించాలి.

30 సంవత్సరాలుగా విద్యారంగంలో సంక్షోభంఉన్నదని పాలకవర్గాలు చెప్తూనే ఉన్నాయి. కాని ఆచరణలో దాన్ని పరిష్కరించటానికి నిర్దిష్టమైన యే చర్యా తీసుకోలేదు. విద్యా కమిషన్లు నియమించారేగాని వాటి సిఫార్సులు పాటించలేదు. కాన దీన్ని దేశసమస్యగా మనం పోరాడవలసి వుంది. ప్రజల్లోకి, విద్యావంతుల్లోకి, మేధావుల్లోకి శాస్త్రీయ నూతన ప్రత్యామ్నాయ విధానాల్ని ప్రచారంచేసి ఉద్యమం నిర్మించి అమలు జరిపించుకోవాల్సివుంది" అంటూ కర్తవ్యపథాన్ని నిర్దేశించారు.

ప్రారంభోపన్యాసం చేయాల్సిన కాకతీయ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ కె. వెంకటరామయ్యగారు తీవ్ర అస్వస్థతకు చిక్కి స్వయంగా సభలో పాల్గొనలేకపోయినా తన ప్రతినిధి శ్రీ పి.ఎ. జేమ్స్ (యూనివర్శిటీ కాలేజీ ప్రిన్సిపాల్) గారి ద్వారా తన వుపన్యాసాన్ని పంపేరు. శ్రీ జేమ్స్ దాన్ని సభకు అందించారు.



కాకతీయ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్
ప్రొ. కె. వెంకటరామయ్యగారి ప్రారంభోపన్యాసాన్ని
వినిపిస్తున్న శ్రీ పి.ఎ. జేమ్స్ యూనివర్శిటీ కాలేజీ ప్రిన్సిపాల్

విద్యార్థులు విద్యాలయాల్లో నేర్చుకొంటున్నదానికి ఆ తర్వాత అది నిజజీవితంలో ఉపయోగించేదానికి ఏ మాత్రం సంబంధం ఉండటం లేదనీ, ఏ సంస్కరణను ప్రవేశపెట్టినా అసలు విద్యను బోధించేవారి అభిప్రాయాలు తీసుకొని వాటిని అమలులోకి తేవాలనీ, విద్య మానవ అర్థికావసరాలతో పాటు, దేశావసరాలను తీర్చే ఉత్పాదకశక్తిని పెంచేందుకు దోహదకారిగా కూడా ఉండాలంటూ ఆయన ప్రారంభోపన్యాసంలో ఉద్ఘాటించారు.

అనంతరం మార్క్సిస్టు పార్టీ పొలిట్ బ్యూరో సభ్యులు శ్రీ సుందరయ్యగారు నేటి విద్యా సమస్యల్ని వివరిస్తూ మాతృభాషలోనే విద్య బోధించాలనీ, త్రిభాషా సూత్రం రద్దుచేయాలనీ, నిరక్షరాస్యత నిర్మూలించినపుడే జాతి చైతన్యం పెరిగి, సమాజ మార్పులకు దారితీస్తుందనీ, జీవితాలకు అవసరమైన



సింపోజియంలో పాల్గొన్న
శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య
పొలిట్ బ్యూరో సభ్యులు (సి. పి. యం)

జీతాల కొసం పోరాడుతూనే, మన కంటే తక్కువ తరగతిలో ఉండి అంధకారంలో కొట్టుమిట్టాడుతూ నికృష్ట జీవితం అనుభవిస్తున్న వారి అభివృద్ధికికూడా మనం పాటుపడాలనీ ఉద్వేగంతో ఉద్బోధించారు.

తరువాత శ్రీ పంచాననమండల్ (ఎ.బి.ఇ.టి.ఎ) విద్యా విధానపు పోకడపై పత్రం చదివేరు. (అది వేరే యిస్తున్నాము)

పిదప శ్రీ యస్. యస్. ప్రసాద్ (ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ జూనియర్ లెక్చరర్స్ అసోసియేషన్) సందేశమిచ్చారు.

శ్రీ వెంకటస్వామిగారు ఆ పూట సమావేశాన్ని దిగ్విజయం చేసిన వారందరికీ అభివందనాలు చెప్పటంతో ఆ కార్యక్రమం ముగిసింది. పిదప సాయంత్రం 5 గంటలకు ఖమ్మం పట్టణ పురవీథుల్లో గొప్ప సంచలనాన్ని రేకెత్తిస్తూ ప్రదర్శన ప్రారంభమయింది.



సింపోజియంలో పాల్గొంటున్న
శ్రీ పంచానన మండల్, అధ్యక్షులు, ఎ.బి.పి.టి.ఎ.

# పట్టణంలో సంచలనం రేకెత్తిస్తూ 5 వేలమందితో బ్రహ్మాండమైన ఊరేగింపు

"ఎక్కడిదీ మహా ప్రవాహం!" అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేస్తూ ఖమ్మం పట్టణ ముఖ్యవీధులగుండా ఐదు వేలమంది ఉపాధ్యాయ ప్రతినిధులతో 17వ తేదీ సాయంత్రం బ్రహ్మాండమైన ప్రదర్శన జరిగింది. ఖమ్మం పట్టణ చరిత్రలోనే ఇంతమంది ఉపాధ్యాయులతో ఊరేగింపు జరగటం అపూర్వం.

ఆ ఊరేగింపుకు అగ్రభాగాన పెద్ద బ్యానర్‌తో రాష్ట్ర నాయకులు నడిచారు. పిదప ఐదు వందలమంది మహిళా ప్రతినిధులు బారులు తీరారు. పిదప వివిధ జిల్లాల ప్రతినిధులు తమ తమ జిల్లాల బ్యానర్ల వెనుక వరుసలు దీరగా 2 గంటలపాటు ఊరేగింపు సాగింది.



ఖమ్మం పట్టణాన్ని కదిల్చిన ఊరేగింపు

'విద్యా హక్కు పనిహక్కు రాజ్యాంగంలో చేర్చాలి!
ప్రజలందర్నీ అక్షరాస్యుల్ని చేయాలి!
నిరుద్యోగం నిర్మూలించాలి!
అధిక ధరల్ని అరికట్టాలి!
పంచాయత్ రాజ్ నుండి విద్యను వేరుచేయాలి!
విద్యా రాష్ట్రాధీనంలోనే ఉండాలి!
నిర్బంధ రిటైర్‌మెంటుకు గురయిన వారికి తిరిగి ఉద్యోగాలివ్వాలి!
వృత్తి విద్యల్ని ప్రవేశపెట్టాలి!
సిలబస్ భారం తగ్గించాలి!
నూతన శాస్త్రీయ ప్రత్యామ్నాయ విద్యా విధానం అమలు చేయాలి!
విద్యార్థి - ఉపాధ్యాయ ఐక్యత వర్థిల్లాలి!
కార్మిక - ఉపాధ్యాయ ఐక్యత వర్థిల్లాలి!
ఉద్యోగి - ఉపాధ్యాయ ఐక్యత వర్థిల్లాలి!
ఉపాధ్యాయ సంఘాల ఐక్యత వర్థిల్లాలి!
యు. టి. యఫ్. - జిందాబాద్!
అమరజీవి చెన్నుపాటికి జోహార్!'

—మొదలైన నినాదాలతో ఖమ్మం పట్టణం మారుమ్రోగుతుంటే సెంటర్లలో గుమిగూడిన వివిధ వర్గాల ప్రజలు ఊరేగింపును విస్ఫారితనయనాలతో వీక్షించారు.

వివిధ జిల్లాల బ్యానర్లతో, నినాదాల ప్లే కార్డులతో,



ఊరేగింపులో మహిళా ప్రతినిధులు

యు. టి. యఫ్. పతకాలతో ఒక మహా ప్రవాహంలాగా క్రమ పద్ధతిలో ఊరేగింపు సాగిపోతుంటే అటూ ఇటూ నిలబడి చూస్తున్న ఉద్యోగులు, రిక్షా కార్మికులు, వివిధ వృత్తులవారు తమ కోర్కెలు పండుతున్నట్టు, తమబిడ్డల భవిష్యత్తు నెరవేరుతున్నట్టు కళ్ళల్లో ఉత్సాహ ప్రభలు వెలార్చారు,

'ఎంత క్రమశిక్షణ! ఇంతమంది విద్యాభివృద్ధిని చర్చించటానికి వచ్చారా? – ఒకాయన ఆశ్చర్యం.

'ఈ ఉద్యమశక్తిని ఎవరూ అడ్డలేరు!' ఓ రిటైర్డు టీచర్ మెచ్చికోలు.

"ఇక తెలంగాణా అంతా యు టి.యఫ్ మయం అవుతుంది!" ఓ సోదర సంఘ నాయకుని వ్యాఖ్యానం.

"మేం కూడా ఊరేగింపులో చేరితే బాగుండును!" విద్యార్థుల తహతహ.

"అమే మా టీచర్!" తలిదండ్రులకు వేలెత్తి చూపుతున్న ఓ బాలిక.

"ఇట్లా ఉద్యోగులంతా కలిస్తేనా ...!" ఓ ఉద్యోగి ఆకాంక్ష

చివర కన్పించని ఊరేగింపు అంచనాకు ఆ చివరి నుండి ఈ చివరికి సైకిళ్ళపై పయనిస్తున్న యువకులు.

—ఇలా అన్నివర్గాల ప్రజలూ ఆశ్చర్యచకితులు కావటమే కాకుండా తమ సౌహార్దతను కళ్ళల్లో ప్రతిఫలింప జేశారు.

కొందరు మహిళల చంకల్లో పసిబిడ్డలున్నారు.

మరికొందరు ప్రతినిధులు చేతిసంచులతోనే పాల్గొన్నారు.

ఆఖరికి గర్భవతులుకూడా ఆ ఊరేగింపులో నడిచారు,

ఆ క్రిందటి రోజంతా ప్రయాణ బడలికఉన్నా, రాత్రంతా నిద్రలేకపోయినా, పగలంతా అవిరామంగా సభలో పాల్గొన్నా-వాటిని లెక్కచేయకుండా ప్రతినిధులు అపూర్వదీక్షను, ఉత్సాహాన్ని ప్రదర్శించి ఊరేగింపును దిగ్విజయంచేశారు.

ప్రజలందరికీ చెందిన నినాదాలు ప్రతిధ్వనించేసరికి ఆ ఊరేగింపుకు ప్రత్యేక ప్రాధాన్యతవచ్చి, అందరిఆదరాభిమానాలు పొందటమేకాకుండా ప్రజాచైతన్య వాహినిలో అంతర్లీనత సాధించటంతో మరింత దిగ్విజయమయింది.

# వైజ్ఞానిక ప్రదర్శనలు

పిదప ఆ రాత్రి 8 గంటలకు వైజ్ఞానిక సభలు జరిగినయ్. ఆ సభకు యు.టి.యఫ్. ఉపాధ్యక్షులు శ్రీ పి.వి. సుబ్బరాజు అధ్యక్షత వహించారు. ఆంధ్ర ప్రజా నాట్యమండలి అధ్యక్షులు డా. ఎ. పి విఠల్ సభను ప్రారంభించారు.



వైజ్ఞానిక సభకు అధ్యక్షత వహించిన
శ్రీ పి. వి. సుబ్బరాజు, ఉపాధ్యక్షులు, యు. టి. యఫ్.

శ్రీ సుబ్బరాజు మాట్లాడుతూ 'నేటియువతరం ప్రస్తుత సామాజిక ఆర్థిక పరిస్థితుల్నిబట్టి అపమార్గాలు పడుతున్నారు. వారిని సరియైన దారికి తెచ్చి అన్యాయాలకు వ్యతిరేకంగా సంఘటిత పరచటానికి, ఆదర్శ వీరులుగా తయారుచేయటానికి పూనుకోకపోతే అపార యువశక్తి నిర్వీర్యమై పనికి రాకుండా పోతుంది. అందుకుపయోగించేవే వైజ్ఞానిక ప్రదర్శనలు. చైనా, వియత్నాం చరిత్రలు చూస్తే ఉపాధ్యాయులు వైజ్ఞానిక కార్యక్రమాల ద్వారా అక్కడి ప్రజల్ని చైతన్య పరిచారు. త్యాగాలకు వెరవని వీరులుగా తయారుచేశారు. ఆ విధంగానే విద్యార్థుల్లో దాగివుండే కళాపిపాసను మనం వెలికి తెచ్చి జాతి ప్రయోజనాలకుపయోగించే విధంగా దాన్ని తీర్చిదిద్దాలన్నారు.



వైజ్ఞానిక సభ ప్రారంభిస్తున్న
డా. ఎ. పి. విఠల్, అధ్యక్షులు, ఆంధ్రప్రజా నాట్యమండలి

పిదప డా పి. విఠల్ సభను ప్రారంభిస్తూ 'మనం విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధి కోసం కృషి చేయాలి. వారి భవిష్యత్తుకు అవరోధంగా ఉన్న దోపిడీ సమాజపు రూపురేఖల్ని కళారూపాల ద్వారా అవగతమయ్యేటట్టు చేయాలి. ఇదంతా సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా సాధ్యమవుతుంది.

ప్రభుత్వం యువతరం యెడ నిర్లక్ష్య భావం చూపుతున్నది. సమాజం యొక్క వెనుకబాటుతనం తమ దోపిడీ యథేచ్ఛగా సాగటానికి వీలవుతుందనే ఉద్దేశ్యంతో అశ్లీల సాహిత్యాన్ని నిషేధించకుండా పల్లె పల్లెకు వ్యాపింపజేయటానికి తోడ్పడుతున్నది.

ప్రస్తుతం ధైర్య సాహసాల్ని పురికొల్పే సాహిత్యానికి చోటు లేదు. అన్యాయాలను, అక్రమాలను తెల్పటానికి వీలు లేదు న్యాయాన్ని సమర్థించేదానికికూడా నిషేధాలున్నయ్. రైల్వే సమ్మెను బలపరుస్తూ రచన ప్రచురించిందని సృజన ఎడిటర్ హేమలతకు రెండేళ్ళు శిక్ష విధించారు. ఆ సమ్మెకు నాయకత్వం వహించిన ఫెర్నాండెజ్ నేడు మంత్రిఅయ్యారు. ఇవన్నీ విద్యార్థుల గమనంలోకి రావాలి, అపని ఉపాధ్యాయులే చేయగలరు.

మనం పాఠాలు చెప్పటంతోనే తృప్తి పడరాదు. చెప్పే విషయంకూడా సరియైనదో కాదో పరిశీలించాలి. నేటిపాఠ్యాంశాల్లో వాస్తవ విరుద్ధాలు, ఛాందస భావాల్ని ప్రోత్సహించేవి, అశాస్త్రీయమైనవి అనేకం ఉంటున్నాయి. వాటిల్లో నిజానిజాల్నికూడా మనం విద్యార్థులకి చెప్పినపుడే న్యాయం చేసినవాళ్ళమవుతాము.

ఏ దేశ చరిత్రనైనా చూడండి. జాతి నిర్మాణంలో ఉపాధ్యాయులే కీలకపాత్ర వహిస్తున్నారు. వియత్నాం విప్లవ పోరాట చరిత్రే దానికుదాహరణ. అక్కడి పాఠశాలలు సినిమాలు, కళలు అన్నీ జాతి ప్రయోజనానికే ఉపయోగిస్తున్నారు. అంటూ ఉదాహరణ పూర్వకంగా వివరించి సభికుల్ని ఉత్తేజపరిచారు.

తదనంతరం పెండింగ్ ఫైల్, మానవుడు (నాటికలు) చెన్నుపాటి బుర్రకథ, మిమిక్రీ మొదలగు ప్రదర్శనలు సాగిన తర్వాత ఆనాటి కార్యక్రమం సమాప్తమైంది. ఆ కార్యక్రమంలో కూడా ప్రొద్దుపోయే దాకా వేలాది ప్రతినిధులు పాల్గొన్నారు.

ఆ కార్యక్రమానికి శ్రీ యన్. రామకోటేశ్వరరావు (అధ్యక్షులు, కృష్ణాజిల్లాశాఖ) కన్వీనర్‌గా వ్యవహరించారు.

---

## బహుమతి పొందిన వైజ్ఞానిక ప్రదర్శనలు

ప్రథమ బహుమతి : ప॥ గో॥ జిల్లా, పాలకొల్లు పట్టణ శాఖవారి 'పెండింగ్ ఫైల్' (నాటిక)

ద్వితీయ బహుమతి : ప॥ గో॥ జిల్లా ఆకివీడు సమితిశాఖ 'మానవుడు' (నాటిక)

తృతీయ బహుమతి : తూ॥గో॥ జిల్లా ముమ్మిడివరంసమితి నవోదయ బుర్రకథదళం 'చెన్నుపాటి లక్ష్మయ్య'

— వైజ్ఞానిక ప్రదర్శనలకు శ్రీ యన్. రామకోటేశ్వరరావు (అధ్యక్షుడు, కృష్ణా జిల్లా శాఖ) కన్వీనరుగా వ్యవహరించారు.

### రెండవరోజు మహాసభ

మహాసభ రెండవరోజున ఉదయం 8 గం.లకు జరిగిన ప్రతినిధుల సభలో యు.టి.యఫ్. ఉపాధ్యక్షుడు శ్రీ యస్. సీతారామాచారి ప్రవేశపెట్టిన తీర్మానాలు, శ్రీ డి. రామిరెడ్డి ప్రవేశపెట్టిన నిబంధనావళి సవరణలు, శ్రీ ఎ. వెంకటస్వామి ప్రవేశపెట్టిన కృషినివేదిక, ఆర్థిక రిపోర్టులు, శ్రీ మైనేనివెంకటరత్నం ప్రవేశపెట్టిన పత్రికా నివేదిక చర్చింపబడి ఆమోదింపబడ్డాయి. ఆ నివేదికలపై చర్చల్లో కౌన్సిల్ సమావేశంలోగాని, ప్రతినిధుల సమావేశంలోగాని మొత్తం ఏభైమందిదాకా పాల్గొన్నారు. మహాసభ కార్యక్రమాలకు అంతరాయం కలక్కుండా నూతన కౌన్సిల్ సమావేశాలు 16,17,18 రాత్రుల్లోకూడా జరిగేయి. ఉద్యమ నిర్మాణం, తీర్మానాలపై చర్చలు, పత్రికాభివృద్ధి, ఆర్థిక పరిస్థితులపై సభ్యులు వివిధ సూచనలు చేశారు. ఉద్యమ పటిష్ఠతకు తగునిర్ణయాలు తీసుకొన్నారు.

ప్రతినిధుల సమావేశం తర్వాత శ్రీ ఎన్. జ్ఞానయ్య, శ్రీ డి. శివరామరాజు (యం.యల్.సి) శ్రీ యం.జె. మాణిక్యారావు (యం.యల్.సి) శ్రీ డి. సత్యనారాయణ (సంయుక్తాధ్యక్షుడు, యస్.టి.యు) మొదలగు ప్రముఖులు సందేశాలిచ్చారు. (ఆ వివరాలు ప్రత్యేకంగా ప్రచురిస్తున్నాం)

పిదప ప.గో. జిల్లా ఉపాధ్యక్షులు శ్రీ గోపాలంగారు మహాసభల్ని అపూర్వంగా నిర్వహిస్తున్న ఖమ్మం జిల్లా కమిటీకి చెన్నుపాటి చిత్రాన్ని బహూకరించారు.

పత్రికా కాంపెయిన్లలోను, జీవిత చందాల కాంపెయిన్లలోను విజేతలైన వివిధ జిల్లా శాఖలకు శ్రీ యం. జె. మాణిక్యారావుగారిద్వారా బహుమతి ప్రదానం చేయబడింది.

పశ్చిమ బెంగాల్ నుండి వచ్చిన శ్రీ అమితవ సేన్ (టీచర్స్ జర్నల్ సంపాదకుడు) తమ సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీమతి అనిలాదేవి సందేశాన్ని చదివి వినిపించారు.

# పదివేల మందితో అపూర్వంగా విద్యాగోష్ఠి

## విద్యావిధానంలో మౌలిక మార్పుల్ని సూచిస్తూ పలువురు విద్యావేత్తల ప్రసంగాలు

మధ్యాహ్నం శ్రీ యం. జె. మాణిక్యారావుగారి అధ్యక్షతన విద్యాగోష్ఠి ప్రారంభమయింది. ఆ గోష్ఠికి పదివేలమందికి పైగా విద్యాభిమానులు హాజరుకావటంఖమ్మంపట్టణచరిత్రలోనే గాక, ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలోనే అపూర్వం. ప్రతినిధులకు విశాలంగా ఏర్పరచిన షామియానాలుచాలక ఆవరణంతా జనంతో క్రిక్కిరిసి పోయింది. వీలున్నచోటుల్లా హాస్టల్ వరండాల్లో, రోడ్లమీదా నిలబడి వివిధ వర్గాల ప్రజలుప్రసంగాల్ని చర్చల్ని ఆత్యాసక్తితో విన్నారు.



కేంద్ర విద్యామంత్రి శ్రీ పి. సి. చుందర్ సభలో ప్రవేశిస్తున్న దృశ్యం

విద్యాగోష్ఠిని ప్రారంభించటానికి వచ్చిన కేంద్ర విద్యాశాఖామంత్రి డాక్టర్ పి.సి. చుందర్‌ను ఇతర వక్తల్ని హర్షధ్వానాల మధ్య శ్రీ ఎ. వెంకటస్వామి వేదికపైకి ఆహ్వానించగా డా॥ వై. రాధాకృష్ణమూర్తి ఆహ్వానసంఘం తరఫున స్వాగతం పలుకగా, యు.టి.యఫ్ తరఫున అధ్యక్షులు శ్రీ కె. నారాయణ



పత్రికా క్యాంపెయిన్లలో శ్రీ యం. జె. మాణిక్యారావుగారిద్వారా బహుమతులందుకొంటున్న విజేతలైన జిల్లాప్రతినిధులు
శ్రీ సి. హెచ్. రాజారావు(ఖమ్మం) శ్రీ పి. బి. ముత్తారావు(తూ. గో.) శ్రీ వి. సూర్యనారాయణరాజు(తూ.గో.)
శ్రీ టి. అంజిరెడ్డి(గుంటూరు) శ్రీ కె. రాఘవరాజు(ప.గో.) శ్రీ కె. బ్రహ్మాజీరావు(తూ.గో.) శ్రీ టి. బాలకృష్ణమూర్తి(ప్రకాశం)



శ్రీ విద్యామంత్రిని వేదికపైకి
ఆహ్వానిస్తున్న శ్రీ ఎ. వెంకటస్వామి



శ్రీ విద్యామంత్రికి మెమొరాండం సమర్పిస్తున్న
యు. టి. ఎఫ్. అధ్యక్షులు

రావు సన్మానపత్రం, కోర్కెల మెమొరాండం సమర్పించారు.

అధ్యక్షులు శ్రీ యం. జె. మాణిక్యారావు మాట్లాడుతూ 'సమాజంలో ఉపాధ్యాయుల స్థానాన్ని, దానిని మెరుగుపరచవలసిన స్థితినీ, జాతిజీవితంలో ఉపాధ్యాయుల కీలకపాత్రనూ వివరించారు. (పూర్తిపాఠం విడిగా ఇస్తున్నాం)



విద్యాగోష్ఠిలో అధ్యక్షోపన్యాసమిస్తున్న
శ్రీ యం. జె. మాణిక్యారావు (యం. యల్. సి)



గోష్ఠిప్రారంభంలో దేశభక్తిగేయం ఆలపిస్తున్న శ్రీ పి. సాంబయ్య

పిదప కేంద్ర విద్యామంత్రి వేదికదిగి, ఉపాధ్యాయులకు అభిముఖంగానిల్చి, 'తానూ ఉపాధ్యాయుణ్ణేనని, ఉపాధ్యాయ సంఘాల్లో పనిచేసినవాణ్ణేననీ, చెప్పి తమ మధ్యగల సమాన స్థాయిని ఉదహరిస్తూ తమ ఉపన్యాసాన్ని వయోజన విద్యమీద కేంద్రీకరించి సార్వజనీనిక విద్యా ప్రచారంలో ఉపాధ్యాయులు సహకరించాల్సిన కర్తవ్యాల్ని సూచించారు. (పూర్తి పాఠం ప్రత్యేకంగా ఇస్తున్నాం.)



శ్రీ విద్యామంత్రికి స్వాగతం పలుకుతున్న
శ్రీ వై. రాధాకృష్ణమూర్తి.



సందేశమిస్తున్న వి. రామచంద్రన్ (డి. హెచ్. యి.)

పిదప హైయర్ ఎడ్యుకేషన్ డైరెక్టర్ శ్రీ రామచంద్రన్ మాట్లాడుతూ 'వయోజనవిద్యకూ, ప్రాథమిక విద్యకూ మీా కృషి కేంద్రీకరించాలనీ బోధన యాంత్రికంగా గాక శాస్త్రీయఅవగాహనతో సాగించి కర్తవ్యంనిర్వహించాల'న్నారు.



గోష్ఠిలో ప్రసంగిస్తున్న శ్రీ వై. వి. సుబ్బారావు
ప్రధాన కార్యదర్శి, ఎ. ఐ. పి. యి. ఎ.

తరువాత శ్రీ వై. వి. సుబ్బారావు 10+2+3 విద్యా విధానాన్ని గురించి మాట్లాడుతూ ఇలా అన్నారు.

కొఠారీ కమీషన్ సిఫార్సులు అమలు జరుపుతున్నామని చెప్పటంతప్ప ఆ సూచనల్లోని మౌలికమైన మార్పులుఇప్పటికీ తీసుకురాబడలేదు. ఆ సూచనల్లో వున్నట్టు వృత్తి విద్యలకు ప్రాధాన్యతయిస్తే ఉపాధి సౌకర్యాలు కల్పించలేమేమోనని వీళ్ళభయం. పరిశ్రమలన్నిటినీ జాతీయం చేయాల్సి వస్తుందేమోనని వీళ్ళభీతి. వర్గప్రయోజనాలదృష్ట్యా వాటిని వాయిదా వేస్తున్నారుతప్ప మరేదీకాదు. కాన మన సంఘటిత ఉపాధ్యాయ ఉద్యమం నిర్భయంగా ఆ మార్పుల కోసం పోరాడాలి. దానికి ఈ మహాసభ తప్పక దోహదం చేస్తుందని' ఆశిస్తున్నాను (ఉపన్యాస పూర్తిపాఠం ప్రత్యేకంగాఇస్తున్నాం.)



విద్యాగోష్ఠిలో ప్రసంగిస్తున్న శ్రీ మధు
ప్రధాన కార్యదర్శి, యస్. యఫ్. ఐ.

పిదప యస్.యఫ్.ఐ, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ పి. మధు మాట్లాడుతూ ఇలా అన్నారు.

ఎమర్జన్సీ కాలంలో విద్యా రంగంలో ప్రమాదకరమైన ధోరణులు ప్రవేశపెట్టబడినాయి. నూతన విద్యా విధానం ఏ రీతిగా తీర్చిదిద్దాలి అనే విషయం మీాద 1975 నవంబరులో సెంట్రల్ ఎడ్వయిజరీ బోర్డులో కొన్ని ముఖ్య నిర్ణయాలు చేయబడ్డాయి. ఆ సమావేశంలో శ్రీమతి గాంధి 'నిరుద్యోగం పెరుగుతున్నదిగాన కాలేజీలు పెంచగూడద'ని సలహా ఇచ్చారు. దాని ప్రకారం అనేక కాలేజీలు తగ్గించడం ప్రారంభించారు. ఓ ప్రక్క నిరక్షరాతస్య పెరిగిపోవటం... మరో ప్రక్క ఉన్న విద్యాలయాల్ని ఊడబెరగటం ఇదీ దుస్థితి.

ఇది యిలా వుండగా విద్యాపద్దుల్లో నానాటికి కోత పెట్టటం, పంచవర్ష ప్రణాళికలన్నీ వ్యాపారదృష్టితో సాగటం, అవి కొనసాగే కొలదీ నిరుద్యోగం పెరగటం - ఈ దుస్థితి ఇలా ఉంటే ఎక్కువమందిని తప్పించటం ద్వారా నిరుద్యోగాన్ని అరికట్టవచ్చనే మరో సూత్రం అవలంబించటం - ఇవీ విద్యా రంగంలో సాగుతున్న దుర్మార్గపద్ధతులు.

వీటి నరికట్టే దానికి నిర్మాణయుతమైన సూచనలు చేయటమే గాక నిరక్షరాస్యత నిర్మూలనలో జాతి అభివృద్ధికి జరిగే పోరాటంలో మనం నడుం బిగించాలని ఉద్బోధిస్తూ, ఈ మహాసభ భావి జాతి రూపురేఖలు దిద్దే విద్యావిధానం రూపొందించి ప్రభుత్వంతో అచరింపజేయాలని ఆకాంక్షిస్తూ, దానికి విద్యార్థి ఉద్యమం ఎప్పుడూ తోడుగా ఉంటుందని హామీ యిచ్చి శ్రీ మధు తమ ప్రసంగాన్ని ముగించారు.



విద్యాగోష్ఠిలో ప్రసంగిస్తున్న శ్రీ అమితవసేన్,
ప॥ బెంగాల్ టీచర్స్ జర్నల్ సంపాదకులు

తర్వాత ఆల్ బెంగాల్ టీచర్స్, జర్నల్ సంపాదకుడు అమితవసేన్ ఇలా మాట్లాడేరు.

'మా రాష్ట్రంలో ఫాసిస్టు నియతృత్వం అలవరుచుకొన్న ప్రభుత్వాన్ని కూలద్రోశాము. ఇప్పుడు స్వేచ్ఛగా మా భావాలను చెప్పుకొనే అవకాశం, సంస్థను పటిష్ఠంగా నిర్వహించుకొనే అవకాశం వచ్చింది. మీారుకూడా పటిష్ఠంగా విస్తృతంగా ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోతారని గాఢంగా విశ్వసిస్తున్నాము.

ఎమర్జన్సీకాలంలో మన దేశంలో విద్య ఎంతో పురోగమించినట్టు అతిశయోక్తులతో వ్రాసిన గణాంక వివరాలుగల పుస్తకం నేను చూశాను. నూటికి 16 మంది విద్యార్థులుమాత్రమే మనదేశంలో పాఠశాలలకు హాజరవుతున్నారనికూడ దానిలో ఉన్నది. ఆంధ్రప్రదేశ్‌లో విద్యారంగానికి తలసరివ్యయం రు. 20/అనికూడ ఉన్నది. ఇదీ ఎమర్జెన్సీ అభివృద్ధి!' అన్నారు.



విద్యాగోష్ఠిలో ప్రసంగిస్తున్న శ్రీవావిలాల గోపాలకృష్ణయ్య



ఉపన్యసిస్తున్న పంజాబ్ ఉపాధ్యాయ సంఘ నాయకుడు శ్రీ భగత్‌రాం, అనువదిస్తున్న శ్రీ కౌముది.

తర్వాతశ్రీవావిలాల గోపాలకృష్ణయ్య 'మాతృభాషలో విద్యాబోధన అనే విషయంపై మాట్లాడేరు.

"మీరింత మంది మాతృభాషలోనే విద్యాబోధన సాగించాలని కోరటం నాకెంతో ఆనందంగావుంది. ఇంగ్లీషు పాలన పోయినా ఇంగ్లీషుపై మోజుపోలేదు. ఈ మోజు శుభలేఖలు కూడా ఆంగ్లంలో అచ్చువేసేంతవరకు పోయింది." 'మేమూ-మా ప్రభుత్వమూ పోయినా మా భాషవుంటుంది' అన్నాడు మెకాలే ప్రభుత్వ విధానాలుకూడా దానికనుగుణంగానే సాగుతున్నాయ్. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సెనేట్ సభ్యుడుగా వున్నప్పుడు 'ఉన్నత విద్యల్నికూడా తెలుగు భాషలోనే వుండాలని వాదిస్తే 'నన్ను తెలుగు పిశాచి' అన్నారు.

అసలు విద్యార్థి నేర్చుకోవాల్సింది భాషా? విషయమా? విషయమే అని నా అభిప్రాయం. అది మాతృభాషలో అయితే సులభంగా బోధపడుతుంది. తన అభిప్రాయాల్ని విద్యార్థి మాతృభాషలోనే తేలిగ్గా వ్యక్తం చేయగలడు. గత ఇంటర్ పరీక్షలలో తెలుగు మీడియం వారు 36 శాతం ఉత్తీర్ణులైతే ఇంగ్లీషు మీడియంవారు 26 శాతం మాత్రమే ప్యాసయ్యారు.

మాతృభాషలో విద్యాబోధన సాగితేనే విద్య అందరిదీ అవుతుంది. అపుడే మనం నిరక్షరాస్యత తొలగింపగలం. అందుకు ఉపాధ్యాయుల పాత్ర ఎంతో వుంది. మీరు మీ ఉద్యమం ద్వారా చైతన్యవంతులై దాన్నింకా ముందుకు తీసుకుపోండి! అంటూ ప్రబోధించారు.

తర్వాత పంజాబ్ ఉపాధ్యాయనాయకులు శ్రీభగత్‌రాం (యమ్.పి.) ఇలా మాట్లాడేరు.

మన దేశంలో ఉపాధ్యాయుల ప్రధాన బాధ్యత సక్రమమైనవిద్య అందించటం, శాస్త్రీయ అవగాహన కల్గించటం. అంతేగాక తమపట్ల, ప్రజలపట్ల, సమాజంపట్ల గురుతరమైన బాధ్యతలున్నాయి.

కాని ఉపాధ్యాయులకు తగిన జీతాలు లేనప్పుడు, ఈ బాధ్యతా నిర్వహణ సాధ్యంగాదు. తన కుటుంబాన్ని సరిగా పోషించుకోగల ఆర్థిక స్థితి ఏర్పడినప్పుడే బిడ్డకు విద్యాబుద్ధులు గరిపి న్యాయం చెకూర్చగలం. కాని 30 సంవత్సరాలుగా మనకృషి ఫలింపలేదు. అందువల్ల ప్రతి ఉపాధ్యాయుడు మన సంఘంలో సభ్యుడుగా చేరేట్టు కృషిచేయాలి. పోరాడి తమ హక్కుల్ని సాధించుకొనేందుకు సిద్ధపరచాలి. అత్యధిక ఉపాధ్యాయుల్ని ఐక్యపరచి సంఘటితశక్తి ప్రదర్శించినపుడే మనం విజయం పొందగలం.

ఈ రాష్ట్రంలో ఐక్య ఉద్యమం వేగంగా ముందుకు సాగుతున్నందుకు సంతోషం. రాష్ట్రంలోని ఉపాధ్యాయులందరినీ మీ పతాకం క్రిందికి తెస్తారని ఆశాభావం వున్నది. మన కోర్కెలు ఇతర సంఘాలవారి కోర్కెలతో సంబంధాలు కలిగి ఉంటాయి. సర్వీసు పరిస్థితుల మెరుగుదల కోసం అంతా పోరాటం సాగించక తప్పదు ఆ పరిస్థితులను ప్రజాతంత్రం చేయాలి. ట్రేడ్ యూనియన్ హక్కుల్ని మనం సంపాదించుకోవాలి. ఇతర ఉద్యోగసంఘాల వారిని సోదరులవలె భావించి వారితో కలిసి, వారిని కలుపుకొని పోరాడినపుడే సమస్యలు పరిష్కారమవుతాయి.

గత 30 సంవత్సరాల కాంగ్రెస్ పాలనలో నిరుద్యోగం, నిరక్షరాస్యత, సంక్షోభం వ్యాపించాయి. మన సమాజంలో అవినీతి, కరువు విచ్చలవిడి అయ్యాయి. అవి ఎందుకు ప్రబలుతున్నాయో మీరు ఆలోచించాలి. నిరక్షరాస్యులకు ఆ వాస్తవాలను తెలియజేయాలి దేశంలో భూస్వామ్య, పెట్టుబడిదారీ విధానం రద్దు కానంతవరకు, పెద్ద పరిశ్రమలన్నింటినీ జాతీయం చేయనంతవరకు సమస్యలకు శాశ్వత పరిష్కారం సాధ్యంగాదు. ఈ విషయాన్ని తెలియని ప్రజలందరికీ తెలియజెప్పటం మన బాధ్యత.

ఆంధ్రప్రదేశ్‌లో పోరాట సాంప్రదాయంవుంది. దేశస్వాతంత్ర్య పోరాటంలోనూ ఆ తర్వాత హక్కులు సాధించుకొనే పోరాటంలో మీరు నిర్వహించిన పాత్రకు మా రాష్ట్ర ప్రజలుకూడా రుణపడివున్నారు. దేశంలో నియంతృత్వ పోకడల్ని నిర్మూలించే మార్గంలో మీరుకూడా పయనిస్తారని నాకు విశ్వాసంవుంది. దేశంలో ప్రజాస్వామ్యం స్థాపించకుండా, ఆధిపత్యం కాకుండా మనహక్కుల సాధన సాధ్యంగాదు. మీ ఆహ్వానానికి ఇవే నా కృతజ్ఞతలు!

విద్యా గోష్ఠిలో పాల్గొన్న వారందరికీ శ్రీ ఎ.వి. స్వామి వందన సమర్పణ చేశారు.



బహిరంగ సభలో అధ్యక్షోపన్యాసమిస్తున్న
శ్రీ వై. రాధాకృష్ణమూర్తి.

# బహిరంగ సభ

సాయంతం జరిగిన బహిరంగసభకు శ్రీ వై. రాధాకృష్ణమూర్తిగారు అధ్యక్షత వహించారు.

శ్రీ చేకూరి కాశయ్యగారు సభను ప్రారంభిస్తూ "మన రాష్ట్రంలో విద్యాబిల్లు కొన్ని సమస్యలనైనా పరిష్కరిస్తుందని ఆశించాము. కాని అది వాయిదా పడింది. వివిధ యాజమాన్యాల క్రింద పాఠశాలలు ఉంటే విద్యాభివృద్ధి సాధ్యం కాదు సమస్యలు పరిష్కారంగావు. జిల్లా పరిషత్తులు ఇంద్రలోకాలయ్యాయి. బదిలీలు ఉపాధ్యాయుల్లో భయాందోళనలు కల్గిచుతూ వారి మనోనిబ్బరాన్ని దెబ్బతీస్తున్నాయి. అలాగే ఎయిడెడ్ స్కూళ్ళు వ్యాపార కేంద్రాలయ్యాయి. అక్కడ వృత్తిభద్రతగాని, సంక్షేమంగాని లేవని చెప్పి అనేక ఉదాహరణ లిచ్చారు. ఈ అన్నిటినుండి విద్యారంగాన్ని రక్షించేందుకు ప్రజలు, ప్రజాప్రతినిధులు ముందుకు రావాలని విజ్ఞప్తి చేశారు.

పిదప శ్రీ సత్య పి. శరరాయ్ మాట్లాడుతూ 'కేంద్రవిద్యా మంత్రి శ్రీ చుండర్ చెప్పినట్లు విద్యను అభివృద్ధి చేస్తే నేను సంతోషిస్తాను. అయితే పయోజన విద్యకు కేటాయించింది 2 శాతం మాత్రమే. వారానికి 2 గంటలు అదనంగా పనిచేయాలంటే కష్టంగాదు. కాని ప్రభుత్వ విధానాలు దానికనుగుణంగా ప్రోత్సాహకరంగా మారాలి మానవశక్తిని పూర్తిగా వినియోగించుకోవాలంటే వనరులు సమాజపరంగా వాలి. అది చైనాలో సాధ్యపడింది. మనకు మన ప్రభుత్వానికి సాధ్యంగాదు. దేశ వనరులు సమాజానికంతటికీ వర్తించటానికి నేటి ప్రభుత్వం అంగీకరించదు. చదువుకొన్న ప్రతివాడికీ ఉద్యోగం గ్యారంటీ చేస్తే నిరక్షరాస్యతను నిర్మూలించటం పెద్దకష్టంగాదు. రాజ్యాంగం 14 భాషలు గుర్తించింది వాటిద్వారా ఆయా భాషా ప్రాంతాల్లో విద్యాబోధ సాగించవచ్చు. మాతృభాషలో విద్యాబోధన సాగిస్తూ పయోజన విద్యావ్యాప్తి నిరక్షరాస్యతా నిర్మూలన సాధించగలం అంటూ ఆయన సోదాహరణంగా వివరించారు.

శ్రీ యమ్. మాధవరావు (యమ్.యల్.సి.) మాట్లాడుతూ నేటి సమాజంలో కష్టజీవులకూ, బుద్ధిజీవులకూ పెద్ద



ప్రతినిధులతో సహపంక్తి భోజనం చేస్తున్న శ్రీ పి. సి. చుండర్

అంతరాలు పాటింపబడుతున్నాయని, శ్రమ చేయటం తక్కువతనంగా భావింపబడుతున్నదనీ, ఈ పద్ధతిపోయి శ్రమను విలువగట్టే విద్యా విధానం తక్షణం అమలులోకి రావాలని ఉద్బోధించారు.

శ్రీమతి మోటూరు ఉదయం (రాష్ట్ర మహిళా సంఘ కార్యదర్శి) మాట్లాడుతూ అచిరకాలంలోనే రాష్ట్రవ్యాప్తంగా ఉపాధ్యాయుల్ని సమీకరించినందుకు అభినందిస్తున్నాను. నిత్యం సమస్యలతో సతమతమయ్యే వారి తరఫున నిబద్ధ నిర్విరామంగా పరిష్కార కృషి సాగించబట్టే ఈ అభివృద్ధి సాధ్యమయింది. అత్యవసర పరిస్థితిలో కూడా పీడితోపాధ్యాయుల కోర్కెల్ని ప్రతిధ్వనించటం మూలంగానే ఈ మహాసభ యు.టి.యఫ్.



ఒకేసారి 15 వందల మందికి వీలయ్యే భోజనశాల దృశ్యం

ఆధ్వర్యాన బ్రహ్మాండంగా విజయవంతమయింది. బదిలీలు ఉపాధ్యాయుల పాలిటి ప్రాణాంతకాలయ్యాయి. భార్యాభర్తల్ని విడదీయటం, కక్షాచర్యలు సాగించటం సర్వసామాన్య మయిందంటూ ఆమె వివిధోదాహరణ లిచ్చారు. శ్రీమతి ఉదయం ప్రత్యేక విజ్ఞప్తి చేస్తూ ఉపాధ్యాయినులు కూడా కార్యకర్తలుగా ఉద్యమంలో ముందుకు రావాలనీ, అప్పుడది మరింత పటిష్ఠమౌతుందని అన్నారు.

పిదప రాష్ట్ర సంఘ నూతన కార్యవర్గ ఎన్నికలు 'ఐక్య ఉపాధ్యాయ' పత్రిక సంపాదకవర్గ ఎన్నికలు, ఆడిట్ కమిటీ ఎన్నికలు జరిగాయి.

## రాష్ట్రసంఘ నూతన కార్యవర్గం

అధ్యక్షుడు : శ్రీ కె. నారాయణరావు

ఉపాధ్యక్షులు : సర్వశ్రీ యన్. సీతారామాచారి, పి. వి. సుబ్బరాజు, జి. లక్ష్మయ్య, కె. భద్రయ్య, టి. అంజిరెడ్డి

ప్రధాన కార్యదర్శి : శ్రీ ఎ. వెంకటస్వామి,

కార్యదర్శులు : సర్వశ్రీ డి. రామిరెడ్డి, కె. తిరుపాలు, ఆర్. రాఘవయ్య, ఎన్. ఆర్. పోలిసెట్టి, యం. నరహరి, పి. సత్యనారాయణ.

కార్యవర్గసభ్యులు : సర్వశ్రీ వై. పద్మనాభం (విశాఖ) వి. సూర్యనారాయణరాజు(తూ.గో.) పి. సత్యనారాయణరాజు(ప.గో.) యమ్ ఏసురత్నం(కృష్ణా) సి. హెచ్. గోపాలరాజు(గుంటూరు) యమ్. కోటయ్య (ప్రకాశం) టి. కొండాచారి(నెల్లూరు) సి. మహదేవరెడ్డి (చిత్తూరు) బి. వెంకటసుబ్బయ్య(అనంతపూర్) జి. గోవిందప్ప(కర్నూలు) వి. మల్లికార్జునరావు(ఖమ్మం) పి. చక్రపాణి(వరంగల్) సి. హెచ్. పట్టాభిరామయ్య (నిజామాబాద్) టి.జి. గోపాలన్(మెదక్) వి.భాస్కరశర్మ (హైద్రాబాద్) యన్. విజయకుమార్(మ.నగర్) వి. బంగారయ్య(నల్గొండ) శ్రీమతి ఎ. అనసూయ(మహిళా ప్రతినిధి)

### 'ఐక్యఉపాధ్యాయ' పత్రిక సంపాదకవర్గం

సర్వశ్రీ మైనేని వెంకటరత్నం (ప్రధానసంపాదకుడు) యన్. సీతారామాచారి, కె. నారాయణరావు, ఎ. వెంకటస్వామి, యం. నరహరి.

### ఆడిట్ కమిటీ

సర్వశ్రీ టి. కొండాచారి(కన్వీనర్) పి. సత్యనారాయణరాజు, యన్. జానకి రామారావు.

చివరికి ఖమ్మం జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ వి. మల్లిఖార్జునరావు మహాసభకు హాజరయిన వారికీ, అన్ని విధాలా సహకరించి దిగ్విజయం చేసిన వారికీ వందన సమర్పణచేశారు.

శ్రీ సలాది భాస్కరరావు నర్తనశాల, (హరికథ)



పత్రికా విలేఖరులు

## మహాసభలకు హాజరైన వివిధ సోదర సంఘ ప్రతినిధుల ప్రముఖ విద్యావేత్తల సందేశాలు



సందేశమిస్తున్న శ్రీమతి రాధారుక్మిణి
తమిళనాడు ఉపాధ్యాయి సంఘ నాయకురాలు

'ఈనాడుసమాజంలోనేగాక ఉపాధ్యాయవృత్తిలోకూడా 50 శాతంపైగా స్త్రీలున్నారు. ఈ సమావేశానికి వందలాది స్త్రీలు వచ్చినా ఇంకా సమీకరణ అవసరం. లెనిన్ చెప్పినట్లు సమాజంలో సగభాగంగావున్న స్త్రీలు విప్లవ కార్యక్రమాలలో పాల్గొనకపోతే సోవియట్ విప్లవం విజయం పొందేదికాదేమో నన్నమాట మనం గమనంలో వుంచుకోవాలి. మనఉద్యమాల్లో మనం విజయాన్ని పొందాలంటే మహిళల్నికూడా నూటికి నూరుపాళ్ళు పాల్గొనేటట్లు చేయాలి. రాబోయే మహాసభలు మహిళా ప్రతినిధులతో నిండుగా వుంటాయని ఆశిస్తూ అభివందనాలు చెప్తున్నాను.'

### యస్. టి. యు, సంయుక్తాధ్యక్షుడు శ్రీ డి. సత్యనారాయణ

'వేలాదిమిత్రుల్ని ఈ సందర్భంలో కలుసుకొంటున్నందుకు ఆనందిస్తున్నా. ఉపాధ్యాయ సమస్యలపైన, విద్యావిధానం రూపొందించటంలోను రాష్ట్రంలోని అన్నిసంఘాలు తీవ్రకృషి చేయాల్సిన అవసరంఉంది. మా సంఘం ఎప్పుడూ దానికి చేదోడు వాదోడుగాఉండి ప్రముఖపాత్ర వహిస్తుంది. మీ మహాసభకు నా శుభాకాంక్షలు!

వీరేగాక పి ఆర్ టి యు అధ్యక్షులు శ్రీ కె నారాయణ, పంచాయితీరాజ్ పత్రిక ఎడిటర్ యన్. యన్. ప్రసాద్ మొదలగు ముఖ్యులకూడా సభకు హాజరయ్యారు.

### శాసన మండలి సభ్యులు శ్రీ డి. శివరామరాజుగారి సందేశం

"నన్ను మీమహాసభకు ఆహ్వానించినందుకు కృతజ్ఞతలు

క్లుప్తంగా చెప్పారు.

ఈ విధంగా పతాకావిష్కరణ మొదలు, వందన సమర్పణ దాకా ప్రతి కార్యక్రమం ప్రయోజనాత్మకంగా జరిగి ప్రతినిధుల హృదయాలలో శాశ్వతముద్ర వేసుకొని చైతన్య ప్రదీప్తికి తోడ్పడ్డాయి.



ఉపాధ్యాయుల ఆశించినట్లు సమస్యలు పరిష్కరింపబడటం లేదు. దానికి శాసన మండలి సభ్యులొక్కరే ప్రయత్నిస్తే లాభంలేదు. శాసన సభల లోపలా... బయటా తీవ్రాందోళన, సంఘటిత కృషిసాగితేనే ఫలితం లభిస్తుంది. మీకృషి, చైతన్యం, మీ సమీకరణ శాసన సభల్లో మాకు కొండంత అండనిస్తుంది. దానికి మీరు ప్రయత్నించండి. మీ సంఘాన్ని, ఉపాధ్యాయ సమైక్య ఉద్యమాన్ని ఇంకాపటిష్టం చేయండి. అప్పుడే శాసన మండలిలో మా వాణికి విలువ వుంటుంది.'



సందేశమిస్తున్న శ్రీ సి. రామయ్య
అధ్యక్షులు, తెలంగాణా ప్రభుత్వ కాలేజీ టీచర్స్ అసోసియేషన్

దేశంలో ముఖ్యమైన పరిణామాలు జరుగుతున్న సందర్భంలో మీరీ సభల్ని నిర్వహించి ఉపాధ్యాయుల్ని చైతన్యవంతుల్ని చేస్తున్నందుకు మా సంఘపక్షాన ధన్యవాదాలు! ఇంకా మిగిలిఉన్న కేటగిరీ విభేదాలు కూలదోసి విశాల ప్రజాతంత్ర ఉపాధ్యాయ ఉద్యమాన్ని నిర్మించటానికి మనం కృషి చేయాలి. విద్యఅనేది మన అంతిమ లక్ష్యమైన సమసమాజానికి తోడ్పడే సాధనంగా ఉండాలి. ఇదివరలో ప్రభుత్వాలన్నీ సోషలిస్టు వ్యవస్థను నిర్మిస్తామనిచెపూనే పెట్టుబడిదారీ విధానాల్ని మనపై రుద్దాయి. దానిఫలితమే విద్యారంగంలో సంక్షోభం, మన సంఘాలు కేవలం సమస్యలపైనేగాక సమాజాభివృద్ధి కోసంకూడా పనిజేసినపుడే ఆ సంక్షోభాన్ని పటిష్ఠవంతంగా మనం ఎదుర్కోగలం.



సందేశమిస్తున్న శ్రీ యం వి సుబ్బారెడ్డి
శక్రటరీ, ఆంధ్రపదేశ్ ప్రభుత్వ కాలేజీ టీచర్స్ అసోసియేషన్

'యు టి యఫ్. బలమైన సంస్థగా రూపొందినందుకు నాకెంతో ఆనందంగా ఉంది. మనం సమస్యలూ-హక్కులతో పాటు సమాజానికుపయోగించే నూతన విద్యావిధానం రూపొందించి ప్రజలముందు, ప్రభుత్వం ముందు పెట్టాలి. దానికి ఈ మహాసభ కరదీపికగా తోడ్పడుతుందని ఆశిస్తున్నాను.

## తెలంగాణా అఫిలియేటేడ్ అసోసియేషన్, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్.జ్ఞానయ్య

'మీరు ఇంత బ్రహ్మాండమైన కార్యక్రమం నిర్వహిస్తున్నందుకు ఆనందంగా వుంది. ఆంధ్రప్రదేశ్ అంతటికి చెందిన ఈ ప్రతినిధుల్ని చూసిన తర్వాత రాష్ట్రంలోని అన్ని ఉపాధ్యాయ సంఘాలు ఏకత్రాటిమీద నడిచే సమైక్య ఉద్యమం తప్పక వర్ధిల్లుతుందని విశ్వసిస్తున్నాను. విద్య అంటే తెలియని వ్యక్తుల అధికారంలో విద్యాపాలన సాగటంవలన విద్యావిధానం వెర్రితలలు వేస్తున్నది. కాన విద్యా విషయాలలో ప్రజా ప్రతినిధుల్ని మనం బాగా ఎడ్యుకేట్ చేయాలి. దానికి మనంకృషిచేద్దాం.'



సందేశమిస్తున్న శ్రీ యస్. యస్. ప్రసాద్
శక్రటరీ, ఆంధ్రప్రదేశ్ జూనియర్ లెక్చరర్స్ అసోసియేషన్

'ఇంటర్మీడియేట్ బోర్డు కేవలం పరీక్షావిభాగంగా పనిచేస్తున్నదే తప్ప మరి దేనికీ ఉపయోగించటంలేదు. ఈ విధంగా +2స్టేజి నిర్లక్ష్యం చేయబడుతున్నది. ఆ విషయం యీ సభలో చర్చిస్తున్నందుకు చాలా సంతోషం.'

# అధ్యక్షోపన్యాసం

శ్రీ యం. జె. మాణిక్యారావు
ప్రధాన కార్యదర్శి, ఆక్టా (యం.యల్.సి)

మనదేశ చరిత్రలో ఇప్పుడొక మలుపు తీసుకొంటున్నది. ఈమధ్య కాలంలో మనదేశం అగ్నిపర్వతాల ప్రేలుళ్ళతో కదిలిపోయింది ఆ ఘర్షణతో అధికారానికి, రాచరికానికి పట్టుగొమ్మలైన కోటలు తత్తునియలయ్యాయి. సామాన్య జన సందోహాలే చరిత్రను సృష్టిస్తాయన్న విషయాన్ని మరొక్కసారి పై ఘటనలు రుజువు చేశాయి. తాము బ్రతికే హక్కు, మనుషులుగా బ్రతికే హక్కు హరించిన నాడు ప్రజలు చేతులు ముడుచుకొని కూర్చోరనే విషయం పాలక వర్గాలకు ఈమధ్య జరిగిన ఘటనలు హెచ్చరికలుగా ఉంటాయి

దేశం నానటికీ తీవ్రతరమైన సంక్షోభంలో కూరుకుపోతున్నది ఇతర రంగాలతోపాటు విద్యారంగం కూడా ఆ సంక్షోభంలో చిక్కుకొన్నది. ఈ సమయంలో వాస్తవ పరిస్థితులను స్పష్టంగా అవగాహన చేసుకోవడం ద్వారానే మనమీ సంక్షోభాన్ని అర్థం చేసుకొని పరిష్కార మార్గాలను కనుగొనగలం.

ఈ రోజు ఇక్కడ రాష్ట్రం నలమూలల నుండి వేలాది ఉపాధ్యాయులు సమీకరింపబడ్డారు. వారంతా ప్రాథమిక, సెకండరీ, ఉన్నత విద్యా విభాగాలలోని సమస్యల్ని చర్చించటానికి యుటియఫ్ పతాకం క్రింద సమావేశమయ్యారు ఈ నాటి చర్చలు విద్యా విధానాన్ని పట్టిపీడిస్తున్న వివిధ సమస్యల్ని వెలుగులోకి తీసుకురాగలవని ఆశిస్తున్నాను.

ఏ మార్పుకైనా విద్యావిధానం శక్తివంతమైన సాధనం. అందుకే కొఠారీ కమిషన్ 'భారతదేశ భవిష్యత్తు తరగతి గదుల్లో రూపొందుతుంది' అని స్పష్టంగా చెప్పింది. ఈ విషయంలో ఉపాధ్యాయుడిదే ముఖ్యపాత్ర కాబట్టి దేశభవిష్యత్తు మనం రూపొందించే విద్యా విధానంపై ఆధారపడి ఉంటుంది. మన విద్యా విధానం ఏ రకంగా నూ ఉపయోగించేదికాదనీ, దేశ వాస్తవ పరిస్థితులకనుగుణమైనది కాదనీ, దీనిని పూర్తిగా మార్చవలసి యున్నదన్నది నిర్వివాదాంశం.

మనం స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సమానత్వాన్ని హృదయపూర్వకంగా నమ్మి, ఆకాంక్షించే నూతన మానవుల్ని సృష్టించాలి. దానికి విద్యా విధానపు పునాదులనే సమూలంగా మార్పు చేయాలి పసిహృదయాలను అమానుషంగామార్చే ఈ సమాజ స్వభావాన్ని విద్యా విధానంద్వారానే ప్రతిఘటించాలి. ఇదొక క్లిష్టమైన సవాలు ఈ కుళ్ళు, అభివృద్ధి నిరోధక సామాజిక శక్తులు ఆచరణలో పెడుతున్న అవరోధాలను ఎదుర్కోటంతో ఉపాధ్యాయుడు ప్రధానపాత్ర వహించాలి.

నిరక్షరాస్యత ప్రజాస్వామ్య వ్యతిరేక అభివృద్ధి నిరోధక శక్తులకు ఆయువుపట్టు. అందుకని దాన్ని మనం ముందు తుడిచిపెట్టాలి ఆంధ్రప్రదేశ్‌లో 70శాతం నిరక్షరాస్యులున్నారు. శక్తివంతమైన ప్రణాళిక ఈ నిరక్షరాస్యతను తుడిచి పెట్టగలదు. దానికి కావలసిన నిధులను పెద్ద మొత్తాలలో కేంద్రప్రభుత్వం మంజూరు చేయాలి. చదువుకొన్న నిరుద్యోగ యువకులను, ఉపాధ్యాయులను, సంఘసేవకులను ఈ సవాలు నెదుర్కోటానికి పెద్దయెత్తున రంగంలోకి తీసుకురావాలి యుద్ధస్థాయిలో దీనిని కొనసాగించాల్సి ఉన్నది.

విద్యారంగంలో అన్నిటికంటె అశ్రద్ధ చేయబడుతున్నది ప్రాథమిక విద్య. ఆంధ్రప్రదేశ్‌లోగల 38 వేల ప్రాథమిక పాఠశాలల్లో 18 వేలు ఏకోపాధ్యాయ పాఠశాలలు ఇవన్నీ గ్రామీణ ప్రాంతాల్లో వున్నయ్. వీటిలో ఒక్క టీచర్ మొత్తం 5 తరగతులకు బోధించాలి. వేలాది పాఠశాలలు శిథిలావస్థలోనున్న మట్టికొంపలలోను, పూరిగుడిసెల్లోను నడపబడుతున్నాయి. పేద విద్యార్థులు దుర్భర దారిద్ర్యం వలన, తమ తలిదండ్రులకు ఆర్థికంగా సాయపడటంకోసం పొలం పనులకు వెళ్ళటం జరుగుతున్నది. వారి విద్యాభ్యాసం ఆ విధంగా మధ్యలో ఆగిపోతున్నది. అందువలన ఈ విద్యార్థి పట్టణంలోని విద్యార్థికి పోటీపడలేడు ఆ విధంగా గ్రామీణ, పట్టణ ప్రాంతాలలోని విద్యార్థులకు విద్యావకాశాలలో విపరీతవ్యత్యాసం రోజురోజుకూ అధికమౌతున్నది. ఈ సమస్యను వెంటనే పరిష్కరించాలి. ఈ ఏకోపాధ్యాయ పాఠశాలన్నింటిని వెంటనే అన్ని సౌకర్యాలూ అవకాశాలూ గల పాఠశాలలుగా మార్చాలి గ్రామీణ పాఠశాలన్నింటికి పాఠశాల భవనాలు, ఉపాధ్యాయులకు నివాస గృహాలు, విద్యార్థులకు హాస్టల్ వసతి సౌకర్యం కల్పించాలి ఇది ఎంతో ఖర్చుతోకూడిన పని. అందుకని వీటికి అవసరమైన నిధుల్ని కేటాయించాలి.

10వ తరగతి సెకండరీ విద్యాభ్యాసానికి చివరిమెట్టుగా పరిగణించాలి. ఈ సెకండరీ విద్య ప్రతి విద్యార్థికి మానవ విజ్ఞానపు వివిధ అంశాలకు సంబంధించిన ప్రపంచ జ్ఞానం కల్పించాలి. దీనితోపాటు అతని భాషా పరిజ్ఞానాన్ని పెంచాలి. దీని తరువాత 2 సం॥ల విద్య ఉన్నత విద్యాభ్యాసానికి పునాదులు వేసేదిగా ఉండాలి. ఈ దశనుండి విశ్వ విద్యాలయ, వైద్య సాంకేతిక విద్యాభ్యాసాలు విడివిడిగా కొనసాగాలి. అందువలన ఈ + 2 దశ విశ్వ విద్యాలయాలతో సంబంధం కల్గి, విశ్వ విద్యాలయాల పాలన క్రిందికి రావాలి. ఈ ముఖ్య విషయంలో రాష్ట్రాలుగాక, కేంద్ర ప్రభుత్వమే దేశ వ్యాప్త విధానాన్ని నిర్ణయించాలి.

'ఉపాధ్యాయుడు జాతినిర్మాత' అంటూ అతనిపై నిరంతరం ప్రశంసా వర్షం కురిపిస్తూనే వుంటారు కాని అతని జీవన పరిస్థితులు మెరుగుపరచటానికి పూనుకోరు పట్టణాలలో వడ్డీ వ్యాపారస్తులక్రింద, పల్లెలలో భూస్వాముల క్రింద వాళ్ళు నలిగిపోతూ వుంటారు. ఈనాటి గ్రామీణ ఉపాధ్యాయుడు నిత్య దారిద్ర్యానికి గురి అవుతూ క్రమేపీ తన జీవితంమీద, వృత్తి మీద ఆసక్తి కోల్పోతూ వున్నాడు. అతడు గ్రామ రాజకీయ పెత్తనదార్ల చేతుల్లో, పంచాయత్ మహారాజుల చేతులో ఓ పావుగా మార్చబడ్డాడు. అతని మనోధైర్యాన్ని బ్రద్దలుచేసి, ఒక కీలుబొమ్మగా మార్చటానికి ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశానికి నెట్టబడుతున్నాడు. ఉపాధ్యాయుడు జాతి నిర్మాత పాత్ర నిర్వహించాలంటే యీ విషాదకర పరిస్థితి మారితీరాలి.

ఈ రోజుల్లో ఏ ఉద్యోగస్తుని హోదా అయినా అతని

జీతంపై ఆధారపడి ఉంటుంది. అందరికంటె అతి తక్కువ జీతం లభిస్తున్నది. ఉపాధ్యాయునకే. అందుచేత తన పొట్టనింపుకోవటం కోసం, కుటుంబ పోషణకోసం అప్పులు చేయటంగానీ, ట్యూషన్లు చెప్పటంగాని చేయవలసి వస్తున్నది. కొన్ని సంవత్సరాల క్రితం కాలేజీ, విశ్వ విద్యాలయ అధ్యాపకుల స్థితి కూడా పై విధంగా దీనంగాఉండేది. అప్పుడు యు.జి.సి. కాలేజీ ఉపాధ్యాయుల హోదాను పెంచవలసిన అవశ్యకత గురించి అనేక జీతాల స్కేళ్ళ సవరణల ద్వారా వారిని ఒకటవ గ్రేడ్ ఆఫీసర్ల స్థాయికి తీసుకొనివచ్చింది. కాని పాఠశాల ఉపాధ్యాయుల విషయంలో కేంద్ర ప్రభుత్వం గాని, రాష్ట్ర ప్రభుత్వాలుగాని అట్టి చర్యలేవీ తీసుకోలేదు. అందువలన ఉపాధ్యాయులు జీతం పెంపుదలకోసం, స్తోమత కోసం వెతుకుతూ కల్లోల మనస్కులైయున్నారు. ఉపాధ్యాయుల జీతాలు ఆకర్షణీయంగా లేనందున నూతన నిపుణతను వృత్తివైపు ఆకర్షింపలేకపోవటమేగాక, అందులో ఉన్నవారిని సైతం నిలుపుకోవటం కష్టసాధ్యమౌతున్నది. కాన దేశవ్యాపిత జాతీయ వేతనాల పాలసీని రూపొందించటం ద్వారా అన్ని స్థాయిలలోను కొత్తశక్తి సామర్థ్యాలను ఆకర్షించటం సాధ్యమౌతుంది.

ఈ సందర్భంలో పాఠశాలల హెడ్మాస్టర్ల జీతాలు కాలేజీ లెక్చెరర్ల జీతాలతో సమానంగా వుండాలని, కొన్ని విభాగాలలో రీడర్ల జీతాలతో సమానంగా వుండాలన్న కొఠారి కమీషన్‌యొక్క సూచనల్ని గుర్తుచేసుకోవటం సమంజసం. విద్యాబోధన ప్రైమరీ స్థాయినుండి యూనివర్శిటీ స్థాయివరకు ఒకే విభాగంగా పరిగణింపబడాలి. వివిధ రాష్ట్రాలలోని ఉపాధ్యాయుల జీతాలస్కేళ్ళు ఒకే విధంగా వుండాలి. ఈ విషయానికి వెంటనే కేంద్రప్రభుత్వం అత్యంత ప్రాధాన్యత నివ్వాలని నా అభిప్రాయం.

ఉపాధ్యాయులలో విశాల దృక్పథం అలవాటుచేయాలి. వారికి శలవులలో దేశంలోని వివిధప్రాంతాల్ని దర్శించే అవకాశం కల్పించాలి. దేశంలో జరుగుతున్నమార్పులు అభివృద్ధి గ్రహించటంవలన వారు నిత్య చైతన్య విలసితుడవుతారు. కొఠారీ కమీషన్‌కూడా ఉపాధ్యాయులు దేశం నలుమూలలా పర్యటించటానికి వీలుగా ఫ్రీరైల్వే కన్సెషన్లు యివ్వాలని సిఫార్సు చేసింది. ఉపాధ్యాయులపై భారం తగ్గించేందుకు వారి పిల్లలకు ఉచిత విద్య, వైద్య సదుపాయాలు కల్గించాలి. ఈ విధంగా 'జాతినిర్మాతల' జీవన పరిస్థితుల్ని మెరుగు పరిస్తే వారు తమ కర్తవ్యం నిర్వహింపగల్గుతారు. జాతి నిర్మాణంలో పాలుపంచుకోగల్గుతారు.

మన విద్యా వ్యవస్థలో ఆరంభం కానున్న నూతన శకం కనుచూపు మేరలో వున్నదని నా దృఢ విశ్వాసం. స్వాతంత్ర్యం సౌభ్రాతృత్వం, సమానత్వ పతాకం క్రింద ప్రతిమనిషీ తన శక్తి కొలది పనిచేసి తన కవసరమైన మేరకు ప్రతిఫలాన్ని తీసుకొనే ఉజ్జ్వల భవిష్యత్తు వైపు నవసమాజ నిర్మాణానికి పునాదివేస్తూ ముందుకు మున్ముందుకు సాగిపోదాం.

***

## ఎయిడెడ్ ఉపాధ్యాయులకు కుటుంబ సంక్షేమ పథకం అమలుపరచాలి, హిందీ పండితుల సమస్యలు పరిష్కరించాలి
## మహాసభల సందర్భాన కేంద్ర విద్యామంత్రికి యు. టి. యఫ్. మెమొరాండం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ప్రభుత్వ స్థానిక సంస్థలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులందరికి కుటుంబ సంక్షేమ పథకాన్ని అమలు పరిచింది. ఎయిడెడ్ ఉపాధ్యాయు కు కూడా ఆ పథకాన్ని వర్తింపజేయాలని ఎంతిగా ఆందోళన చేసినా విన్పించుకోవటంలేదు. పైగా కేంద్రప్రభుత్వం దానికి అంగీకరించటం లేదని, అంగీకరిస్తే మా అభ్యంతరం లేదనీ ముఖ్యమంత్రి ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులతో గత ఏప్రిల్ 7న చెప్పియున్నారు. ఎయిడెడ్ ఉపాధ్యాయుల ఎడ వివక్షచూపటం సాంఘిక న్యాయానికి విరుద్ధమనీ వారికి కూడా ఆ పథకాన్ని వర్తింపజేయటంలో కేంద్రప్రభుత్వం తగు చర్యలు తీసు కోవాలని వెంటనే రాష్ట్ర ప్రభుత్వంతో ఉత్తర్వు లిప్పించాలనీ మనవి చేస్తున్నాము.

మా రాష్ట్రంలో హిందీ రెండవ భాషగా 6 వతరగతి నుండి బోధింపబడుతున్నది. హిందీబోధనకయ్యే ఖర్చు కేంద్ర ప్రభుత్వమే భరిస్తున్నది. కానికొన్ని అప్పర్ ప్రైమరీపాఠశాలల లోను, ఉన్నత పాఠశాలలలోను హిందీపండితులు నియమింపబడియుండలేదు కొన్ని అప్పర్ప్రైమరీ పాఠశాలలలోపార్ట్‌టైం హిందీపండితులు కేవలం నెలకు రు. 50ల జీతంమీద నియమింపబడుతున్నారు. శాంక్షన్ చేయబడిన పోష్టులుకూడ 5 సం.లకు ఒకసారి రెన్యూ చేయబడుతున్నవి. హిందీ భాషా బోధనకు సంబంధించిన గ్రాంటుకూడ సరిగా కేంద్ర ప్రభుత్వం విడుదల చేయుటలేదన్న కారణాన హిందీ పండితులకు నెలల తరబడి జీతాలు చెల్లించటంలేదు. కొన్ని సందర్భాల్లో 12 నెలలు, 18 నెలలకుకూడా జీతాలు చెల్లింపబడటంలేదు.

కాన హిందీ పండితుల పోష్టుల్ని పర్మనెంట్ చేయాలనీ, ప్రతి ఉన్నత పాఠశాలకు గ్రేడ్ 1 హిందీ పండితుని నియమించాలనీ ప్రతి అప్పర్ ప్రైమరీ స్కూలుకు గ్రేడ్ 11 హిందీపండితుని పూర్తి జీతంపై నియమించాలనీ, సిలబస్‌భారం తగ్గించాలనీ జీతాలు రెగ్యులర్‌గా చెల్లింపబడుటకు వీలుగా కేంద్రప్రభుత్వం గ్రాంట్లను వెంటనే విడుదలచేయాలని కోరుతున్నాం.

### ముఖ్య గమనిక

సెప్టెంబరు సంచిక 100 పేజీలతో ఖమ్మం మహాసభల ప్రత్యేక సంచికగా వెలువరింపబడింది. బ్లాకులకు, ప్రింటింగుకు, న్యూస్ ప్రింటుకు ఎంతో ఖర్చయినా రేటు రు 2/- మాత్రమే నిర్ణయించాము. అందుచేత చందాదారకు ఒక నెలపత్రిక తగ్గింపవలసి వచ్చింది. అది చివరి నెల తగ్గింపబడుతుంది. కార్యకర్తలు, చందాదారు యీ మార్పును గమనించి, ఒక నెల ముందుగా చందా రెన్యూవల్ చేసి, మాతో సహకరింప గోరుచున్నాము. —సం॥

# ప్రారంభోపన్యాసం

## శ్రీ సత్యప్రియరాయ్, అధ్యక్షులు, ఎ.బి.టి.ఎ.

ఖమ్మంలో జరుగుతున్న మీ మహాసభల్ని ప్రారంభించటానికి నేను ఎంతో గర్వపడుతున్నాను. రాజమండ్రిలో జరిగిన మీ ప్రథమ మహాసభకుకూడా నేనధ్యక్షత వహించాను. నన్ను అత్యాశ్చర్య పరచిన విషయం... మీ నిర్మాణాన్ని గట్టిపరచుకొని రాష్ట్రమంతటాగల ఉపాధ్యాయ వర్గాన్ని మీలో ఇముడ్చుకొని ఇంతత్వరలో గణనీయమైన పురోగతిని, విస్తరణను మీరు సాధించగలిగేరు. దానికి నా హృదయ పూర్వక అభివందనలు మీసంస్థ రోజు రోజుకూ బలాన్ని పుంజుకొంటూ రాష్ట్రంలో ఏకైక ఉపాధ్యాయ సంస్థగా అర్హతను పొందగలదని జాతీయంగానూ అంతర్జాతీయంగానూ గుర్తింపు పొందగలదని నా హృదయ పూర్వక ఆ కాంక్షను వెల్లడిస్తున్నాను.

మీ సభకు ప్రధానంగా తీసుకొన్న విషయం మీ విజ్ఞతనీ, దూరదృష్టినీ తెలియజేస్తున్నది. భారతదేశచరిత్ర మలుపు తీసుకొంటున్న ఈ తరుణంలో ప్రత్యామ్నాయ విద్యావిధావ అవశ్యకత దేశానికి ఎంతగానో వుంది.

రెండువందల సంవత్సరాల బ్రిటిష్ పాలనలో, విద్య సమాజంలోని పైతరగతుల వారికి పరాయి పాలకులతో చేతులు గలిపిన తాబేదార్లకూ లక్షలాది భారత ప్రజల్ని దోపిడీ చేయటానికి వీలుగా అమలుపరచబడింది.

మనకు స్వాతంత్ర్యం వచ్చి ముప్ఫైయేళ్ళు గడిచినా విద్యావిధానంలో ప్రాథమికమైన మార్పులుగాని, మౌలికమైన మార్పులుగాని రాలేదు. ప్రజల్ని మోసగించటానికి మాత్రం కొన్ని పైపై మెరుగులు దిద్దేరు. 11 సంవత్సరాల విధానం ఆ కోవలోదే. దాన్ని సెకండరీ ఎడ్యుకేషన్ మీద మొదలియార్ కమీషన్ రిపోర్టు ఆధారంగా ప్రవేశపెట్టారు. మేము అప్పుడే హైయర్ సెకండరీ స్కూల్లో 11వ తరగతి విధానాన్ని ఖచ్చితంగా వ్యతిరేకించాం. అభివృద్ధి సాధించిన దేశాలలోని విద్యావిధానాన్ని పరిశీలించి, ఆకళింపు చేసుకొన్న వారెవరైనా మాతో ఏకీభవిస్తారు.

అదే సమయంలో మేము మరో విషయం చెప్పాము జనరల్ ఎడ్యుకేషన్‌లో కొంత పునాదిని ఏర్పరచుకోనిదే 13 లేక 14 సంవత్సరాల వయసులోనున్న బాలబాలికలు 9 వ క్లాసులో స్పెషలైజేషన్‌కు సబ్జక్టు ఎన్నుకోవడంలో సాధ్యంగాదని చెప్పాము మేము గట్టిగా నిరసన తెలియజేసినప్పటికీ, మొదలియార్ కమీషన్ అధ్యక్షుడు శ్రీ లక్ష్మణస్వామి మొదలియార్ సెకండరీ విద్యను 11 సంవత్సరాలకే పరిమితం చేయాలనే ఉద్దేశం తనకులేదని తెలియజేసినప్పటికీ, ఆ విద్యా విధానం దేశంలో 15 సంవత్సరాలపాటు కొనసాగింది. దాన్ని గట్టిగా బలపరచినవారు శ్రీ హుమాయూన్ కబీర్. ఆయన మొదటి విద్యా సలహా సంఘ అధ్యక్షుడు ఆ తర్వాత కేంద్ర విద్యా మంత్రి. ఆయన ఒక విచిత్ర వాదన తెచ్చారు. 'భారత దేశ విద్యార్థులు విదేశ విద్యార్థుల కంటె తెలివైనవారట... చురుకైనవారట! అందుకని విదేశ విద్యార్థులు 12సంవత్సరాల్లో గ్రహించేదాన్ని, మనవిద్యార్థులు 11 సంవత్సరాల్లోనే గ్రహించ



గలరట! ఇదీ ఆయన విచిత్ర వాదన.

కాని ఆ విధమైన భ్రాంతి ఇప్పుడు తొలగిపోయింది. కొఠారికమీషన్ నివేదిక బయటికి రావటంతో అదంతా పటాపంచలయింది. ప్రాథమిక స్థాయినుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకు పరిశీలించి ఆ కమీషన్ నివేదిక సమర్పించింది. సెకండరీ విద్య 12 సంవత్సరాలుండాలనే సూచన ఆ కమీషన్ అంగీకరించింది. 10 సంవత్సరాల జనరల్ విద్య; 11,12 తరగతులలో స్పెషల్ సబ్జక్ట్సు ఉండాలని రికమెండ్ చేసింది.

గత ఎన్నికల్లో కేంద్రంలోను, అనేక రాష్ట్రాల్లోను అధికారం కోల్పోయిన అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం దేశం మొత్తంమీద 10+2+3 విధానాన్ని అమలు పరచటానికి అంగీకరించింది. మళ్ళీయిప్పుడు ఆ విధానంమీద ప్రశ్నలుతలెత్తుతున్నయ్. చర్చలు సాగుతున్నయ్.

పశ్చిమబెంగాల్లో విశ్వవిద్యాలయాలు 10+2+2 విధానాన్ని నిర్ణయించాయి. 10+2+3 లేక 10+2+2 విధానాల్లో మౌలికంగా పెద్ద తేడాలేదు. ఇండియాలో కొఠారి కమీషన్‌నివేదికను గుర్తించటంగాని, వాటిని అమలు జరపటంగాని జరగలేదు. నూతన విధానాన్ని జయప్రదంగా అమలు పరచటానికి తగు ప్రయత్నాలు కూడా జరగలేదు. తగు ప్రయత్నాలు, ఏర్పాట్లు లేకుండా ఏ విధానం ప్రవేశ పెట్టినా అది అపఖ్యాతిపాలై విఫలమై తీరుతుంది.

సెకండరీ విద్యలో +2 పద్ధతికి ప్రభుత్వం తగు సన్నాహం, సరియైన ప్లాను ముందుగా ఏర్పరచుకోవాలి. +2 దశ ఒకేషనల్ విద్యకు ఒక పూర్తిదశనిచ్చేదిగాను, పై ఉన్నత విద్యను ప్రారంభ దశగాను ఉండేట్లు చేయుటమే గాకుండా అది అనేక వృత్తి విద్యలకు తోడ్పడేట్టుగా రూపొందించాలి. ఈదశలో విద్య జీవితానికుపయోగించేదిగా, నిర్మాణయుతమైనదిగ, విస్తరణకు వీలయ్యేదిగా ఉండి లక్షలాదిప్రజల జీవితాలకు వెలుగుబాట చూపించేదిగా ఉండాలి.

దురదృష్టవశాత్తూ 30సంవత్సరాల స్వాతంత్ర్యానంతరం మనదేశ జనాభాలో 30 5 శాతం మాత్రమే అక్షరాస్యులుగా వున్నారు. ఇంకా 70శాతం అజ్ఞానాంధకారంలోమగ్గుతున్నారు. వాళ్ళు కనీస విద్యకుకూడా నోచుకోలేదు. ఈ పరిస్థితిని మనం చైనా, వియత్నాం దేశాలతో పోల్చిచూసుకొంటే మనం ఎంత

# చెన్నుపాటి భవనానికి

## విరివిగా విరాళాలిచ్చి సహకరించండి !

## ఖమ్మం మహాసభ విజ్ఞప్తి

తెలుగునాట ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాత, అమరజీవి శ్రీ చెన్నుపాటి లక్ష్మయ్య ఉపాధ్యాయులకు, ఉద్యమాలకు ఎనలేని సేవజేశారు. అట్టి మహనీయుని పవిత్ర స్మృతిచిహ్నం ఈనాటికీ ఏర్పడలేదు ఈసందర్భంగా ఖమ్మంలో జరిగిన ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ద్వితీయ విద్యా మహాసభ ఆ లోటును తీర్చాలని వెంటనే వారి పవిత్ర స్మృతిచిహ్నంగా 'చెన్నుపాటి భవనం' ఏర్పాటు చేయాలని, అందుకు దాతలు విరివిగా విరాళాలిచ్చి, సహకరించాలని విజ్ఞప్తిచేస్తూ తీర్మానించింది.

### ఆ పిలుపు అందగానే యీ క్రిందివారు తమ విరాళాలు ప్రకటించారు

### రు. 516 ప్రకటించిన వారు

శ్రీ. కె. నారాయణరావు, సీతాంబ దంపతులు, కృష్ణాజిల్లా
శ్రీ డి. రామిరెడ్డి, అనసూయ దంపతులు, ప్రకాశంజిల్లా
శ్రీ కె ఐక్కయ్య, సరస్వతమ్మ దంపతులు, నెల్లూరుజిల్లా
శ్రీ యన్. రామకృష్ణరాజు తూ॥ గోదావరిజిల్లా
శ్రీ కె. వి. వి. యన్. ప్రసాద్ చౌదరి „

### రు. 216 ప్రకటించిన వారు

శ్రీ వి. సూర్యనారాయణరాజు „

### రు. 116 ప్రకటించిన వారు

శ్రీ పి బి. ముత్యాలరావు „
శ్రీ అప్పారి సుబ్బారావు „
శ్రీ బి. జడ్. రామారావు „
శ్రీ టి. రంగారావు „
శ్రీ జి. లచ్చారావు „
శ్రీమతి బి. గంటేశ్వరమ్మ విరాళం కృష్ణాజిల్లా
శ్రీమతి ఎ. అనసూయ ప. గో. జిల్లా
శ్రీ యన్. యన్. యన్. శర్మ „

వెనుకపడ్డామో అర్థమౌతుంది. మనం స్వాతంత్ర్యం పొందిన తర్వాతే చైనా విప్లవం వచ్చింది. మొన్న మొన్నే వియత్నాం సర్వస్వతంత్ర మయింది. కాని ఆదేశాలు నిరక్షరాస్యతను తమ భూభాగాలనుండీ తరిమి తరిమి కొట్టాయి. మనదేశంలో కూడా నిరక్షరాస్యతను నిర్మూలించటానికి తగుకార్యక్రమాన్ని త్వరలో చేపట్టాలి. కేంద్ర విద్యామంత్రిగారు తమ కేంద్ర ప్రభుత్వం అటువంటి కార్యక్రమం చేపట్టుతుందని చెప్తున్నారు. దానికి మేము విద్యామంత్రిని అభినందిస్తున్నాం. దేశంలోని వివిధ ఉపాధ్యాయ సంఘాలతోనూ, విద్యావేత్తలతోనూ సంప్రదించి ఖచ్చితమైన ప్లానుప్రకారం చిత్తశుద్ధితో ఆ కార్యక్రమం అమలు పరుస్తారని ఆశించుదాం.

ఈ రోజు ప్రభుత్వం ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత విద్యలకు 1:1:1 నిష్పత్తిలో ఖర్చుపెడుతున్నది దాని అర్థం ఉన్నత విద్యకు పదిరెట్లు ప్రాముఖ్యత ఇస్తున్నది. కాని యీ నిష్పత్తిని 3:2:1 కు మార్చితేనే విద్యాభివృద్ధి సాధ్యమౌతుంది.

---

శ్రీ పి. సత్యనారాయణరాజు „
శ్రీ కె. సూర్యనారాయణరాజు „
శ్రీయి. అప్పారావు, మాణిక్యం దంపతులు, గుంటూరుజిల్లా
శ్రీ వై. యల్. నారాయణ, మీనాకుమారి దంపతులు గుంటూరుజిల్లా
శ్రీ సి. హెచ్. లక్ష్మీనారాయణ, నెల్లూరుజిల్లా

### రు. 58 ప్రకటించిన వారు

శ్రీ టి. వెంకట్రావు తూ.గో. జిల్లా
శ్రీ యన్. రామకృష్ణారావు తూ.గో. జిల్లా

నెల్లూరుజిల్లానుండి మహాసభలకు హాజరైన ప్రతినిధుల విరాళం రు. 182/-

### మొత్తం రు. 4552

—దీని నాదర్శంగా తీసుకొని ఉద్యమాభిమానులు యీ క్రింది ఒరునామాకు విరాళాలు **'A.P.U.T.F. Chennupati Building Fund'** అనుపేర బ్యాంకుడ్రాఫ్ట్ లు వ్రాసుచేసిగాని యం.ఓ.ల ద్వారాగాని పంపగోరుతున్నాము. పంపినవారి పేర్లు పత్రికలో ప్రకటింపగలము.

చెన్నుపాటి భవననిధి

ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్
ఆకులవారివీధి, విజయవాడ-2.

# ఉపాధ్యాయులు - సామాజిక కర్తవ్యాలు



గత యాభై ఏండ్లుగా యీ దేశ ప్రజలకోసం పనిచేసే మేము, 'ఉపాధ్యాయుల సామాజిక కర్తవ్యాలేమిటా' అని ఆవేదనపడుతున్నాము. ఇప్పుడుగాకపోయినా మరో ఏభై సంవత్సరాలకైనా మీరు మేము కలిసి మంచి సమాజాన్ని ఏర్పాటు చేయాలంటే... ఇప్పటినుండి మీ ఉపాధ్యాయుల బాధ్యతలేమిటి? ఆ కృషిలో మీ పాత్ర ఎంతో ఉన్నదని మీ దృష్టికి తెస్తున్నాను.

## మాతృభాషల ప్రాధాన్యం

మన దేశంలో 70 శాతం నిరక్షరాస్యులుగా ఉన్నారు. ఈ స్థితిలో విద్యార్థుల్ని తయారుచేయటంలో, నూతన సమాజం నిర్మించే విషయంలో నా కలలు, ఆశయాలు మీ ముందు ఉంచుతాను.

స్వాతంత్ర్యం వచ్చి 30 ఏండ్లయినా మాతృభాషలో విద్యా బోధన జరగటంలేదు. స్వభాషలో విద్యా బోధన జరిగితేనే విద్య అందరి హక్కు అవుతుంది. ఆయా మాతృభాషల్లోకి పుస్తకాలు అనువదించబడలేదు గనుక పై చదువుల్ని ఇతర భాషలలోనే బోధిస్తున్నామని చెప్తున్నారు. విద్య కొందరి సొత్తుగాదు అందరి సొత్తు. విద్య మాతృభాషలో అయితేనే అది అందరి సొత్తు అవుతుంది. మాతృభాషలో అన్ని స్థాయిలలో విద్యా బోధన జరగనంతకాలం అభివృద్ధి సాధించలేము. మన కోర్కె కలగానే ఉంటుంది.

త్రిభాషా సూత్రానికి మేము వ్యతిరేకం. ఈ విధానంలో దేశం ముందుకు పోతుందని మేము ఆశించటంలేదు. మాతృభాషలో 14 సం॥ల వయసు వరకైనా కనీసం 12 సం॥ వయసు వరకైనా బోధించాలి. ఈ లోపు ఇతరభాషలు బోధించరాదు. ఆ తర్వాత విద్యార్థులు ఐచ్ఛికంగా వాళ్ళ వాళ్ళ అభిరుచుల్ని బట్టి ఇతరభాషలు నేర్చుకొనే అవకాశం కల్పించాలి. అలాగాకుండా మూడుభాషలు నిర్బంధంగా మనపై రుద్దడం మనల్ని అగౌరవపరచటమే అవుతుంది.

రైల్వేస్టేషన్ బోర్డులపై తాటికాయలంత అక్షరాలతో ముందు హిందీ తర్వాత తమిళం, మూడోదిగా తెలుగులో కనబడుతుంది. ఈ విషయంలో ప్రధానమంత్రితో బాధగా

శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య

వివరించాను. వారు 'తెలుగులో వున్నదికదా! ఏంటి మీబాధ' అన్నారు. అప్పుడు నేను 'అయ్యా! మాకు ఆత్మగౌరవంవుంది. మాది తెలుగుదేశం. మా రాష్ట్రంలో తెలుగులోనే మొట్టమొదటిగా వ్రాయాలి' అని గట్టిగా చెప్పాను.

ఏ ప్రభుత్వ ఉద్యోగం కావాలన్నా తపాలా, ఇన్‌కంటాక్స్ మొదలైన వాటికి హిందీవచ్చివుండాలి. మన తెలుగు ప్రాంతంలో ఉద్యోగంవున్నా హిందీ వుండాలంటారు. ఇక్కడ తెలుగు వారికి తెలుగులో వివరిస్తే సరిపోతుందనే ఆలోచనే వారికి వుండదు. ప్రభుత్వ దృష్టిలో 90 శాతం తెలుగు వారయినా, ఆ భాషలో శక్తిసామర్థ్యాలున్నా హిందీ రాకపోతే అర్హులుకాదు. కాన ప్రతివిద్యావేత్త, జాతీయవాది ప్రతి ఉపాధ్యాయుడు ఈ మూడు భాషల విధానానికి వ్యతిరేకంగా పోరాడాలి.

## నిరక్షరాస్యతా నిర్మూలన

అందరినీ అక్షరాస్యులుగా చేయాలి. అది ఎలా జరుగుతుంది? సమాజం మారినపుడే అది సాధ్యం. ఈ దోపిడీ విధానం ఆ పని చెయ్యలేదు. సమాజం మారేంత వరకు అక్షరాస్యత సాధించలేమని, ఈ లోపు ఏ ప్రయత్నమూ చెయ్యకుండా ఉంటామా? అలా ఎప్పుడూ ఉండము. దానికి మనం తీవ్ర కృషి చేయాలి. ఉపాధ్యాయులు కూడా దానికి పూనుకోవాలి. మన భవిష్యత్తు, బిడ్డల భవిష్యత్తు బాగుపడాలంటే ఉపాధ్యాయులు అదనంగా కృషిచేయాలి. ఆ అదనపు శ్రమకు ప్రభుత్వం ప్రతిఫలం ఇచ్చినా ఇవ్వకపోయినా దానిని మీ బాధ్యతగా ఎంచి కృషిచేయాలి. సామాజిక కర్తవ్యంగా ఎంచి 'ఎంతమందికి చెప్పగలమా' అనేది గీటురాయిగా పెట్టుకొని కృషి చేయాలి.

## ప్రాథమిక విద్య

'పాఠశాల్లో మధ్యాహ్న అన్నం పెడతాం రండి' అని ఆ విధంగా జయప్రదం చేయాలని పూనుకుంటే జరిగేపనిగాదు. ప్రొద్దుట, సాయంత్రం ఆ బిడ్డలకు అన్నం ఎవరు పెడతారు? నూటికి డెబ్బయిమంది కడుపు కాలుతుండే నిష్ఠదరిద్రులు మన సమాజంలో ఉన్నారు. ఐదు సం॥ల వయసునుండే తమ పిల్లల్ని జీతాలకు నియమిస్తారు. అలా ఆకలి తీర్చుకోటానికి వాళ్ళు పనిచేయాల్సివుంటే చదువు ఎలా సాధ్యమౌతుంది? మొత్తంగా సమాజం మారినపుడే ఇది సాధ్యమౌతుంది. అయితే ఈలోగా మనం చేయాల్సింది చేయాలి. వయోజన విద్య లభించేలా కృషి చేయాలి. ఈ పాఠశాలల ద్వారానే నిరక్షరాస్యత తొలగదు. కాంగ్రెస్ ప్రభుత్వం 30 సం॥లు పాలించి నిరక్షరాస్యత తొలగింపలేకపోయింది. ఆ ప్రభుత్వం పోయి, జనతా ప్రభుత్వం వచ్చింది. మరి ఈపాలకులు 'చేస్తాం' అంటున్నారు. ఆచరణలో దాన్నిచూద్దాము సంతోషిద్దాము.

5వ తరగతి వరకు చదువుచెప్పి ఇంటికి వెళ్ళమంటే ఉపయోగమేమిటి? ఇంటికి వెళ్ళిమర్చిపోతారు. కాన 7సం॥ల ప్రాథ

మిక విద్యవుండాలి. వచ్చిన చదువుమర్చిపోకుండాచూడాలి. ఆ పద్ధతి లోవిద్యగరపాలి.కొందరువిద్యావేత్తలురూల్సుచెపుతున్నారు. బిడ్డకు6స ॥ల వయసువుంటేగాని విద్యకు అర్హులుగారట! బడిలో చేర్చుకోకూడదట! అదే సోషలిస్టు దేశాలలో చూస్తే, ఉదాహరణకు రష్యాలోచూస్తే కిండర్ గార్డెన్స్ దగ్గరనుండే బిడ్డలకు నిర్బంధ ప్రాధమిక విద్యలో శ్రద్ధతీసుకోబడుతున్నది. బిడ్డ పుట్టిన దగ్గరనుండే ఆ దేశపౌరుడిగా ప్రభుత్వం గుర్తించి తిండి, ఆరోగ్యం, చదువు అన్నివిషయాలలో శ్రద్ధ తీసుకోంటున్నది. సామాన్యంగా 3 మాసాలనుండి 3 సం॥లలోపు బిడ్డలలో మార్పులు వస్తుంటాయి. 3సం॥ నుండి 6 సం॥ల వయసువరకు వారిలో మంచి మార్పులు వస్తాయి. అందుకే సోవియట్ ప్రభుత్వం అంత శ్రద్ధ తీసుకొంటున్నది.

మరియొక్క దేమో 6సం॥ల వయసువరకు విద్యాబోధనకు అర్హులుగారు అని నిర్ణయిస్తున్నారు. విద్యావిధానం ఇలా కొనసాగితే అందరికీ విద్య ఎలా లభిస్తుంది? కాన బిడ్డలకు కిండర్ గార్డెన్ సౌకర్యములతోపాటు 5సం.ల వయసు వచ్చిన దగ్గరి నుండి 7 సం ల పాటు ప్రాధమికవిద్య ఉండాలి. అది మాతృభాషలో సాగాలి. అంటే 12 సం ల వయసు వచ్చేసరికి వీరికి ప్రాధమిక విద్యలో జ్ఞానం ఏర్పడుతుంది. తర్వాత సెకండరీ విద్య 2 సం.లు చాలంటున్నారు కొందరు. కాని 3 సం.ల సెకండరీ విద్య ఉండాలి అంటే సెకండరివిద్య దాటేసరికి బిడ్డలకు 15 ఏళ్ళు వస్తాయి 15 సం.లు దాటితే నే పనిచేయటానికి అర్హులు లేకపోతేచైల్డ్ లేబర్ క్రింద నేరం అవుతుంది అతర్వాత2,3సం.లు వృత్తివిద్యలో ట్రైనింగ్ స్కూలులో పెడితేనే బాగుంటుంది. 10 సం.ల విద్య అందరూ అంగీకరించారు. సంతోషం దానిని పునాదిగా చేసుకొని ప్లస్ 2 కోర్సులకు, పై చదువులకు అవకాశాలు చేయాల్సాలి. ప్లస్ 2 దశలో వృత్తివిద్యలు నేర్చుకోవాలని కొఠారికమిషన్ అంటే దానికి అర్థం లేదంటున్నారు. ఆ కమిషన్ నిర్ణయాలు కాగితాలమీదే ఉన్నాయి.

10 సం॥ల విద్యానంతరం ఉద్యోగ గ్యారంటీ వుండాలి. దానికి పోరాడాలి. 10 సం॥ల విద్య అంగీకరించిన తర్వాత ప్లస్ 2 దశ ఎందులో ఉండాలా అని చర్చ సాగుతున్నది. ఆ విషయంలో సత్యప్రియరాయ్ వాదన నాకునచ్చింది అయితే హైస్కూలు విద్యకు కాలేజీ విద్యకు తేడావుంది. హైస్కూలు విద్యలో ప్రతివిద్యార్థి విషయంలో కేంద్రీకరించటం జరుగుతుంది అదే కాలేజీలో అయితే లెక్చర్లు వినటం - స్వయం కృషితో చదువుకోవటం జరుగుతుంది. కాన ప్లస్ 2 దశలో హైస్కూలు బోధనా పద్ధతుల్నే అనుకరించాలి.

## వేతనాలు

మనదేశంలో ఉపాధ్యాయుల వేతనాల్లో రకరకాల తేడాలున్నాయి. విద్యావిధానంలో బాలబాలికలకు మనోవికాసం కలిగేట్లు బోధన సాగాలంటే ఉపాధ్యాయుడికి ఆర్థిక బాధలుండగూడదు. కనీసం కుటుంబం గడవాలంటే రు. 600/ అవసరం. అందుకై పోరాడాలి. విద్యావిధానానికి వేతనాలకు ముడిపెట్టరాదు భావిపౌరుల్ని తీర్చిదిద్ది నూతన సమాజం నిర్మించే శక్తి విద్యకు వుంది. అది జాతి జీవితంలో ఒక కీలకాంశం. కాన సక్రమ విద్య సాధిస్తూనే వుపాధ్యాయుడు తన మనుగడకోసం, సరియైన వేతనాల కోసం పోరాడాలి.

మరో విషయం. డిగ్రీకోర్సు 3 సం॥లు ఉండాలా? 2 సం॥లు ఉండాలా అనే మరో చర్చ జరుగుతున్నది. ఉత్తర హిందూస్థానంలో 2 సం॥లు అంటున్నారు. రెండు సం॥లకే డిగ్రీ ఇచ్చి ఉద్యోగ గ్యారంటీ చేస్తే నాకేం బాధలేదు. సంతోషిస్తాను. ఎప్పుడు ఏ డిగ్రీ యిచ్చినా పై చదువులకు ఫ్రీగా ఎప్పుడు వీలయితే అప్పుడుచదువుకొనేందుకు అర్హతవుండాలి. హక్కుగా ఉండాలి.

## సిలబస్

సిలబస్ విపరీత భారంగా కన్పిస్తున్నది. చిన్నపిల్లవాడు పెద్ద పుస్తకాలపెట్టె మోయలేక వంగిపోతున్నాడు. త్రిభాషా సూత్రాన్ని ఎత్తేస్తే సగం బరువు పోతుంది ఏమైనా 5 స ॥ల వయసునుండి 15 సం॥ల వయసువరకు ఏ సిలబస్ చెప్తే నూటికి నూరుమంది ఉత్తీర్ణులవుతారో ఆ పద్ధతి నిర్ణయించండి

ఉదాహరణకు చరిత్ర అంటే తంటానొప్పి కొందరికి. రాజులు ఎప్పుడు పుట్టేరు? ఎక్కడ చచ్చారు? అతేదీలు ఎవరికక్కా వాలి. మానవజాతి దానిఅభివృద్ధి అచరిత్ర కథలుగా చెప్తే పిల్లలు శ్రద్ధగా వింటారు. ఇప్పుడు పరీక్షా ఫలితాలు 100కి 20 అంటే 80 మంది చదువు, శ్రమవృధాఅవుతున్నాయి. అలావేస్టేజీ లేకుండా అందరూ ఉత్తీర్ణులయ్యే సిలబస్ విధానాలను అవలంబించాలి.

ఇక పరీక్షలు. బెంగాల్‌లో ఓ విద్యార్థి జ్యోతిబాసుని '7సం॥లనుండికాపీగొట్టేఅలవాటువుంటే ఇప్పుడు వద్దంటేఎలా' అన్నాడట.ఆయన 'నీఅలవాటుప్రకారం నీవుకాపీగొట్టేవ్రాయి. మరి బాగా చదివి వ్రాయగల్గిన వారికి అడ్డురాకుండి ఇద్దర్నీ పరీక్షిస్తాం!' అన్నాడట. అలా ఈ సమాజంలోని లోపం విద్యావిధానంలో కూడా కన్పిస్తూ వుంటుంది.

మీరు జీతాలకోసం పోరాడి విజయం సాధించండి సంతోషం. మనం విశాలాంధ్రలో ప్రజారాజ్యం కోసం పోరాడాం. విశాలాంధ్రసాధించాం కాని ప్రజారాజ్యంరాలేదు. అలాగే ఒకే భాష కలవారం ఒకటిగా ఉండాలని ఆశించాం. అది స్వాతంత్ర్యం వచ్చినతర్వాత 10 సం॥లకు గాని సాధ్యంగాలేదు. తెలుగు మాట్లాడేవాళ్ళం ఒక్కటిగా నిలబడ్డాం అలాగే మీ సంస్థ ప్రాంతీయ విభేదాలు అధిగమించి ఐక్యత సాధించింది. దానికితోడు మీసంస్థ ప్రజాజీవితంలో నూతన శకారంభానికి కూడా కృషిచేయాలి. మనం కలిసి పోరాడుదాం మన చూపు సమాజంలో అన్ని వర్గాలవారివైపు పడుతూ ఉండాలి. మీరు పై వర్గాల వాళ్ళతోపాటు జీతాలకైపోరాడండి అయితే మీ కంటె క్రిందనున్న వారు అంధకారంలో ఉండి నికృష్ట జీవితం అనుభవిస్తున్నారన్న సంగతి మర్చిపోకండి వారితో కూడా మీరు ఐక్యంగా నిలబడాలి. లేకపోతే ఒంటరిగా పోరాడుతూ నిర్బంధ విధానాన్ని ఎదుర్కోవటం కష్టం వారి అండదండలుంటేనే మీరు మీ కోర్కెల్ని సాధించుకోగలరు. మీ సహాయ సానుభూతులతో వారు తమ కోర్కెల్ని సాధించుకోటానికి వీలవుతుంది. అలాఅంతా కల్సి యీ సమాజాన్ని మార్చేందుకు కృషిచేద్దాం. ప్రజల జీవితంబంగారు బాటగా రూపొందిద్దాం. ●●●

# వయోజన విద్యా వ్యాప్తికి నడుం కట్టండి ! పి. సి. చుందర్ ఉద్బోధ



ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ పతాకచ్ఛాయల్లో సమీకృతమై మహాసభ జరుపుకుంటూ అందుకు నన్ను ఆహ్వానించినందుకు ముందు మీకు నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను. ఎప్పుడో జరగాల్సిన మీ మహాసభలను నా రాక కొరకు వాయిదా వేసినందుకు ప్రత్యేకించి మీకు నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. నేను ఉపాధ్యాయ మహాసభలకు వచ్చినప్పుడు నేనేదో కేంద్రమంత్రిని అనిగాక నేనుకూడామీ తోటి ఉపాధ్యాయుణ్ణే అని అనిపిస్తుంది. ఎందుకంటే 31 సంవత్సరాలు నేను ఉపాధ్యాయుడిగా జీవితంగడిపాను.

నేను మాట్లాడబోయేముందు మీరు నా ముందు కొన్ని సమస్యలను వుంచారు. ఈ సమస్యలు నాకేం కొత్తకాదు. దీర్ఘకాలంపాటు ఉపాధ్యాయుడిగా ఉన్నవాణ్ణే కాబట్టి ఈ సమస్యలను నేనుకూడా అనుభవించినవాణ్ణే, వీటన్నింటికీ నేను గురయినవాణ్ణే. కలకత్తాలోని లాకాలేజీలో మా జీతాలు 1953 లో నిర్ణయించబడ్డాయి. 1977 వచ్చినా వాటిలో ఎటువంటి మార్పులేదు. నేను పశ్చిమ బెంగాల్ కాలేజీ టీచర్స్ యూనియన్‌కు రెండుసార్లు ఉపాధ్యక్షుడిగాను, ప్రాథమికోపాధ్యాయ సంఘానికి ఒకసారి అధ్యక్షుడిగాను వున్నాను కనుక నేనుకూడా మీ అందరిలాగే వీధుల్లోబడి అనేకసార్లు నా సహచరులందరితోకలిసి ధర్నాలు చేసినవాడినే. ఐతే ఎన్నిచెప్పినా మొదటినుండి ఈ రంగంలోవుండి పనిచేస్తూ విశేషమైన అనుభవాన్ని గడించిన సత్యప్రియరాయ్‌గారినిమాత్రంఇందులోఅధిగమించలేక పోయానన్న విషయాన్ని అంగీకరిస్తున్నాను. ఆయన పశ్చిమబెంగాల్‌లోఎంతోబలవత్తరమైన ఉపాధ్యాయసంఘానికి నాయకత్వం వహిస్తున్నారు అంతేగాక ఆయన చాలాకాలం పశ్చిమ బెంగాల్ విద్యామంత్రిగా కూడా పనిచేసివున్నారు. అయితే పదవిలో లేనప్పుడు ఏ సమస్యలకోసం అయితే పోరాడామో, పదవిలో కొచ్చేవరకు ఆ సమస్యలను పరిష్కరించడం అంత తేలికయిన విషయంగా కనిపించటం లేదు. ప్రస్తుతం పశ్చిమబెంగాల్ విద్యా మంత్రులుగా ఉన్న ఇరువురు మంత్రులు కూడా ఇదే అభిప్రాయాన్ని నావద్ద వ్యక్తం చేసి ఉన్నారు. ఇప్పుడు కొన్ని ఇబ్బందులు మీ ముందు వుంచుతాను. నాకు మీరు సన్మానపత్రం రూపంలో కొన్ని విషయాలు అందజేశారు.

అందులో విద్య రాష్ట్రపరిధిలోనే ఉండాలనే ప్రతిపాదన ఒకటి మీరు చేశారు. అదే సమయంలో అన్ని రాష్ట్రాల్లోను ఒకే రకమయిన విద్యావిధానం, విద్యాస్థాయి ఉండాలి అని అన్నారు. అయితే కేంద్రంలో ఉన్న మాకు అటువంటి శక్తి సామర్థ్యాలు వుంటే తప్ప మేము అటువంటి పనిచేయలేం గదా. నేను దేశంలోని విద్యా మంత్రులందరిని ఒకేచోట సమావేశపరచాను. రాష్ట్రాల నుండయితేనేమి కేంద్ర పాలితప్రాంతాల నుండయితేనేమి మొత్తం 31 మంది మంత్రులు ఆ శాఖకు సంబంధించిన అధికారులుకూడా ఆ సమావేశానికి వచ్చారు. అక్కడనేను గమనించిందేమిటంటే ఈ దేశంలోని వివిధ ప్రాంతాల్లోని వివిధ సమస్యలున్నాయి అన్నవిషయం. దక్షిణాది రాష్ట్రాల్లోయూనివర్శిటీవిద్య మూడు సంవత్సరాలు ఉంటున్నది కానిఉత్తరాదిరాష్ట్రాల్లోని ఎక్కువ యూనివర్శిటీలలో యూనివర్శిటీవిద్య రెండు సంవత్సరాలు మాత్రమేఉంది. ఇదివరకు మా ప.బెంగాల్‌లో డిగ్రీకోర్సు మూడేళ్లు వుండేది. అయితే ఇటీవలే డిగ్రీకోర్సు రెండేళ్లుగా, ఆనర్స్‌కోర్సు ఒక్క సంవత్సరంగా నిర్ణయించటం జరిగింది.

ఉత్తర హిందుస్థానం వాళ్లు లేవనెత్తుతున్న సమస్య ఏమిటంటే రెండేళ్ళలోనే, యువతీ యువకులు డిగ్రీలుపొందే అవకాశం ఉన్నప్పుడు మూడేళ్ళ డిగ్రీకోర్సు ఎందుకు? అని. మీరు నాకిచ్చిన మెమొరాండంలో ఇంకో సమస్యకూడా లేవనెత్తారు. ప్రాథమిక స్థాయినుండి డిగ్రీస్థాయివరకు మాతృభాషలోనే విద్యాబోధన జరగాలిఅని, అది మంచిసలహాయే. అయితే ఇది అంత తేలికయిన విషయంకాదు. విద్యామంత్రుల సమావేశంలో మన ప్రధానమంత్రిగారుకూడా ప్రాథమిక స్థాయినుండి డిగ్రీస్థాయివరకు మాతృభాషలోనే విద్యాబోధన జరగాలి అని చెప్పారు. నేను ఈ విద్యామంత్రులతోను అధికారులతోను చర్చించిన తర్వాత తెలుసుకున్న విషయం ఏమిటంటే మనదేశంలో 1640 ప్రధానమైన మాతృభాషలున్నాయి.

అస్సాంనుండి వచ్చిన విద్యామంత్రి ఇంకా ప్రత్యేకమైనటువంటి సమస్యను నాముందు తెచ్చిపెట్టాడు. కచార్ జిల్లాలో బెంగాలీ మాట్లాడే జనం చాలా ఎక్కువమంది వున్నారు. అయితే ఆ జిల్లామటుకు అస్సాంలోవుంది. అందుకని కచార్ జిల్లాలోవున్న విద్యార్థులు బెంగాలీ నేర్చుకోవాలి. హిందీ నేర్చుకోవాలి, అస్సామీభాష నేర్చుకోవాలి. ఇంగ్లీషు నేర్చుకోవాలి. ఇంకా ఎన్నయినా నేర్చుకోవాలి. ఇవన్నీ నేర్చుకోవటం ఎంతకష్టమయిన విషయమో మీరే ఆలోచించండి. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే మనభారతదేశంలో విద్యారంగం ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను మీ దృష్టికి తీసుకురావటమే నా ఉద్దేశ్యం.

మన రాజ్యాంగంలో మటుకు ఒకటి ఖచ్చితంగా చెప్పారు. కనీసం ప్రాథమిక స్థాయివరకయిన మాతృభాషలో విద్యాబోధన జరగాలి అని. మీ ప్రాంతంలో హరిజనులు, గిరిజనులు చాలా ఎక్కువమంది ఉన్నారు. వాళ్లు చాలా వెనుకబడి ఉన్నారు. అది వాళ్ళ తప్పు కాదు. ఇన్ని దశాబ్దాలుగా

వాళ్ళ అభివృద్ధికి మనం ఏమీ చేయలేకపోయాం అన్నది గుర్తు పెట్టుకోవాలి. ఇలాంటి వెనుకబడ్డ ప్రాంతాలపట్ల మనప్రత్యేక శ్రద్ధ చూపించి వాళ్ళుకూడా మిగతా ప్రజలందరి స్థాయికి చేరుకునే విధంగా మనం కృషి చేయాలి. కనుక ఈ ప్రాంతంలో వెనుకబడిన వాళ్ళు అతితక్కువ కాలంలో మిగతా ప్రజల స్థాయికి చేరుకోవాలంటే వాళ్ళను ప్రత్యేకమైన క్లాసులు, ప్రత్యేకమైన శిక్షణ ఇవ్వాలి.

మీ అధ్యక్షులవారు నాకిచ్చిన మెమొరాండంలో కొఠారి కమిషన్ చెప్పిన విషయాన్ని ఉపహరించారు. ఈ కొఠారి కమిషన్ నివేదికను చాలాజాగ్రత్తగా నేను పరిశీలించాను. అయితే వాళ్ళుకూడా విభిన్న సంస్కృతులు, విభిన్న భాషలు వున్న మనదేశంలో ఒకే రకమయిన విద్య సాధ్యం కాదని అంగీకరించారు అది చాలా జటిల మయిన సమస్య.

మనదేశంలో 23 కోట్లమంది వయోజన నిరక్షరాస్యులున్నారు. వయోజనులు అంటే నా ఉద్దేశ్యం 18 సంవత్సరాలపైబడ్డవాళ్ళు. కోట్లాది రూపాయలను ఉన్నత విద్యకోసం వెచ్చిస్తున్న మనం ఈ 23 కోట్లమంది నిరక్షరాస్యులకు కనీస అక్షరజ్ఞానాన్ని కలిగించటంమనబాధ్యతకాదా అనేది ఆలోచించండి. నా అభిప్రాయం ఉన్నతవిద్య అనవసరం అని కాదు. అది ఖచ్చితంగా అవసరమే. అయితే దానికంటే ముందు కోట్లమంది నిరక్షరాస్యులైన మన వయోజనులకు విద్యగరపటం ఎంతో ముఖ్యమైన విషయం. జనాభాలో అధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులుగా వుండి ఏకొద్దిమందో ఉన్నత విద్యనభ్యసిస్తే అది ప్రజాస్వామ్యం అనిపించుకుంటుందేమో ఆలోచించండి.

అయితే దేశ అభివృద్ధికి ఉన్నత విద్య చాలా అవసరం అదే సమయంలో నిరక్షరాస్యులైన అధిక సంఖ్యాక ప్రజలను మనం నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు. ఈ 23 కోట్లమంది నిరక్షరాస్యులు ఎవరు? మనదేశంలో ఉత్పత్తి దాతలైన రైతులు, వ్యవసాయ కార్మికులు, పారిశ్రామిక కార్మికులు, నిజం చెప్పాలంటే వీళ్లు సృష్టిస్తున్న సంపదనుంచే ఇటు కేంద్ర ప్రభుత్వం గాని అటు రాష్ట్ర ప్రభుత్వాలుగాని పన్నులు వసూలుచేసి, యూనివర్శిటీలు, కాలేజీలు నిర్మించటం జరుగుతున్నది. ఒక ప్రక్కవాళ్ళ శ్రమను రక్తంగా మార్చి త్రాగుతూ వాళ్ళ అవసరాలను మనం నిర్లక్ష్యం చేస్తున్నాం. ఇది మటుకు ఇకముందు సాగటానికి వీలులేదు. కనుకనే నేను పార్లమెంటులో నా మొట్టమొదటి ప్రసంగంలో వయోజన, ప్రాథమిక విద్యలకు అధిక ప్రాధాన్యం ఇవ్వాలని చెప్పటం జరిగింది. నేనుదీన్నిసవాలుగా స్వీకరిస్తున్నాను. నేను జయిస్తానో ఓడిపోతానో మీరే చూడండి. నేను దీనికోసం ప్రథమంగా చేసిన పనేమిటంటే ప్లానింగ్ కమిషన్ ఉపాధ్యక్షుని దగ్గరకు వెళ్ళి 6వ పంచవర్ష ప్రణాళికలో ఈ వయోజన విద్యకుఎక్కువ నిధులు కేటాయించవల్సిందిగా కోరాను. ఆయన దానికి అంగీకరించారు

ఇవ్వాళప్రాథమికవిద్యమీద ఎంతవృథాజరుగుతున్నదంటే 1వ తరగతిలో 100మంది చేరితే వాళ్ళల్లో 40మంది మాత్రమే 5వ తరగతికి చేరుకోగలుగుతున్నారు. ఈ విషయం పరిశీలిస్తే వాళ్ళ తల్లిదండ్రుల ఆర్థిక దుస్థితే ఇందుకు కారణం అన్న విషయం స్పష్టం వాళ్ళకు తమ పిల్లలను పనుల్లోపెడితేతప్ప గడవని పరిస్థితులున్నవి. వాళ్ళు తమ పిల్లలకు చదువు చెప్పించుకోలేకపోవటానికి కారణం అదే అదుకని పిల్లలు బడికి రాలేకపోతే బడిపిల్లలదగ్గరకెళ్ళేటట్లుగా చూడాలి పిల్లలు పొలాల్లోనో పరిశ్రమల వాడల్లోనో పనిచేస్తుంటే అక్కడికి వెళ్ళి వాళ్ళకు విద్యాబోధన జరిగేటట్లుచూడాలి తమిళనాడులో ఇప్పటికే అక్కడి అధికారులు ఈ విధానాన్ని అమలు జరపటానికి ప్రయత్నిస్తున్నారు. దాంట్లో వాళ్లు కొంత పురోభివృద్ధిని కూడా సాధించారు.

నిజంగా మనం ఈ వయోజన విద్యను అమలు జరుపదలుచుకుంటే అదేమంత కష్టతరమయిన పనికాదు. ఎన్నో ఐచ్ఛిక సంస్థల ద్వారా మనం దీన్ని అమలు జరుపవచ్చు. ఇవ్వాళ మనదేశంలో 25 లక్షలమంది ప్రాధమికోపాధ్యాయులు ఉన్నారు ఒక్కొక్కరు 4 గురికి విద్య గరిపినట్లయితే ఒక్క సంవత్సరంలో ఒక కోటిమందిని విద్యావంతుల్ని చెయ్యవచ్చు. ప్రాధమికోపాధ్యాయులేకాదు, హైస్కూల్ ఉపాధ్యాయులు, కాలేజీ టీచర్లు విద్యార్థులు, ప్రొఫెసర్లు తదితర విద్యావంతులు వీరేకాక మాలాంటి మంత్రులు అందరూ పూనుకుంటే ఇదేమంత పెద్ద సమస్యకాదు. ఇక్కడ ఒక మిత్రుడు మాట్లాడుతూ చైనా, ఇండోచైనా, క్యూబా, వియత్నాం లాంటి దేశాలు చూడండి నిరక్షరాస్యతను ఏ రకంగా నిర్మూలించినవో అని చెప్పటం జరిగింది. నేను చైనా వెళ్ళాను మావో, చౌఎన్‌లై, సన్‌యెట్‌సేన్ లందరినికలసి చర్చించాను. కొన్నాళ్లు స్కూళ్ళు, కాలేజీలు మూసేసి ఈ విద్యార్థులందరిని గ్రామాలకు పంపించి నిరక్షరాస్యులకు వారు విద్య నేర్పేటట్లుగా చూడాలి అని జయప్రకాష్ నారాయణగారు చెప్పినప్పటికీ ఇదిఅసాధ్యం. మనం ఒక ప్రజాస్వామ్య దేశంలో ఒక్క కలం పోటుతో ఈ హైస్కూళ్ళను, కాలేజీలను ఎట్లా మూయించగలం? అసలు ఇంకో విషయంకూడావుంది ఈ వయోజనులే తమంతట తాము విద్య నేర్చుకోవటానికి ముందుకు రావాలి. వాళ్ళేం పసిపిల్లలు కాదుకదా కొట్టి తిట్టి నేర్పటానికి. కనుక మనం ఈ వయోజనులతో విద్యయొక్క అవశ్యకతను గుర్తింప చేయాలి. అయితే ఈ సమస్య పరిష్కారానికి ఎంతో కృతనిశ్చయం, దృఢదీక్షా అవసరం.

మనం ఇందిరాగాంధి నిరంకుశత్వానికి వ్యతిరేకంగా, అత్యవసర పరిస్థితికి వ్యతిరేకంగా పోరాడి విజయాన్ని సాధించాము. అట్లాగే నిరక్షరాస్యతకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలోకూడా విజయాన్ని సాధిస్తాముఅనినేనునమ్ముతున్నాను. ఎందుకంటే నేనుఆశావాదిని. ఈ నిరంకుశత్వాన్ని నిర్మూలించటానికి యావద్భారత ప్రజలు ఏ రకంగా ఏకమయ్యారో అదే విధంగా నిరక్షరాస్యత నిర్మూలనా పోరాటంలోకూడా సమీకృతులవుతారని ఆశిస్తున్నాను. అందుకని నన్ను ఈ మహాసభకు ఆహ్వానించినందున మీ సంఘానికి నా కృతజ్ఞతలు, నేను ఉపాధ్యాయుణ్ణే కాబట్టి మీ సమస్యలన్నీ నాకు అనుభవమే. అందుకని మీ సమస్యల్ని సానుభూతితో పరిశీలిస్తాను, రాష్ట్రంలోని ఇరుప్రాంతాల ఉపాధ్యాయుల ఐక్యపరచి ఒకే వేదిక మీదకు తీసుకవచ్చినందుకు యు. టి. యఫ్. ను అభినందిస్తున్నాను. ఇది మీకే పరిమితం కాకుండా యావద్భారతానికి విస్తరింప జేయవలసినదిగా కోరుచున్నాను. ●

# యు. టి. యఫ్. ద్వితీయ విద్యా మహాసభలు



## ఆహ్వాన సంఘాధ్యక్షులు

## శ్రీ వై. రాధాకృష్ణమూర్తిగారి

## స్వాగతోపన్యాసం

అధ్యక్ష మహాశయా ;

గౌరవనీయులైన పెద్దలారా! మిత్రులారా!

ఆంధ్రప్రదేశ్ నలుమూలలనుండీ "ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్" ద్వితీయ విద్యామహాసభలకు విచ్చేసిన ప్రతినిధులకు, సౌహార్ద ప్రతినిధులకు, ప్రత్యేక ఆహ్వానితులకు, ఉపన్యాసకులకు, ప్రజానాయకులకు, ప్రభుత్వ నాయకులకు తదితర మిత్రులకు ఖమ్మంజిల్లా అభ్యుదయ ప్రజానీకం తరఫునా, మా ఆహ్వానసంఘం తరఫునా నా హృదయపూర్వకమైన ఆహ్వానాన్ని అందజేస్తున్నాను.

భవిష్యత్ భారతావనియొక్క రూపురేఖలు దిద్దుతూన్న విద్యావిజ్ఞాన శిల్పులైన ఉపాధ్యాయలోకంయొక్క ప్రతినిధులుగా మిమ్మల్ని ఈ పట్టణానికి ఆహ్వానిస్తున్నాను.

సంకుచితమైన ప్రాంతీయ, కుల, మత, ముఠాతత్వాలకు అతీతంగా అఖిలాంధ్రదేశంలోని అన్నితరగతుల ఉపాధ్యాయులను సమీకరించి సంఘటితపరచే ఏకైక విశాల ఐక్య ఉపాధ్యాయ వేదిక ప్రతినిధులుగా మీకు స్వాగతమిస్తున్నాను.

ఛాందసత్వానికి, సామాజిక తిరోగమన ధోరణికి, బానిస మనస్తత్వానికీ వ్యతిరేకంగానిలబడి ప్రగతిశీలమూ, అభ్యుదయకరమూ, ఆత్మగౌరవభరితమూ, దేశభక్తియుతమూనైన స్వతంత్ర సంస్థా నిర్మాణ దీక్షాదక్షులైన మీకు నా ఆహ్వానాన్ని అందజేస్తున్నాము.

మీ ఉద్యమ పురోభివృద్ధినీ కార్యకలాపాలనూ ప్రత్యక్షంగాచూచి, తమ సందేశాలనూ, అభినందనలనూ ఆశీర్వాదాలను అందజేయుడానికి అనేకమంది పెద్దలు ఇతర రాష్ట్రాలనుండి ఎంతో వ్యయ ప్రయాసలకు ఓర్చివచ్చారు.

ప్రత్యేకించి వారందరికీ మా ఆహ్వాన సంఘం తరపున స్వాగతం చెబుతున్నాను.

ఆంధ్రప్రదేశ్‌లోని దాదాపు అన్ని జిల్లాలకంటె ఖమ్మం జిల్లా జనాభాలో, వయసులో, వనరులలో, సంపదలో చిన్నది. సుమారు 14 శాతం గిరిజనులు, 12 శాతం హరిజనులు నివసించే జిల్లా ఇది. చాలా పరిమితమైన నీటివనరులుగల ప్రాంతం. అధిక భాగం వర్షాధారం పైననే అస్తుబిస్తుగా పండే ప్రదేశం. నూటికి 18మంది మాత్రమే అక్షరాస్యులున్న జిల్లా,

అయితే మేము గర్వంగా చెప్పుకోతగ్గవికూడా కొన్ని లేకపోలేదు. సింగరేణి బొగ్గుగనుల కంపెనీ, సంవత్సరానికి 20 లక్షల టన్నుల బొగ్గు ఉత్పత్తిచేస్తూ దేశంలో రెండవ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. కొత్తగూడెం థర్మల్ స్టేషన్ మన రాష్ట్రంలో విద్యుదుత్పాక కేంద్రం. ఖమ్మంజిల్లాలో గల బహువిధమైన ఖనిజసంపద బహుశా మిగతా ఏజిల్లాలో నూలేదేమో వీటిని ఉపయోగించుకోవడానికి యిప్పుడిప్పుడే కొన్ని పరిశ్రమలకు పునాదిరాళ్ళు, యింకా కొన్నింటికి సైన్ బోర్డులూ మరికొన్నింటికి కాంపౌండు గోడలు కనిపిస్తున్నాయి; అనతి కాలంలోనే యివన్నీ ఉత్పత్తిస్థాయికి చేరుకోగలవని ఆశిద్దాం.

చరిత్ర ప్రసిద్ధికెక్కిన భద్రాచలం దేవస్థానం (1654-1683) ఖమ్మం జిల్లాలోని ప్రధాన యాత్రాస్థాలం.

ఖమ్మం పట్టణాన్ని గూర్చి కొన్ని మాటలు: ఈ పట్టణం 'స్తంభాద్రి' 'కంబాద్రి' - 'కంభంమెట్టు' 'ఖమ్మం' గా పరిణామం చెందుతూ వచ్చిన ఒక పురాతన చారిత్రక ప్రదేశంగా చెప్పబడుతున్నది. ఇక్కడగల అతి పురాతనమైన స్తంభాద్రి నరసింహస్వామి ఆలయం ఈ పట్టణ నామానికి కారణంగా కొందరు చెపుతారు. ఈ పట్టణం మధ్యలోగల కోట లేక "ఖిల్లా" క్రీ॥శ॥ 1006లో సుమారు 300 అడుగుల ఎత్తున గల మహా పర్వతం మీద కట్టబడి సుమారు 300 సంవత్సరములు రెడ్డివంశ రాజుల పాలనలో ఉన్నది. 1424లో గోల్కొండ సుల్తానుల వశమైనది. 1767 లో బ్రిటిష్ సైన్యం ఆక్రమించుకొన్నది.

ప్రాచీనకవులలో దిట్టగాచెప్పబడుతున "అమృతప్రాయ" విశేష కావ్యరచనా సంభావ, పుంభావ" యని తనను తాను వర్ణించుకున్న 'హరిభట్టు" క్రీ॥శ॥ 1472-1535 సంవత్సరము॥

నడుమ కంబముమెట్టునివాసి, మత్స్య, వరాహ, నరసింహ పురాణకర్త.

చతుర చతురంగబల రత్న సౌధయూధ
బాలగోపురతోరణ సకలవర్ణ
పౌర వారాంగనా జన ప్రముఖవను

మేదురం బట్టి కంబముమెట్టు పురము" అని తన వరాహ పురాణంలో ఈ పట్టణాన్ని వర్ణించాడు. అతడే ఇక్కడి కోటను

'ఆంధ్ర మండఖగిరి దుర్గహారలతకు
విమల నాయ కరత్న భావము భజించి
యున్నతోన్నత శైల సంపన్నమగుచు
సకల వుట భేదముల నెన్నికకునెక్కి' అంటూ కీర్తించాడు.

ఇక్కడకు 16 మైళ్ళదూరంలో వున్న నేలకొండపల్లిగ్రామం భద్రాచలం దేవాలయ నిర్మాతగా, భక్తరామదాసుగా, దాశరథి శతక రచయితగా పేరొందిన కంచెర్ల గోపన్న జన్మస్థలం.

ఆ గ్రామ పరిసరాలలోనే ఇటీవలి త్రవ్వకాలలో మహత్తర శిల్పకళా ఖండాలుగా పేర్కొనదగిన తొమ్మిది బుద్ధ విగ్రహాలు, కట్టడాలు బయల్పడినవి. వీనికి, అమరావతి శిల్పాలకూ, శ్రీపర్వత (నాగార్జున) ప్రాంతంలో బయల్పడిన కళాఖండాలకూగల సారూప్యంవల్ల యీ ప్రదేశం క్రీ॥శ॥ 1, 2 శతాబ్దాలనాటి బౌద్ధ నాగరికత వెల్లివిరిసిన ఆంధ్రప్రాంతంలో ఒక ముఖ్య భాగంగా అర్థమవుతున్నది.

ఖమ్మంజిల్లా రాజకీయ చరిత్ర చెప్పకోదగ్గదీ గర్వించ దగ్గదీకూడా. నైజాం నవాబు పరిపాలనలో అవిర్భవించిన "ఆంధ్ర మహాసభకు" ముఖ్య కార్యరంగం వరంగల్ - ఖమ్మం ప్రాంతం. కీర్తిశేషులు మాడపాటి హనుమంతరావు, సర్దార్ జమలాపురం కేశవరావుగార్లు యీ ప్రాంతంవారు. ఆంధ్ర మహాసభ మితవాదులనుండి వేరుపడిన తరువాత జరిగిన "12 వ మహాసభ" 1944లో ఖమ్మం పట్టణంలో జరగడం గమనార్హం. అనాటినుండి ఆంధ్రమహాసభ తెలంగాణా పీడితప్రజల అభిమాన 'సంఘం'గా, నైజాం రజాకార్లకు వ్యతిరేకంగా చరిత్రాత్మక సాయుధ రైతాంగ పోరాటాన్ని నడిపిన "విప్లవ సంస్థగా" అనేకమంది యువకిశోరాల, అమరవీరుల కన్నతల్లిగా రూపొందిన విషయం ఇటీవలిచరిత్ర. ఆ మహాయోధుల, ప్రజా సైనికుల రక్తంతో తడవనిచోటు ఖమ్మం జిల్లాలో లేదంటే అతిశయోక్తి కాదేమో.

అదే పోరాటు సాంప్రదాయం తరువాత సంవత్సరాలలో కూడా ప్రస్ఫుటమౌతూ వచ్చింది. నిరంకుశత్వానికి, అన్యాయాలకు, అక్రమాలకువ్యతిరేకంగా జరుగుతూవచ్చినప్రతిఉద్యమానికి మా జిల్లా చైతన్య ప్రజానీకం తన అండదండల్ని యివ్వడంలో ఎప్పుడూ ముందే వుంటూవచ్చింది.

మా జిల్లా ప్రజానీకంయొక్క పోరాటు సాంప్రదాయం, నైతిక పాటవం, ఆశయసాధనపట్ల పట్టుదల, అభ్యుదయ ఉద్యమాలయెడలగల సుహృద్భావం - వీటిపై ఆధారపడి మాత్రమే మేము మీ యీ మహాసభలను యిక్కడికి ఆహ్వానించ సాహసించామని విన్నవించుకొంటున్నాను. ఇక్కడ మీ రెండురోజుల కార్యక్రమఫలితంగా అభ్యుదయ ఉద్యమాన్ని మరొకమెట్టు పైకి తీసుకు వెళ్ళగలిగితే, మన విద్యారంగాన్ని ప్రస్తుతమున్న "ఊబి"లోనుండి మరికొంచెం పైకి లాగగలిగితే, మనందరి ఉమ్మడి లక్ష్యసాధనవైపుకు మరొక అడుగు ముందుకువేయించ గలిగితే, ఆ మేరకు మా ఆశయం సఫలమైనట్లుగానే మేము సంతోషించగలమని మనవి చేసుకొంటున్నాను,

మీరు మీ ద్వితీయ మహాసభలు జరుపుకుంటున్న యీ సమయం-మనజాతి జీవితం ఒక ప్రత్యేకమైన మలుపు తీసుకొంటున్న సమయం. దేశంపై అలుముకొన్న కారుమేఘాలు విచ్చుకొంటున్న సమయం. పంజరంలో బంధింపబడిన ప్రజాస్వామ్యం రెక్కలు విదిలించుకొంటున్న సమయం. మేధావుల మెదళ్ళకు వేసిన తాళాలు విప్పుకొంటున్న సమయం. భయంతో సిగ్గుతో వంచిన తలలు తిరిగి పైకి ఎత్తడానికి సాహసిస్తున్న సమయం. అందుకే మనం విద్యా వైజ్ఞానిక రంగంలో ఎక్కడున్నామో, ఏ దారిన పయనిస్తున్నామో వెనుదిరిగి చూసుకునే అవకాశం, నిర్భయంగానూ, నిష్కపటంగానూ revaluate చేసుకునే అవకాశం కలిగింది. ఈ అవకాశాన్ని సద్వినియోగపర్చుకోవలసిందిగా కోరుతున్నాను.

అక్షరక్రమంలో ప్రథమ స్థానంలోవున్న మన ఆంధ్రప్రదేశ్‌లో యిప్పటికే-అయిదు ప్రణాళికల తరువాత - నిరక్షరాస్యులసంఖ్య మూడున్నరకోట్లు - అందులో పయోజనులే కోటిన్నర మంది. మన ప్రణాళికలు సాంఘిక సంక్షేమరంగాన్ని అందునా ముఖ్యంగా విద్యావైద్యరంగాలను చిన్నచూపుచూస్తూ వస్తున్నాయి. ఉదాహరణకు అయిదవ ప్రణాళికలో విద్యారంగానికి కేటాయింపు చివరికి 1200 కోట్లకు దిగజారింది. ఇదిమొత్తం ప్రణాళికలో 1.15 శాతం మాత్రమే. దీనితో మన రాజ్యాంగ ఆదేశిక సూత్రాలు అమలు జరగడం నిరక్షరాస్యత నిర్మూలన గావడం ఎంత అసాధ్యమో ఊహించడం అంత కష్టం కాదు. నిర్బంధ ప్రాథమిక విద్య, ఆర్థిక ప్రగతి పరస్పర ఆధార భూతాలు. మన ఆర్థిక సంక్షోభం పరిష్కారం కాకుండా మొదటిది ఆశించడం అర్థరహితం. అలాగే వయోజన విద్య - నినాదంగా మిగిలిపోతుందన్నా ఆశ్చర్యపడనక్కరలేదు ప్రజల, రాజకీయ పార్టీల. సంఘ సేవా సంస్థల active involvement లేకుండా కేవలం పాలనా వ్యవస్థద్వారా యిది సాధ్యంకాదు. చైనా ఉదాహరణ ఈ విషయాన్ని నొక్కి చెబుతున్నది.

'The destiny of India is now being shaped in her class rooms' (భారతదేశపు భవిష్యత్తు తనపాఠశాలల్లో రూపొందించబడుతోంది.) అన్నది కొఠారి కమిషన్ నివేదిక ప్రారంభవాక్యం. దీనిని ఎంతవరకు వాస్తవం చేసుకొంటున్నామన్నది. మనమందరమూ పరిశీలన చేసుకోవలసిన విషయం.

"The present system of education, designed to meet the needs of an imperial administration within the limitations set by a feudal and traditional society, will need radical changes if it is to meet the purpose of a moderdn, democratic and socialist society-changes in objectives, incontent, in teaching methodds, in progra-mmes, in size and composition of the student body, in the selection and professional preparation of teachers and in organisation". (ibid page 9) ఇదిదశాబ్దం క్రితం చెప్పిన సత్యం. దీనిని ఎంతవరకు అమలు జరిపారన్నది కూడా పరిశీలనార్హమే. సారధి మారినవుడల్లా ఏదో ఒకమార్పు

తెస్తున్నామన్న అల్ప సంతోషం మినహా పైకి చెప్పిన "radical changes" ఏ మేరకు తీసుకురాగలిగామన్నది. ఆలోచించదగ్గ విషయం.

విద్యార్థియువకుడుగా విద్యాలయంనుండిబయటకు వచ్చే సరికి-ఏదో ఒకవృత్తిచేసుకొని బ్రతికే నైపుణ్యత అతనికి అందిస్తున్నామా? భౌతిక జీవనంతోనూ ఉత్పత్తితోను ముడివడని విద్యా విధానం నేలవిడిచిన సాము కాదా! "No reform is more important or more urgent than to transform education, to endeavour to relate it to the life, needs and aspirations of the people"—(ibid page 11) అని ఒప్పుకున్నతరువాత మన విద్యావిధానాన్ని నిజంగాఅలామలచడానికి ఏ మేరకు కృషి జరిగింది? ఈ ప్రశ్నలన్నీ మీముందు చర్చకు వస్తాయనే ఆశిస్తున్నాను.

విద్యారంగంలో ప్రైవేట్ సెక్టార్ పాత్రను గురించి భిన్నాభిప్రాయాలుండవచ్చును. కాని విద్య భావ విప్లవానికి సాధనగాను, సమసమాజ స్థాపనకు దోహదకారిగాను మతాతీత సామాజిక వ్యవస్థకు పునాదిగాను ఉండాలన్న దానిలో భేదాభిప్రాయాలు ఉండవనుకుంటాను. ఈ దృష్టితో చూసినప్పుడు విద్యారంగంలో సంపన్న నిరుపేద వర్గాలకు వేరువేరు అవకాశాలు కల్పించే పద్ధతిని గురించి పునరాలోచన అవసరమనుకుంటాను. elitist education భావ విప్లవానికి అవరోధం కాదా? మత సంస్థల చేతుల్లో విద్యాసంస్థలను పెట్టి వాటిని ప్రభుత్వమే ప్రోత్సహించే విధానం ఎక్కడకు దారితీస్తుంది? ఇదికూడా పరిశీలించడం అవసరమని భావిస్తున్నాను.

బోధనాంశాల బరువుతో బాలబాలికల మెడలు వంగుతున్నాయనీ, ఆలోచనకూ, innovation కూ, originality కి అవకాశం ఉండటంలేదనీ విమర్శ కొంతకాలంగా వినవస్తూంది. దీనిలోని వాస్తవాన్ని చెప్పగల అర్హత ఉపాధ్యాయుల కన్న వేరొకరికి ఉండజాలదు.

చారిత్రక సంఘటనల గూర్చి విశ్లేషణలో భిన్నాభిప్రాయాలకు తావున్నది. సాధ్యమైనంతవరకు objective గా ఆయా సంఘటనలను చూడగలగడంలోనూ, పిల్లలకు నేర్పడంలోనూ, విశిష్టత వుటుంది. జాతీయతా నినాదం మరుగున సంకుచిత జాతి మత దురభిమానపు అద్దాలలోనుంచి చరిత్రను పరిశీలించే ప్రయత్నం జాతికి మంచిదికాదు. మరోకవైపునవ్యక్తి ప్రాముఖ్యత, కుటుంబ ప్రాముఖ్యత దృష్టిలో చరిత్రను వక్రీకరించే ప్రయత్నమూ గర్హనీయమే, విద్యావేత్తలూ, ఉపాధ్యాయులూ, భావిపౌరులను ఈ ద్వివిధ ప్రమాదాల నుండి కాపాడవలసి వుంటుంది.

విద్యాలయాల నుండి బయటకువచ్చే వారిలో అత్యధికులకు శారీరక శ్రమమీద చిన్నచూపూ, తూష్ణీభావమూ, తెల్ల చొక్కా ఉద్యోగులన్నా, నగర నాగరికతన్నా వలమాలిన మోజూ ఉండటం గమనిస్తున్నాము. భౌతిక ఉత్పత్తి సాధనకు గాని, జాతి సమగ్ర అభివృద్ధికిగాని ఈ ధోరణి దోహదకారి కాజాలదు. ఇలాంటి పరిణామానికి పునాది మన విద్యా విధానంలోనే ఎక్కడో వున్నదనేది నిర్వివాదాంశం. దీనిని సరిజేయవలసిన అవసరమున్నది. శ్రమజీవన సౌందర్యాన్ని ప్రతివారూ చూడగలగాలి. ("Dignity of labour") అన్నది కేవల నినాదంగా మిగిలిపోకూడదు.

42వ రాజ్యాంగ సవరణ విద్యను రాష్ట్ర లిస్టునుండి ఉమ్మడి లిస్టులోనికి చేర్చింది. మనదేశంలోని భాషా, ప్రాంతీయవైవిధ్యాలు, వైరుధ్యాలకు దారితీస్తున్న సమయంలో యీ చర్య జాతీయ సమైకత్యకు దోహదం చేస్తుందా? లేక పరస్పర సందేహాలకు, సంఘర్షణకూ దారితీస్తుందా? అన్నది కూడా లోతుగా అధ్యయనం చేయదగ్గ విషయమే.

విద్యార్థులకు రాజకీయాలు అస్పృశ్య మైనవిగానూ, రాజకీయ అభిప్రాయాలు కలిగిన ఉపాధ్యాయులు - అధికార పార్టీకి భిన్నమైన రాజకీయ దృక్పథం గలవారు - దుండనార్హులుగానూ భావిస్తూ రావడం జరిగింది. ఈ ధోరణి ఆరోగ్యకరమైనదో కాదో కూడా పరిశీలన చేయడం అవసరమనుకుంటున్నాను. ఓటు వేసే హక్కు వున్న ప్రతివ్యక్తికీ, రాజకీయ అభిప్రాయాలు ఉండకపోతే ఆ ఓటు హక్కుకు అర్థమేమిటో తెలియదు. విద్యావంతులందరినీ రాజకీయ నపుంసకుల్ని చేసి దేశాన్ని ప్రగతి మార్గాన నడిపించడం హాస్యాస్పదం. విద్యావేత్తలను అధికార పార్టీ తన యింటి పనిమనుషులుగామార్చితే ప్రజా స్వామ్యం అనతికాలంలోనే ప్రభుస్వామ్యంగా రూపొందడం ఖాయం.

ఆఖరుకొకమాట, నేటి మన సమాజంలో దురదృష్టవశాత్తూ విద్యావంతుల్లో ప్రత్యేకంగా ఆత్మవిశ్వాసంతోపాటు, ఆత్మాభిమానం కూడా క్షీణిస్తూవస్తున్న విషయం దాదాపు అందరూ అంగీకరిస్తున్నారు. కొఠారి కమీషన్ చెప్పినట్లు 'While a combination of ignorance with goodness may be futile, that of knowledge with a lack of essential values may be dangerous. (P. 34) ఈ ప్రమాదకర పరిణామానికి వెనుకగల సామాజిక, ఆర్థిక, రాజకీయ కారణాలను పరిశీలించి సరిచేయడం తప్పనిసరియైన తక్షణ కర్తవ్యమని మనవి చేస్తున్నాను.

దేశంలో ఉపాధ్యాయుల పాత్ర కీలకమైనది. నూతన సమసమాజ నిర్మాణ బాధ్యత ప్రత్యేకించి మీ భుజస్కంధాలపై మరింతగా ఉన్నది. ఒక కొత్తతరాన్ని నిర్మించే కర్తవ్యంమీది.

"భావి నేలే తరాలూ
స్వర్ణయుగ విధాతలూ
పావన, నవజీవన
బృందావన నిర్మాతలూ"

ఐన నూతన తరాన్ని నిర్మించే శిల్పులు మీరు. కనుక నేడు విద్యారంగాన్ని ఎదుర్కొంటున్న సమస్యల్ని సావధానంగా అమూలాగ్రంగా చర్చించి, శాస్త్రీయమైన, సమగ్రమైన చిత్తశుద్ధితోకూడిన నిర్ణయాలు చేస్తారని ఆశిస్తున్నాను. మీ నిర్ణయాలుదేశాభివృద్ధికిమార్గదర్శకాలుకావాలని అభిలషిస్తున్నాను.

మరొక్కసారి మీ అందరకూ, మా హార్దికస్వాగతాన్ని అందజేస్తున్నాను.

ఈ మహాసభలకు వచ్చిన పెద్దలకు, ప్రతినిధులకు సరైన వసతులు కల్పించడానికి మా శక్తివంచనలేకుండా కృషిచేశాము. ఐనా అనేక లోపాలు జరిగి వుండవచ్చును. సహృదయంతో మమ్మల్ని మన్నించి కార్యక్రమాన్ని దిగ్విజయం చేయవలసిందిగా కోరుతున్నాను.

భవదీయుడు,
వై. రాధాకృష్ణమూర్తి,
ఆహ్వానసంఘ అధ్యక్షులు.

# ఉద్యమానికి కరదీపికగా ఉత్తేజపరచిన

# అధ్యక్షోపన్యాసం



వేదిక నలంకరించిన పెద్దలారా !

మహాసభ ప్రతినిధులారా !

సోదర ఉద్యమ కార్యకర్తలారా !

సౌహార్ద ప్రతినిధులారా !

పూనిక వహించిన ఆశయసాధనలో అన్ని వేళలా పీడితోపాధ్యాయుల బాసటనిల్చి సంఘ ప్రతిష్టను నలుమూలలకు వ్యాపింపజేసి సంఘానికి చైతన్య ప్రదీప్తిని, పోరాట పటిమను ఒనగూర్చి నిర్దిష్ట పోరాట సంస్థగా తీర్చిదిద్దిన కాకలుతీరిన కార్యకర్తలకు, ఆహ్వానించిందే తడవుగా ఆదరంతో మహాసభల కరుదెంచిన విద్యావేత్తలకు, సౌహార్ద ప్రతినిధులకు, ఇతర రాష్ట్రాల ఉద్యమ నాయకులకు స్వాగతం—హార్దిక సుస్వాగతం.

సరిగ్గా నేటికి మూడు సంవత్సరాలక్రితం ఆ నాటి చారిత్రక పరిస్థితుల అవసరం దృష్ట్యా ఉపాధ్యాయుల్లోని కేటగిరీ భేదాలు, ప్రాంతీయ భేదాలనే అడ్డుగోడల్ని బ్రద్దలుగొట్టి ఒకే ప్రభుత్వం క్రింద, ఒకే విద్యా వ్యవస్థ క్రింద అనేక ఇడుములు పాలవుచున్న ఉపాధ్యాయులందరినీ ఒకే వేదికపై సమీకరించాలనీ వీరి ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ, నైతిక, పౌరసత్వ, వృత్తి హక్కుల కొరకు, వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్యాలకొరకు, కుల, మత, జాతి రాజకీయ, స్త్రీ, పురుష విభేదాల నిమిత్తం లేకుండా కృషిచేయాలనీ తెలుగుజాతి సర్వతోముఖ వికాసానికి పూనిక వహించాలనే ఉత్తమ ఆశయంతో అత్యంత సాహసంతో ఆంధ్ర - తెలంగాణా సమైక్య ఉద్యమ నిర్మాణానికి మొదటి సంస్థగా తెలుగునాట ఈ సంస్థ ఆవిర్భవించింది. ఉత్తమ ఆశయాన్ని గుర్తించిన మేధావుల పూర్తి సహకారంతో నేటికి 18 జిల్లాలలో శాఖలు గల్గి 21 వేల సభ్యత్వంతో మిాదు మిక్కిలి పోరాట పటిమగలసంస్థగా ఉపాధ్యాయులమన్నన పొందింది. కార్యకర్తల అకుంఠితదీక్ష, త్యాగఅభిమానాల ఆదరణ పెట్టుబడిగా సంస్థ తన మనుగడను కొనసాగించి సుశిక్షిత కార్యకర్తల సంఘంగా రూపొందిందని తెలియజేయడానికి సంతోషంగా వుంది.

ఉపాధ్యాయులమధ్య ఎన్ని భేదాభిప్రాయాలున్నా, ఉపాధ్యాయ సంఘాలమధ్య ఎన్నిసంఘర్షణలున్నా, ఉపాధ్యాయుల ఉమ్మడి కోర్కెల కొరకై ఉపాధ్యాయులందరూ, ఉపాధ్యాయ సంఘాలన్నీ కలసికట్టుగా పోరాడాలన్న ఆకాంక్ష కల్గి అందు కొరకు అహోరాత్రులు అగ్రభాగాన నిలబడి కృషిచేయాలన్న సూత్రబద్ధ వైఖరిని అక్షరాలా పాటిస్తూ తొలి మహాసభలో శ్రీ సత్యప్రియరాయ్ ఆశించినట్లుగా 'పోరాటం ప్రాతిపదికగాగల ఐక్యత మరింత ఐక్యత ప్రాతిపదికగాగల పోరాటం' మార్గదర్శక సూత్రంగా ఆచరిస్తూ, ముందుకు సాగిందీ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్. అదురూ, బెదురూ విడనాడి సమరశీలతతో ఉపాధ్యాయుల కోర్కెలకొరకు, సంక్షేమంకొరకు చిత్తశుద్ధితో జరిపే పోరాటమే ఉద్యమానికి జీవగర్రగా, వెలుగుబాటగా, మచ్చలేని ఆశయ రూపకల్పనగా భావించి ఉపాధ్యాయుల ఆత్మబలాన్ని పెంచుతూ సంఘటిత శక్తిగా రూపొందిందీ సంస్థ.

## ఆ శ య ం

సమాజంలో ఉపాధ్యాయులకొక విశిష్ట స్థానముంది. ఉజ్వల భవిష్యత్తును తీర్చిదిద్దవలసిన భావిపౌరులు నేటి ఉపాధ్యాయులకు శిష్యులు. ఆ విషయాన్ని గుర్తించని ఉపాధ్యాయులు కేవలం తమకూ, తమవృత్తికీ పరిమితమై కూపస్థమండూకాలై ఉజ్వల భవిష్యత్తువైపు తేరిపార చూడనూలేరు. విద్యార్థులకు వెలుగుబాటనుచూపనూలేరు. అందుచేత విద్యాశ్రేయస్సుతో సామాజిక శ్రేయస్సు. సామాజిక శ్రేయస్సుతో ఉపాధ్యాయుల శ్రేయస్సు ముడివడియున్నదన్న సత్యాన్ని విస్మరించకుండా విద్యారంగ సంక్షోభాన్ని నిరంతరం పరిశీలిస్తూ ప్రత్యామ్నాయ విద్యావ్యవస్థ స్వరూపాన్ని ఎప్పటికప్పుడు ప్రజలముందుంచాలి.

## విద్యారంగ సంక్షోభం

స్వాతంత్ర్యం వచ్చి 30 సంవత్సరాలుగడిచినా దేశంలో అక్షరాస్యత 30 శాతం దాటలేదు, ప్రపంచంలోని నిరక్షరాస్యులలో సగం మంది ఆసియాలోని నిరక్షరాస్యులలో 75 శాతం మంది మన దేశంలోనే ఉన్నారంటే మనదేశం ఎంతగా అజ్ఞానానికి దారిద్ర్యానికి ఆలవాలంగా నున్నదో విస్పష్టమవుతోంది. పది సంవత్సరాలలో 14 సంవత్సరాల లోపు పిల్లలందరికీ నిర్బంధోచిత విద్య లభ్యం చేయాలని రాజ్యాంగ చట్టం 45 వ ఆర్టికల్లోని ఆదేశం. ఆ తర్వాత 27 సంవత్సరాలు గడిచినా ఇప్పటికీ నెరవేరలేదు. మరొక 20 సంవత్సరాలు గడచినా నెరవేరుతుందన్న ఆశ కనపడటం లేదు. 6 - 11 సం॥ వయస్సు గ్రూపులోని పిల్లల్లో నూటికి 55 మంది ఒకటవ తరగతిలో చేరుతున్నారు. ఇందులో 22 శాతం 8వ తరగతికి జేరుకుంటున్నారు. 8 శాతం మాత్రమే పదవ తరగతికి చేరుకుంటున్నారు. 15 సం॥ పైన వయసున్న వారిలో 24½ కోట్లు, 5-14 యేండ్ల వయస్సు మధ్యనున్న వారు 10 కోట్లమంది నిరక్షరాస్యులు: తమ జీవనోపాధికి వారికి శారీరక శ్రమ మినహా వేరే మార్గం లేదు. ఈ అజ్ఞానమే పెట్టుబడిదారీ దోపిడీకి, ఫాసిజానికి శ్రీరామరక్ష. అంతే కాదు ఉత్పాదక శక్తికీ అక్షరాస్యతకూ అవినాభావ సంబంధముంది. నిరక్షరాస్య కార్మికుని ఉత్పాదక శక్తితో పోల్చితే పైమిరీ విద్య కలిగిన కార్మికుని ఉత్పాదక

శక్తి 43శాతం, సెకండరీవిద్య గలిగిన కార్మికుని ఉత్పాదకశక్తి 108 శాతం, పట్టభద్రుడైన కార్మికుని ఉత్పాదకశక్తి 300శాతం అధికంగా యుంటుందని వర్ధమానదేశాల విద్యావేత్తల పరిశోధనా ఫలితం తెల్పుతోంది. నిరక్షరాస్యత మూలంగా ఉత్పాదక శక్తి ఎంతగా కుంటుపడి జాతీయాభివృద్ధి మందగిస్తున్నదో విశదమవుతున్నది. అభివృద్ధికర దేశాలు అవి పెట్టుబడిదారీ దేశాలుగాని, సోషలిస్టు దేశాలుగాని విద్యాపద్దు మీద పెట్టుబడి అత్యవసరమైన పెట్టుబడిగా గుర్తించి అమలు పర్చి అభివృద్ధి సాధించారు. శ్రీ బి. జి. ఖేర్ కమీషన్ సిఫార్సు ప్రకారం కేంద్ర బడ్జెట్‌లో 10 శాతం రాష్ట్ర బడ్జెట్‌లో 35 శాతం విద్యాపద్దుకు కేటాయించాలి. కాని ఈ 27 సంవత్సరాలుగా ఆ సిఫార్సును అమలు పర్చిన వారేలేరు. పైగా 5 వ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో 53 వేల కోట్ల రూపాయలకు గాను 3200 కోట్ల రూపాయలు కేటాయించి వరసగా ఆ పద్దుపై కోతలు సాగించి చివరకు 1200 కోట్లరూపాయలు స్థిరీకరించారంటే ఈ ప్రభుత్వంయొక్క వర్గదృక్పథమే ఆకోతలకు కారణమని శంకించక తప్పదు. కేటాయించిన మొత్తంలో కూడా 60 శాతం పైగా ఉన్నత విద్యకే వినియోగిస్తున్నారు. విద్యావ్యవస్థను పిరమిడతో పోల్చితే పిరమిడ్ యొక్క పాదముగా ప్రాథమిక విద్యను గుర్తించాలి. అందుచేత ప్రాథమిక విద్యమీద ఎక్కువ శాతం కేటాయించాలి.

## మనరాష్ట్రంలో విద్యాభివృద్ధి

దేశ వ్యాప్తంగా విద్యాభివృద్ధి ఇంత చక్కగా వుండగా మన రాష్ట్రంలో విద్యాభివృద్ధి మరింత వెనుకబడియున్నదని తెల్పుటకు విచారకరంగా వున్నది. అమర్త్య ప్రొఫెసర్ యస్. గోపాల్ అధ్యక్షతన మన రాష్ట్రంలో పర్యటించిన 13 గురు సభ్యుల కమిటీ ఈ విషయమై దిగువ అభిప్రాయాన్ని తెలియజేసింది :

"రెండు లక్షల 76 వేల చదరపు కిలోమీటర వైశాల్యంలో 4 కోట్ల 35 లక్షల జనసంఖ్యగల ఆంధ్రప్రదేశ్ మిగతా భారతదేశంతో పోల్చితే చాలా వెనుకబడి యున్నది. అన్ని శాఖలలోను విస్తరించవలసిన అవసరం అభివృద్ధి చెందవలసిన అవసరంవున్నది. దేశంలోసగటు అక్షరాస్యత 30 శాతం వుంటే ఆంధ్రప్రదేశ్‌లో అది 24.57 శాతమే. ప్రాథమిక పాఠశాలల్లో ఆ వయస్సుగల పిల్లలు 68.3 శాతం ఉన్నారు. అలాగే మాధ్యమిక పాఠశాలల్లో 18.5 శాతం, ఉన్నత పాఠశాలల్లో 16.1 శాతం మాత్రమే వున్నారు. దేశంలో ఉన్నత విద్య నభ్యసించువారు వేయికి 6 గురు వుండగా ఈ రాష్ట్రంలోవున్నది 4 గురే. దేశంలో ప్రతి పదిలక్షలమందికి 250మంది పోస్టుగ్రాడ్యుయేషన్ చేస్తుండగా ఇక్కడ ఆ సంఖ్య 110గా మాత్రమే యున్నది అలాగే దేశంలో ప్రతి పదిలక్షలమందికి 22 మంది రీసెర్చి విద్యార్థులుండగా ఇక్కడాసంఖ్య 13గా మాత్రమే యున్నది. కనుక ప్రభుత్వం విద్యారంగానికి సంబంధించిన అన్నిశాఖల్లోనూ చేయవలసినదెంతో వున్నది."

దీనికి వేరే వ్యాఖ్యానం అవసరంలేదనుకుంటాను. చేయవలసినదెంతోయుండగా ఉపాధ్యాయ శిక్షణ పాఠశాలలను మూసివేయడం జరిగింది. సర్వీసులోయున్న ఉపాధ్యాయులకు షార్టెండ్ బి.యిడి కోర్సులను రద్దుచేయడం జరిగింది. 6 వేల గ్రామవాసాల్లో పాఠశాలలు లేవని ముఖ్యమంత్రిగారే ప్రకటించారు. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి హెచ్చించి అదనంగా వున్న ఉపాధ్యాయులను ఈ గ్రామవాసాల్లో పాఠశాలలను తెరవడానికి ఉపయోగిస్తామంటున్నారు. ఇదీ వీరి శాస్త్రీయ బోధనాధోరణి. రెండవప్రపంచ యుద్ధానంతరం జనాభాకరువైన సందర్భంగా పశ్చిమ జర్మనీలో ప్రవేశపెట్టిన ఏకోపాధ్యాయ పాఠశాలపద్ధతి ఆదేశంలో ఒక దశాబ్దం గడవగానే రద్దు చేసినా, దానిననుకరించిన భారతదేశంలో అందులోనూ మనరాష్ట్రంలో 28 వేల ఏకోపాధ్యాయ పాఠశాలలున్నాయనీ వాటినింతవరకు రద్దుచేయాలనే ఆలోచన ఏమాత్రమూ ఈ ప్రభుత్వానికి లేదంటే విద్యాభివృద్ధిపై మన ప్రభుత్వ వైఖరి మరింత స్పష్టం గదా!

## వయోజన విద్య

ప్రత్యక్షంగా ఉత్పాదకక్రియలో పాల్గొంటున్న వారిలో 245 మిలియన్లు నిరక్షరాస్యులుగనున్నారంటే వయోజనవిద్యకు ఎంతప్రాధాన్యత ఇస్తున్నారో మనం గుర్తించగలం. వారు పని చేస్తున్న గనుల్లో వనుల్లో ఖార్ఖానాల్లో వయోజన పాఠశాలలను ఏర్పాటుచేసి నిరక్షరాస్యతను నిర్మూలిస్తే వారి పనిలో ప్రజ్ఞాప్రతిభలుపెరిగిఉత్పాదకశక్తి పెరుగుతుంది.కానిభారతప్రభుత్వం గత25 సంవత్సరాలలో వయోజన విద్య కొరకు ఖర్చుపెట్టింది కేవలం 25 కోట్ల రూపాయలు. అంటే ఏడాదికి ప్రతి నిరక్షరాస్యుడి మీద ఖర్చుపెట్టింది కేవలం 2, 3 పైసలు మాత్రమే. ప్రభుత్వం విద్యకోసం ఖర్చుపెట్టే మొత్తంలో 99 శాతం మామూలు విద్యకోసం వినియోగించుతూ ఒక్కశాతంమాత్రమే వయోజన విద్య కోసం ఖర్చుపెడుతున్నదని భారత వయోజన విద్యా మండలి అధ్యక్షులు, మద్రాసు విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ శ్రీ యం. ఆదిశేషయ్యగారు ఇటీవల ప్రకటించారు. క్యూబా, వియత్నాం, చైనాదేశాలుపట్టుదలతో స్వల్పకాలంలో నిరక్షరాస్యతను నిర్మూలించిన ఉదాహరణ లున్నాయి. కాని భారత దేశ పాలకవర్గం ఇంకా వలస విధానపు లక్షణాలకు కట్టుబడి వున్నందున ఈ రకంగా మొత్తం జనసామాన్యాన్నంతటిని అక్షరాస్యులనుజేసే కార్యక్రమాన్ని ఎన్నటికీ అమలు జరపదు. ఎందువలనంటే ఈ రకమైనవిధానం చివరికినేడు ఉన్నతులుగా వున్నవారు గొప్పగా విశ్వసించే, బహుళ ప్రచారంచేసే విలువలనే ప్రజలు తిరస్కరించేందుకు దారితీస్తుంది. అక్షరాస్యత అనేది పీడిత ప్రజల చేతుల్లో విముక్తి ఆయుధం అక్షరాస్యత దేశంలో సర్వతోముఖాభివృద్ధి సాధనకొరకు శక్తివంతమైన సాధనం. ఇతర నైపుణ్యాలను గడించేందుకు మరింత హేతుబద్ధమైన వైఖరులను పెంపొందించుకునేందుకు మున్ముందుగా అవశ్యకమైనది. అక్షరాస్యత. అందువల్ల భారతదేశము నుండి నిరక్షరాస్యతను తుడిచిపెట్టమని మనం గట్టిగా డిమాండు చేయాలి. ఇందుకోసం దేశవ్యాపితంగా పట్టువిడుపులులేని ఉద్యమం సాగించడం అవశ్యకమైయున్నది. జాతీయజీవనంలో దానికిగల కీలక ప్రాధాన్యతపట్ల విశ్వాసంతో ప్రేరితమైనఉద్యమంగా సార్వజనీన అక్షరాస్యత మన దేశ విద్యా వ్యవస్థకు విస్తృత పునాది గావాలి. ఆ పైన క్రమానుగతంగా పునర్నిర్మాణాన్ని సాగించాలి.

## విద్యాసంస్థల భౌతిక పరిస్థితులు

అత్యధిక విద్యాసంస్థలలో బిల్డింగ్, ఆటస్థలం, లైబ్రరీ, లేబరేటరీ, ఫర్నిచర్ వగైరా (సౌకర్యాలు) కనీసస్థాయిలో కూడా లేవు. చాలప్రాథమిక పాఠశాలలు గొడ్లచావిళ్లకన్న హీనంగా వున్నాయి. సిమెంటున్నం నల్లబల్లకూడావుండవు. సూర్యచంద్రుల కాంతినిరాఘాటంగా ప్రసరిస్తూయుంటుంది. వర్షంవస్తే సరేసరి. కనీసమైనతాగటానికి మంచినీరు శానిటరీ వసతికూడా వుండదు. 'భవిష్యత్ పౌరుని మూసపోసే ప్రయోగశాల తరగతి గది' అని కొఠారికమీషన్ నిర్వచించినతరగతిగది, పాఠశాల పరిస్థితులిలా వుంటేఉపాధ్యాయునిపరిస్థితి మరోరకంగా ఎందుకు వుంటుంది. ఏకోపాధ్యాయ పాఠశాలలో ఉపాధ్యాయు డొక్కడే 5 తరగతులకు అన్ని సబ్జక్టులను బోధించాలి. తాను శెలవు పెడితే ఆ రోజు పాఠశాల మూయవలసిందే. అన్ని తరగతులకు అన్ని సబ్జక్టులకు నూతన మూల్యాంకన పద్ధతిలో లెసన్ ప్లానులు వ్రాయాలి. రోజంతా అవి వ్రాయడమే సరిపోతుంది. ఎయిడెడ్ పాఠశాలల్లో ఉపాధ్యాయులకు నెలల తరబడి జీతాలు చెల్లించబడవు. చెల్లించబడే జీతాలలో కూడా మేనేజర్ల దోపిడీలు చెప్పవలవిగాదు. గాడిద చాకిరీగానుగెద్దు జీవితంలా వుంటుంది ఉపాధ్యాయుని జీవితం.

పంచాయితీరాజ్ ఉపాధ్యాయుడు బదిలీల బెడదవలన ఆత్మగౌరవాన్ని కోల్పోతున్నాడు. సర్పంచ్‌నుండి జిల్లాపరిషత్ చైర్‌మన్‌వరకు అందరికి ఆయన ఆత్మగౌరవాన్ని తాకట్టుపెట్టి జోహుకుందారుడుగా మారుతున్నాడు. ఆత్మగౌరవం కోల్పోయిన ఉపాధ్యాయుడు ఆత్మగౌరవంగల విద్యార్థులను తయారు జేయలేడు ఇక అన్ ఎయిడెడ్ పాఠశాలల సంగతి వేరే చెప్పనక్కరలేదు. అధునిక బానిస వ్యాపారం ఎక్కడన్నా సాగుతున్నదంటే అదిక్కడేనని చెప్పవలసి వస్తుంది. ఈ విద్యాసంస్థలోనే భవిష్యత్ పౌరులు తీర్చి దిద్దబడుచున్నారు.

## ఉపాధ్యాయ — విద్యార్థి నిష్పత్తి

సుదీర్ఘ కాలంగా ప్రాథమిక విద్యా స్థాయిలో ఉపాధ్యాయ-విద్యార్థి నిష్పత్తి 1:20గను సెకండరీ స్థాయిలో 1:30గను ఉండాలన్న సూత్రాన్ని ప్రభుత్వం ఏ మాత్రం పరిశీలించుట లేదు. కొన్ని పట్టణాలలో 1:70, 1:80, 1:90గను ఉన్నారంటే అదిశయోక్తికాదు. సెక్షన్లకు పర్మిషను ఇవ్వరు. కొత్త పోస్టులను శాంక్షన్ చేయరు. నూతన మూల్యాంకన పద్ధతి ప్రకారంగాని మరే పద్ధతి ప్రకారంగాని బోధన చేయటం సాధ్యమా ? పట్టణాల్లో పెరుగుతున్న జనాభాకనుగుణంగా నూతన సెక్షన్లను ప్రారంభించడానికెందుకు అనుమతివ్వరో దురూహ్యం. పశువులమందను కాపలాగాసి మళ్ళవేస్తున్నట్లున్నాయి పాఠశాలలు. హోం వర్కు, కాంపోజిషనులు, అసైన్‌మెంట్లు యూనిట్ పరీక్షలునిర్వహించి వానిని సరిదిద్దడం అసాధ్యంగా పరిణమిస్తున్నది.

## లక్ష్యాల నిర్దేశన

పాఠశాలల భౌతిక పరిస్థితులనుగాని, ఉపాధ్యాయుల జీవన పరిస్థితులనుగాని అభివృద్ధి పరచని ప్రభుత్వం పరీక్షలలో ఫలానా ఫలితాలను సాధించాలనే లక్ష్యాన్ని నిర్దేశిస్తోంది. లక్ష్యాన్ని సాధించలేకపోయినచో ఇంక్రిమెంట్లు ఆపడం వగైరా శిక్షణాచర్యలు తీసుకొంటామనే బెదిరింపు పాఠశాలల్లో అవినీతి పనులకు దారితీస్తుందని మేము గతంలో చేసిన హెచ్చరిక వాస్తవమైందని మరొకసారి ప్రభుత్వపుదృష్టికి తీసుకొని వస్తున్నాము. మొన్నటి పబ్లిక్ పరీక్షలలో ప్రశ్నాపత్రములు ముందుగానే బయటపడటం, కొన్నిచోట్ల సామూహిక కాపీలు జరగడం కేవలం ఇన్‌ఫ్లేటెడ్ పరీక్షాఫలితాలకే దారితీసినవి. గతంలో మహారాష్ట్ర, పంజాబ్ ప్రభుత్వాలకేరకమైన అనుభవమైందో అదే అనుభవం మన కేదురైనా ప్రభుత్వం గుర్తించడం లేదు. ఆనాటి ఆంధ్రజ్యోతి సంపాదకీయం చేసిన హెచ్చరిక గూడా నేటికి గమనంలోకి తీసికొనడంలేదు. విద్యావ్యవస్థలోని ప్రధానమైన రుగ్మతలను నిర్మూలించేందుకు ఉపాధ్యాయుల సహకారం పొందనిదే పరీక్షాఫలితాలు వాస్తవంగా అభివృద్ధికావు.

## నేటివిటి ఉత్తర్వు

నేటీవిటీ ఉత్తర్వును మొత్తంగా రద్దుచేయకుండా దఫదఫాలుగా సవరణలు చేస్తూ వస్తున్నది ప్రభుత్వం. ఉపాధ్యాయుల్లో అస్థిమితత్వం ఆందోళన గల్గించి విద్యాభివృద్ధికి ఆటంకముగా పరిణమించింది. ప్రిస్టేజి ప్రశ్నకు పోకుండా నేటీవిటీ నిబంధనను రద్దుచేయాలి. పాఠశాలా ప్రాంతాల్ని మంచినీరు, రహదారి, కరెంటు, విద్యా సౌకర్యాలున్నచో మొదటి తరగతి ప్రాంతముగాను, ఒక సౌకర్యం తక్కువగా నున్నచో రెండవ తరగతి ప్రాంతముగాను మరొక సౌకర్యం తక్కువగానున్నచో మూడవ తరగతి ప్రాంతముగాను, ఏ సౌకర్యంలేని ప్రాంతాన్ని నాల్గవ తరగతిగాను విభజించి, 4 వ తరగతి ప్రాంతములో ఉపాధ్యాయుని ఒక్క సంవత్సరముకన్న ఎక్కువవుంచకుండా మొదటి, రెండవ, మూడవ తరగతి ప్రాంతాలకు 5 సంవత్సరములు కాగానే చక్రీయంగా బదిలీచేసే పద్ధతిని అమలు చేసినచో ఉపాధ్యాయులలో ఆత్మగౌరవ ప్రతిష్ట పెరిగి విద్యాసంస్థలు అభివృద్ధినొందే అవకాశముంటుంది. రాజకీయ నాయకులకుకూడా అనవసరపు ఒత్తిడియుండదు. శాశ్వత పరిష్కార సూత్రముగా దీనిని ప్రభుత్వం వారు ఆలోచించవలసిందిగా కోరుచున్నాము.

## నిరుద్యోగం

దేశంలో అక్షరాస్యత ఇంత తక్కువగానుండగా చదువుకున్న వాళ్ళలో నిరుద్యోగం రోజు రోజుకి పెరిగిపోతున్నది. దేశవ్యాప్తంగా ఉపాధి కేంద్రాలతో 110 లక్షలమంది నమోదు చేయించుకొనగా మన ఆంధ్రప్రదేశ్‌లోనే 7 లక్షల 11 వేలమంది నమోదు చేయించుకొన్నట్లు ఇటీవల లెక్కల ప్రకారం తెలియుచున్నది. ఇప్పటికే చదువుకున్న వాళ్ళ గతి ఇలా వుండగా మరింక చదువెందుకన్న సామాన్యపౌరుని ఆవేదనను మనం అర్థం చేసుకోవచ్చును. చదువుకునే హక్కును, చదువుకున్న ప్రతి వానికి, పనిజేయడానికి సిద్ధపడ్డ ప్రతివానికి ప్రతిదశలోను పనికల్పించాలన్న హక్కును రాజ్యాంగంలో కల్పించాలని అప్పుడేనిజమైన విద్యాభివృద్ధి సాధించగలమని విశ్వసిస్తున్నాము.

## విద్య రాష్ట్రపరిధిలోనా? ఉమ్మడి జాబితాలోనా?

అత్యవసర పరిస్థితి కాలంలో రాజ్యాంగం ప్రసాదించిన సప్త స్వాతంత్ర్యాలు హరించబడిన కాలంలో 42వ రాజ్యాంగ సవరణచేస్తూ విద్యను ఉమ్మడి జాబితాలోకి చేర్చారు. జాతీయోద్యమ కాలంనుండి అన్ని పక్షాలు విద్యను రాష్ట్రాల పరిధిలోనే ఉంచాలని వాదిస్తూ వచ్చాయి. కాని ఇటీవల కొన్ని పక్షాలు తమ దృక్పథంమార్చుకొని 42వ రాజ్యాంగ సవరణను బలపర్చారు. భారత రాజ్యాంగం ఫెడరల్ స్వభావంగలదనీ భారతదేశం విభిన్న భాషలు, సంస్కృతులుగల దేశమని ఆయా భాషా సంస్కృతులనభివృద్ధి పరచుకొనుటకు విద్యను రాష్ట్రాల పరిధిలోనుంచాలన్న చిరకాల వాంఛితాన్ని ఈ నాటికీ మేము బలపర్చుతున్నాము. అమెరికా సంయుక్త రాష్ట్రాలు. ఆస్ట్రేలియా రష్యా మొదలైనదేశాల్లో విద్య రాష్ట్రాలజాబితాలోనుండి ఆయా భాషా సంస్కృతుల అభివృద్ధికెట్లా తోడ్పడిందో ఒకసారి పరిశీలించమని కోరుతున్నాను. దేశ వ్యాప్తంగా ప్రాథమిక, సెకండరీ, యూనివర్సిటీ విద్యల స్థాయిని ఒకే విధంగాను, ఉపాధ్యాయుల వేతనాలు, పని పరిస్థితులు సమానంగా ఉండేటట్లు కేంద్రప్రభుత్వం చూడాలి. అందుకనుగుణంగా తగిన నిధులను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు విడుదలచేయాలి. రాజ్యాంగపు 8వ షెడ్యూలులో గుర్తించిన 14 జాతీయ భాషల అభివృద్ధికి కృషి చేయాలి. జాతీయ భాషలన్నింటిలోను ఐ.ఎ.యస్., ఐ.పి.యస్ యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్, ఐ. ఐ. టి. తదితర పరీక్షలన్నీ నిర్వహించాలి.

### భాషా సూత్రం

త్రిభాషా సూత్రాన్ని వెంటనే రద్దు చేయాలి. 7 వ తరగతి వరకూ మాతృభాషలోనే అధ్యయనం జరగాలి. సెకండరీ దశలో ఐచ్ఛికంగా వేరొక భాషను అది ఇంగ్లీషుగాని, హిందీగాని ప్రవేశపెట్టవచ్చు. కాని అది సెకండరీ కోర్సు ముగించడానికి అందులో ఉత్తీర్ణుడు గావాలనే నియమం ఉండరాదు. ఉండరాదు. ఇంటర్మీడియట్ దశలో ఐచ్ఛికంగా మూడవ భాషను ప్రవేశపెట్టవచ్చును. మాతృభాషలోనే యూనివర్సిటీ విద్యవరకూ బోధించాలి. ఉద్యోగార్థము ఇతర భాషలలో వర్కింగ్ నాలెడ్జి సంపాదించుటకు కావల్సినసదుపాయాలు ఒనగూర్చాలి.

### + 2 విద్యా దశ

కొఠారి కమీషన్ సిఫార్సుల ప్రకారం ఇది చాలా ముఖ్యమైన సన్నాహకదశ. జీవితంలో సాంఘికంగాప్రయోజనకర మైన వివిధ వృత్తుల నవలంబించేందుకు అవసరమైన పరిజ్ఞానాన్ని, సిద్ధాంత ప్రాతిపదికను ఈ దశలో విద్యార్థులకు కల్పించాలి. సాధారణ మార్గంలోనూ, వివిధ వృత్తులకు సంబంధించిన రంగాలలోను ఉన్నత విద్యార్హతలు సంపాదించేందుకుగాను విద్యాసంబంధమైన వృత్తివిద్యార్జనకు ముందటి దశకు సంబంధించిన, వృత్తి విద్యానైపుణ్యానికి సంబంధించిన డైవర్సిఫైడ్ కోర్సులతో కూడినదిగా ఆ దశ ఉండాలి. అందువల్ల ఈ దశకు మొత్తం విద్యావ్యవస్థలో ప్రముఖస్థాన ముండాలి. జీవితానికి విద్యకూ గల సంబంధాలను పటిష్ట మొనరించడానికి, శాస్త్రీయ దృక్పథాన్ని కల్గించి ప్రజాతంత్ర జీవన విలువను పెంపొందించడానికి, నిజమైన ఉత్పాదక శ్రమంలో భాగస్వామ్యం కల్పించే విధంగా విద్యను ఉత్పాదక శ్రమతో మిళితం చేయడానికిగాను దాన్నిమార్చాలి. అంతేగాని అకడమిక్, ప్రీప్రొఫెషనల్ కోర్సు లోక వైపున, వృత్తి విద్యలొక వైపున ఏర్పాటు చేసి మానసిక శారీరక శ్రమకు మధ్య అంతరాన్ని అలానే ఉంచేందుకు పూనుకోరాదు. ఈదశ విద్యా సంస్థలను ప్రత్యేకంగా ఏర్పాటు చేయాలి. సెకండరీ పాఠశాలకు గాని, డిగ్రీ కళాశాలకు గాని జోడించరాదు. అజమాయిషి యస్. యస్. సి. బోర్డుకేవుండాలి. ఈ బోర్డులో + 2 దశకు సంబంధించిన ఒక ప్రత్యేక కమిటీని ఏర్పాటుచేసి అందులో కాలేజీ యూనివర్శిటీ అధ్యాపక ప్రతినిధులకు ప్రాతినిధ్యం కల్పించాలి. అట్లయినచో ఉత్తమ సమన్వయీకరణ జరుగుతుంది. ఏ విద్యాలయంలో పనిచేస్తున్నా సమానార్హత కలిగిన అధ్యాపకులందరికీ సమాన వేతనానివ్వాలి. ఈ సూత్రం చాలా సమస్యల్ని పరిష్కరిస్తుంది.

### నూతన మూల్యాంకనా విధానం

నూతన మూల్యాంకనా విధానం నేడున్న భౌతిక పరిస్థితులలో ఆచరణ సాధ్యంగాదు. పాఠశాలలన్నింటిని రెసిడెన్షియల్ పాఠశాలలుగామార్చి, పాఠశాలల భౌతిక పరిస్థితులను ఉపాధ్యాయుల జీవన పరిస్థితులను అభివృద్ధిచేసినగాని ఈ విధానం జయప్రదంకాదు. ఎలాగూ వెనుకబడిన కులాలకు, షెడ్యూలు కులాలు, కొండజాతుల విద్యార్థులకు ఉచిత భోజనవసతిగృహాలు ఏర్పరచి తగు సౌకర్యాలు కల్పిస్తున్నారు. అవే సౌకర్యాలు విద్యార్థులందరికి కల్పించిన రెసిడెన్షియల్ పాఠశాలలుగా మార్చడం సులభం గదా!

సోదరీ సోదరులారా!

ఆయా సమస్యలన్నింటిపై సుదీర్ఘమైన చర్చలు జరిపి శాస్త్రీయమైన నిర్ణయాలుజేసి, జాతికొక ప్రత్యామ్నాయ విద్యా విధానం రూపొందించి ఖమ్మంలో జరిగే మహాసభలకు చారిత్రాత్మక ప్రాముఖ్యతను కల్గించగలరని మనసారా విశ్వసిస్తూ మీనుండి సెలవు గైకొంటున్నాను.

భవదీయుడు

**కోడూరు నారాయణరావు**

అధ్యక్షుడు.

---

## నీ ఖర్మ అంతే (ది?)!

శ్రీ ఎస్. మనోహర్, కాపుగల్ నల్గొండజిల్లా

'నీ తరపున పది ఓట్లున్నాయా?'

'లేవు!'

'ఏ యమ్. యల్. ఏ. అయినా తెలుసా?'

'నో సార్!'

'ఏ 'సర్పంచి'నైనా కాకా పట్టగలవా?'

'చేతగాదుసార్!'

'ఏమైనా 'బరువు' పెట్టగలవా?'

'నేను చాలా పేదవాణ్ణిసార్!'

'అయితే నీ ఖర్మయింతే... నీకీజన్మలో ఉద్యోగంరాదు!'

# యు.టి.యఫ్.

## ప్రగతిశీల కార్యకలాపాల

# కార్యదర్శి రిపోర్టు




అధ్యక్షా !

కామ్రేడ్స్ !!

1974 ఆగస్టు 10 న ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 30 ఏండ్ల వారసత్వంగా అవిర్భవించింది.

ఆంధ్ర తెలంగాణా విభేదాలు అధిగమించి ప్రాథమిక, సెకండరీ, జూనియర్ కాలేజీ పరిధులు దాటి విశాల ప్రాతిపదికపై సంఘనిర్మాణంకావాలని, నాడే ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కారం కాగలవని అందుకు కృషిచేయాలని తలచి 1974 అక్టోబరు 20, 21 తేదీలలో రాజమండ్రిలో జరిగిన చరిత్రాత్మకమైన మవ ప్రథమ మహాసభలలో నిబంధనావళి రూపొందించుకున్నాం.

1975 జనవరి 11, 12 తేదీలలో ఖాజీపేటలో తెలంగాణా వివిధ జిల్లాల నుండి వచ్చిన 83 మంది ఉపాధ్యాయ నాయకుల సమావేశములో యు.టి.యఫ్.ను తెలంగాణా ప్రాంతానికి కూడా వ్యాపింప చేయాలనే చరిత్రాత్మకమైన నిర్ణయం తీసుకోబడింది.

సదరు నిర్ణయం ప్రకారం 19-1-77 న విజయవాడలో జరిగిన కార్యవర్గ సమావేశంలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలను కలిపి సమైక్య ఉద్యమ నిర్మాణం జరిగింది.

ఉపాధ్యాయులు, ఉద్యమాభిమానులు, చిరకాలంగా ఎదురుచూపిన లక్ష్యం ఈ విధంగా నెరవేరింది. పటిష్టమైన ఉద్యమ నిర్మాణానికి సమస్యల పరిష్కారానికి ఈ విధంగా మార్గం సుగమం చేయబడింది.

ఈ కాలంలో అంతర్జాతీయంగా చాల ముఖ్యమైన ఘటనలు జరిగాయి.

30 సం॥లుగా వీరోచితంగా పోరాడి ఫ్రెంచి, జపాన్, అమెరికన్ సామ్రాజ్యవాదులను చావుదెబ్బకొట్టి, 117 సం॥ల బానిస బంధాలు తెంచుకొని ఉత్తర దక్షిణ వియత్నాంలు 76 ఏప్రిల్ 25 న సమైక్య వియత్నాంగా ఏర్పడ్డాయి.

జనచైనాతోను, పాకిస్తాన్‌తోను భారత దేశానికి దౌత్య సంబంధాలు పునరుద్ధరించబడ్డాయి.

దక్షిణాఫ్రికాతోడు ఇంగ్లాడులో కూడా జాతివిద్వేషం బుసలు కొడుతోంది.

శాస్త్రజ్ఞులు కృత్రిమంగా జీన్‌ని సృష్టించి అమీబాలో దానిని జయప్రదంగా ప్రవేశపెట్టగలిగారు.

అంతరిక్షయానాలు, పరిశోధనలతో అమెరికా, రష్యాలు ఖగోళ రహస్యాలను భేదిస్తున్నాయి.

ఎవరేమిచెప్పినా పెట్టుబడీదారీ దేశాలు తీవ్ర ఆర్థిక సంక్షోభంలో మునగడం, సోషలిస్టు దేశాలు అద్వితీయంగా పురోగమించడం మనం చూస్తున్నాము.

జాతీయంగా 30 సం॥ల కాంగ్రెసుపాలన, దానిలో అంతర్భాగమైన శ్రీమతి ఇందిరాగాంధి చివరి 21 నెలల ఏకపక్ష నియంతృత్వపాలన 6వ లోక్‌సభ ఎన్నికలలో ప్రజాతీర్పుతో తుడిచిపెట్టుకు పోయింది.

ఎమర్జన్సీపేరుతో ప్రజల పత్రికల నోళ్లునొక్కి, లక్షలాది మందిని జైళ్ళపాలుచేసి రాజ్యాంగాన్ని తన కనుకూలంగా మార్చి, ఆకాశవాణిని సొంత బాకాగామార్చి, అమాయకులను చిత్రహింసలకు గురిచేసి, ఎట్టి విచారణలులేకుండా కాల్చిచంపి, కుటుంబ నియంత్రణపేరుతో ప్రజలను భయభ్రాంతులను చేసిన నియంతృత్వశక్తిపై సాధించుకున్న విజయమది.

వేతన స్తంభన, బోనసు తగ్గింపు, నిర్బంధపు రిటైర్‌మెంటులాంటి చండ శాసనాలద్వారా, సాగిన ఏలుబడికి, వంశ పారంపర్య పాలనకు, నియంతృత్వానికి స్థానంలేదని ప్రజలు చెప్పిన చరిత్రాత్మకమైన తీర్పు అది.

ప్రజాతీర్పు ఫలితంగా కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పడింది. అత్యవసర పరిస్థితితొలగింపు, పత్రికాస్వాతంత్ర్య పునరుద్ధరణ, డి ఐ, ఆర్ తొలగింపు, రాజకీయ ఖైదీలవిడుదల, రైల్వే, పోస్టలు ఉద్యోగులను పనులలో నియమించుట. సి. డి. రద్దులాంటి చర్యలు అందరి హర్షామోదాలు పొందాయి.

అయితే జనతా ప్రభుత్వం, మీసా రద్దుచేయకపోవడం, నిర్బంధ రిటైరుమెంటు ఉద్యోగులనందరినీ పనులలోకి తీసుకోక పోవడం నిరాశనే కల్గించింది.

ఇక ఈ కాలంలో రాష్ట్రపరంగాచూస్తే తెలుగు మహాసభలు ఘనంగా జరిగాయి. నిరపరాధులు పెద్దఎత్తున నిర్బంధంగా రిటైరుకాబడ్డారు,పనిగంటలు బడిదినాలు పెంచబడ్డాయి. నేటివిటీ ఉత్తర్వు పేరుతో విచ్చలవిడి బదిలీలు జరిగాయి. తెలుగు జిల్లాస్థాయిలో అధికార భాషగామాత్రం ప్రవేశపెట్టబడింది.

ఈ సంఘటనలన్నీ చెప్పేది ఎందుకంటే. ఎవరుమారినా, ఎవరేమిచెప్పినా, ప్రజాచైతన్యం, సంఘటిత ఉద్యమం, శక్తివంతమైన పోరాటాలుమాత్రమే సమస్యల పరిష్కారానికి మార్గమని.

## ప్రారంభం

ఈ నివేదిక క్లుప్తంగా రెండు భాగాలుగా మీ ముందు వుంచుతాను.

మొదటి భాగం 20-10-74 రాజమండ్రి మహాసభల నుండి 30-9-76 గుంటూరు విద్యా గోష్టివరకు.

రెండవభాగం 1-10-76 నుండిగల యీ సంవత్సరకాలం వరకు.

మొదటి భాగం

30 సం॥రంల ఉద్యమ వారసత్వంగా యు. టి. యఫ్. ఏర్పడిందని మొదట మనవి చేశాను.

1974 అక్టోబరు 20, 21, తేదీలలో రాజమండ్రిలో యు. టి. యఫ్. చరిత్రాత్మక మైన ప్రథమ మహాసభలు జరిగాయి.

వేయిమంది ప్రతినిధులు మహాసభలకు హాజరయ్యారు. జండా వందన కార్యక్రమంతో జయప్రదంగా మహాసభలు ప్రారంభమయ్యాయి. ఆహ్వాన సంఘాధ్యక్షులు డా॥ ఎ. వి. నాగేశ్వరరావుగారి స్వాగత వచనాలు వింజామరలయ్యాయి. శ్రీ సత్యప్రియరాయ్ ప్రారంభోపన్యాసం వెన్నుతట్టగా శ్రీ మోటూరు ఉపన్యాసం కర్తవ్య బోధచేయగా, మాత్యుకురియన్ ఉపన్యాసం చైతన్య పరచింది.

విశాల ప్రాతిపదికపై ఉద్యమనిర్మాణానికి ఉపయోగించు నిబంధనావళి, పాలసీస్టేటుమెంటు, నివేదికలు రూపొందించ బడ్డాయి.

అధిక వర్షాలు మహాసభలకు ఆటంకం కాలేదు. వానా వరదా ఊరేగింపును అడ్డుకోలేదు. ప్రతినిధుల వజ్ర సంకల్పం ముందు ప్రకృతి పలాయనం చిత్తగించింది.

యు.టి.యఫ్. స్థాపించి అప్పటికి కొద్దికాలమే అయినా చెన్నుపాటి నేతృత్వంలో చేవతేరినకార్యకర్తలు అందరూకదిలి, అన్నిటిని అధిగమించి మహాసభలు జయప్రదంగాజరుపుకొని రెండువేలు పైగా మిగుల్చుకొని నూతన చరిత్రనుసృష్టించారు.

వేతన స్థంభన చట్టం-పోరాటం: 1974 జూలై 6న కేంద్రప్రభుత్వం దేశంలోని ఒకకోటి ఎనభయిలక్షల మంది ఉద్యోగుల వేతనాలు స్థంబింపచేస్తూ ఆర్డినెన్సు జారీచేసింది.

దానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటకార్యక్రమంలో మనము భాగస్వాములమయ్యాము. 1974 నవంబరు 3న హైదరాబాద్‌లో 108 సంఘాలకు ప్రాతినిధ్యం వహించే 805 మందితో జరిగిన సదస్సులో ఉపాధ్యాయ సంఘం తరఫునమనం మాత్రమే పాల్గొన్నాం.

జిల్లా, సమితి స్థాయిల వరకు సదస్సులు నిర్వహించాం. వెంటనే జీతంనుండి మినహాయింపు రద్దుఅయినా, కరువుభత్యం మాత్రం మొన్నమొన్నటి (ఏప్రిల్ 77) వరకు కొనసాగింది.

కేంద్రంలో ప్రభుత్వం మారిన ఆ తరువాత సి. డి. రద్దు గురించి, మొత్తంసొమ్ము చెల్లింపు గురించి, టెలిగ్రాములద్వారా కృషిసాగించాం. ఫలితంగా 1977 ఏప్రిల్‌లో సి. డి. రద్దయింది. నిల్వసొమ్ము సాధించుకోవలసివుంది.

చరిత్రాత్మకమైన ఖాజీపేట సదస్సు: 1975 జనవరి 11, 12 తేదీలలో వరంగల్లుజిల్లా ఖాజీపేటలో 83 మంది ఉపాధ్యాయ నాయకులతో సమైక్య ఉద్యమ నిర్మాణానికి కార్యక్రమం గైకొనబడింది. ఫలితంగా తెలంగాణా ప్రాంతానికి యు. టి. యఫ్. ఉద్యమం విస్తరించింది.

ఆంగ్లేయుల, నైజాం పాలనల్లో విడిపోయిన తెలుగు వారు 1956లో భౌగోళికంగా కలిసినా 1969, 72 ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాలద్వారా ప్రజలలో ఉద్యోగ సంఘాలలో అడ్డుగోడలు లేపారు. వీటిని బ్రద్దలుకొట్టి 21 జిల్లాలకు చెందిన ఉపాధ్యాయులందరిని ఇముడ్చుకొని సమైక్య ఉద్యమనిర్మాణం జరగడం, అభ్యుదయ కాముకులకు ఆనందాన్ని కల్గించింది. దానితో ఉపాధ్యాయుల, ఉద్యమాభిమానుల ఆశలు సఫలమయ్యాయి.

అసెంబ్లీకి విజ్ఞాన పత్రం.- ప్రత్యేక రాష్ట్రోద్యమాలు లాంటి అవకాశవాద కార్యక్రమములలోనికి నెట్టబడి కష్టనష్టాలకుగురైన ఉద్యోగులలో నిరాశా నిస్పృహలు వ్యాపించాయి,

దీనిని అవకాశంగా తీసుకొని ప్రభుత్వం సమస్యల పరిష్కారంపట్ల నిర్లక్ష్యత వహించగా యు టి.యఫ్. 13 కోర్కెల విజ్ఞప్తి పత్రాలపై ఉపాధ్యాయులనుండి 10 వేల సంతకాలు సేకరించి అసెంబ్లీకి కౌన్సిలుకు, ముఖ్యమంత్రికి 10-2-75న వాటిని సమర్పించింది.

అన్ని పత్రికలలోను, రేడియోలోను ఆ వార్తలు వచ్చాయి. ఫలితంగా కంటెన్‌జెన్సీల రిలీజు, కరువుభత్యం పెంపుదల, పే కమిటీ రిపోర్టు విడుదల, సెలక్షన్ గ్రేడ్ ఉత్తర్వులు, సమ్మెకాలం సెటాఫ్, అర్థ మిలియన్ ఉపాధ్యాయుల కొనసాగింపు, సాధించుకోగలిగాం.

పే కమిటీ రిపోర్టు-మన సూచనలు :- 1974 ఏప్రిల్‌లో ఏర్పరచబడిన పే రివిజన్ కమీషనరు శ్రీ ఆర్. ప్రసాద్‌గార్కి మనసంఘ పక్షాన శాస్త్రీయ దృక్పథంతో నివేదిక సమర్పించి చర్చించాం.

అందు ప్రధానంగా ఉపాధ్యాయ వృత్తిని సాంకేతిక వృత్తిగా గుర్తించాలని, మినిమం వేతనం రూ 314/-గా నిర్ణయించాలని, పాయింటువారీ వెయిటేజి ఇవ్వాలని, అందరికి సెలక్షన్ గ్రేడు వర్తింపజేయాలని, ఇంటి అద్దె అందరికి ఇవ్వావేవి ముఖ్యమైనవి.

వీటినేమీ తడవకుండా, ప్రసాద్ కమిటీ రిపోర్టు 1975 మే 2 న వెలువడింది. అందలి లోపాలు వివరిస్తూ, తీవ్ర నిరసన తెలియజేస్తూ అందలి లోపాలు సరిచేసి అమలు జరపాలని వివరమైన ప్రకటన విడుదల చేశాము.

పశ్చిమ బెంగాల్ డెలిగేషన్ :- అఖిల బెంగాల్ టీచర్స్ అసోసియేషన్ స్వర్ణోత్సవాలు 1975 ఏప్రిల్ 25 నుండి 28 వరకు కలకత్తాలో జరిగిన సందర్భంగా వారి ఆహ్వానంపై మనసంఘం పక్షాన పదిమందితో కూడిన ప్రతినిధి వర్గం కలకత్తా వెళ్ళుట జరిగింది.

చరిత్రాత్మకమైన కార్డు క్యాంపెయిన్:- అత్యవసర పరిస్థితి విధించబడ్డ తొలి రోజులవి. ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరింపక మూలపడ్డాయి. తీర్మానాలు, రాయబారాలు, ప్రకటనల ఫలితం కన్పించని పరిస్థితులలో ఉపాధ్యాయుల సమస్యలపై కార్డు కాంపెయిన్ నిర్వహించాలని యుటియఫ్ నిర్ణయించింది. అందుకు అన్ని సంఘాలను కలసిరమ్మని పిలుపు యిచ్చింది. కలిసిరావడం కాదు గదా కనీసం సమాధానం కూడా ఎవ్వరూ యివ్వలేదు.

10 సమస్యలతో కార్డులు ప్రింటు చేయించి, 15 వేల మంది ఉపాధ్యాయులచే 1975 సెప్టెంబరు 20 నుండి 30 వరకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగార్కి పోస్టు చేయించటం జరిగింది.

ఫలితంగా, ఉపాధ్యాయులకు డి. ఎ. మెర్జరు స్కేళ్లు జి. ఓ.. వెలువడుట, కరువుభత్యం పెరుగుట, ఫెన్షనర్లకుఅదనపు సహాయం లభించుట, ఏజన్సీ అలవెన్సు జి. ఓ. వెలువడుట జరిగింది.

ముమ్మివరం సమితిలో వీరోచిత పోరాటం . సమితిలో శ్రీ యం.నాగేంద్రరావు అక్రమ బదిలీపై సమితి సంఘం ధర్నాకు పిలుపు ఇచ్చింది. జిల్లాకలెక్టర్ హామీపై 26-11-75న జరుపవలసిన ధర్నా వాయిదా వేసింది. అయినా కక్షబూనిన

కొందరు అత్యవసరపరిస్థితి ఆధారంచేసికొని అదేరోజు జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ వి. సూర్యనారాయణరాజుగారిని అరెస్టు చేయించారు. నాలుగు నెలల తరువాత శ్రీ రాజు నిర్దోషిగా తీర్పు రాగా విడుదల చేయబడ్డారు. కక్షకట్టిన మేనేజిమెంటు సంఘ అధ్యక్షులగు శ్రీ గంగిశెట్టిగారిని నిర్బంధ రిటైరుమెంటుకు గురిచేశారు. అంతటితో ఆగని మేనేజిమెంటు తప్పుడు రిపోర్టులు పంపి శ్రీ యం. నాగేంద్రరావుగారిని విశాఖపట్టణం సరెండరు చేయించారు.

ఈ విషయంలో జరిగిన అక్రమాలు సరిచేయించేదానికి నిర్విరామ కృషిచేస్తున్నాము. వాటి ఫలితాలు త్వరలో తెలియగలవు.

డి. ఎ. మెర్జరు స్కేల్సు-ఆప్షన్ వివరాలు:- డి.ఎ. మెర్జరు స్కేలు ఉత్తర్వు వచ్చినవెంటనే వానిలోని లోపాలు సరిచేయాలని, ప్రకటన యిచ్చాం. వాటి అమలుకు వివరాలు స్టేటుమెంటు ప్రకటించాం. అలాగే 1975వరకే యిచ్చిన ఆప్షన్ అవకాశం 1976, 1977 వరకు యిచ్చిన చాలామంది ఉపాధ్యాయులు లాభం పొందగలరని వివరిస్తూ అందుకు క్లారిఫికేషన్ యివ్వవలసిందిగా ప్రభుత్వానికి వ్రాశాం. అయితే ప్రభుత్వం 16-12-75 మెమొ ద్వారా అందుకు నిరాకరించింది.

పే కమిటి అనామలీస్-సవరణకై కృషి:- పేకమిటీ రిపోర్టునందలి తీవ్రలోపములు ఉపాధ్యాయులకు జరిగిన నష్టములు; లోగడ ఇతర ఉద్యోగులలో కంటే అదనముగా ఒక స్టేజిలో ఉన్న ఉపాధ్యాయుల వేతనాలు తగ్గించిన వివరాలు, ఇంక్రిమెంట్లు వ్యత్యాసాలు వేతన నిర్ణయంతో సాటి ఉద్యోగుల కంటే ఉపాధ్యాయులకు జరిగిన అన్యాయాలు మొ॥ పూర్తిరిపోర్టు ప్రభుత్వానికి 24-6-76న సమర్పించాం, అయినా యీ నాటికీ అవి పరిష్కరింపబడక పోవడం దారుణమైన విషయం.

అలాగే పే కమిటీలో రిపోర్టునందలి హామీలు, అదనపు యింక్రిమెంట్లు స్పెషల్ పే డ్యూటీ అలవెన్సులు ఇదిగో అదిగో అనటం తప్ప వెలుగు ముఖం ఈ నాటికి చూడలేదు.

నేటివిటీ – నిర్బంధ రిటైరు మెంటులపై కార్యక్రమం:- ఉపాధ్యాయులు స్వగ్రామంలోను, స్వంతతాలూకాలోను పని చేయరాదనే నేటివిటీ సూత్రం ప్రభుత్వం విధించినపుడు, దాన్ని తీవ్రంగా ఖండించింది, నిరసన తెల్పింది మన సంఘ మాత్రమే. 40 శాతం బదిలీలు అంటే, 65 వేల మంది ఉపాధ్యాయులను వారి కుటుంబాలతో $2\frac{1}{2}$ లక్షల మందిని కోట్లాది రూపాయలు టి. టి. ఎ. లుగా ఖర్చుచేసి విద్యా రంగంలో గందర గోళ పరిస్థితులు సృష్టిస్తాయని తీవ్రంగా ఖండిస్తూ ప్రకటనలిచ్చింది మన సంఘం మాత్రమే.

అలాగే ఉపాధ్యాయులనుకూడా నిర్బంధంగా రిటయిరు చేయాలన్న ప్రభుత్వఉత్తర్వు అన్యాయమని, యిందువల్ల నిరపరాధులు బలైపోతారని, కాబట్టి వెంటనే ఆఉత్తర్వు రద్దుచేయించుటకు కలసి రావలసిందిగా అన్ని సంఘాలను 1975 డిశంబరు 1నుండి 4వరకు హైద్రాబాద్‌లో కలసి సంప్రదింపులు జరిపాం. అలాగే నాల్గు నెలలు దఫ దఫాలుగా ఐక్య కార్యాచరణకై కృషి చేశాం.

చివరకు మనం ఒంటరిగానే కార్యక్రమం చేపట్టవలసి వచ్చింది. నేటివిటి ఉత్తర్వు రద్దు నిర్బంధ రిటయిరుమెంటు రద్దు మొదలగు పది ప్రధాన కోర్కెలతో ముఖ్యమంత్రికి విజ్ఞప్తి పత్రములు ప్రింటుచేయించి, సంతకములుచేసి ముఖ్యమంత్రికి పంపించవలసిందిగా ఉపాధ్యాయులకు పంపించాము.

పిలుపు వంటరిగాయిచ్చినా ఉపాధ్యాయులు అపూర్వంగా అందుకున్నారు. 1976 ఏప్రిల్ నెలాఖరులోగా 20 వేల సంతకాలతో ముఖ్యమంత్రికి పంపించారు.

డైరెక్టరుతో కోఆర్డినేషన్ :- పాఠశాల విద్యాడైరెక్టరు గారితో ఉపాధ్యాయుల వివిధ సమస్యలు మొత్తం 45 + 25 = 70 సమస్యలపై కోఆర్డినేషన్ సమావేశం జరిపింది ఒక మన సంఘమే అను విషయం మీకు విన్నవిస్తున్నాను.

రిట్రెంచిమెంటు నివారణ, గ్రాంటు రిలీజు ఏజన్సీ అలవెన్సు, కొన్ని పరిష్కరింపబడినా మిగతా సమస్యలు ఇంకా పరిష్కరించబడాలి.

విద్యా బిల్లు - జాయింటు సెలక్టు కమిటీ :- ఉపాధ్యాయ సంఘాల ఆందోళన ఫలితంగా ప్రభుత్వం విద్యాబిల్లును శాసనసభలో ప్రవేశపెట్టింది. ఆశించినదానికి అనుగుణంగాలేని కారణంగా దానిపై మన సంఘపక్షాన ప్రకటన యివ్వడం జరిగింది !

జాయింటు సెలక్టుకమిటీ రాష్ట్ర పర్యటన సందర్భంగా 5-6-76న విజయవాడలో బిల్లులో చేయవలసిన మార్పులు 20 అంశాలు సూచిస్తూ నివేదిక ఇచ్చాము.

సెలక్టు కమిటీనుండి ఉభయ శాసనసభలకు సమర్పించబడిన నివేదిక మన ఆశలకు అనుగుణంగాలేదు.

ఉద్యమక్లాసులు : శక్తివంతమైన కార్యకర్తలే సమరశీల పోరాట సంస్థను నిర్మించగలరు. కార్యకర్తల చైతన్యానికి ఉద్యమ క్లాసులు చాల అవసరం. ఆ దృష్టితోనే 1976 మే నెల 8 నుండి 18 వరకు రేవేంద్రపాడు, బుచ్చిరెడ్డిపాలెం, భీమవరం, పొనుగోడులలో 323 మందితో ఉద్యమతరగతులు జయప్రదంగా జరిగాయి. 7 అంశాలు బోధింపబడ్డాయి.

తూర్పు రాయలసీమ ఎన్నికలు : తూర్పు రాయలసీమ ఉపాధ్యాయ యం. యల్. సి. ఎన్నికలలో మన సంఘపక్షాన ఒక అభ్యర్థిని బలపరచాలని నిర్ణయించాం. అందుకు శ్రీ యం. మాధవరావు ( కావలి, జవహరుభారతి ) గారిని నిర్ణయించడం జరిగింది.

రంగంలో 5 గురు అభ్యర్థులున్నారు. మనంఅందరి కంటే ఆలస్యంగా రంగంలోనికి వచ్చాము. నెల్లూరులో నిర్మాణం వున్నా, చిత్తూరులో నిర్మాణంలేదు. రాష్ట్ర వ్యాపితంగా అన్ని ప్రాంతాల నుండి కార్యకర్తలు రంగంలోనికి వచ్చి శక్తివంతంగా ప్రచారం సాగించి కృషిచేశారు.

శ్రీ మాధవరావుగారి మిత్రబృంద సహకారం, మన కార్యకర్తల చొరవ, యు టి.యఫ్. సాగించిన కృషి ఫలితంగా ఆవకాశవాదులను ఓడించి శ్రీ మాధవరావు ఘనవిజయాన్ని సాధించారు.

అది ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్‌యొక్క ఉద్యమాల యొక్క ఘనవిజయంగా చరిత్రలో నిలిచిపోగలదు.

రాయబారాలు - కరస్పాండెన్సు : ఉపాధ్యాయుల అపరిష్కృత సమస్యలపై ప్రతినెల హైదరాబాదు వెళ్ళి, వివిధ

ప్రభుత్వ అధికారులతో మంత్రులతో సమస్యలపై చర్చించి పరిష్కారానికి కృషిచేయుచున్నాము. మన కృషి ఫలితంగా కొన్ని సమస్యలు పరిష్కరింపబడుట, కొన్ని వివరాలతో ఉత్తర్వులు వచ్చుట కొన్ని జి.వో.లు వెలువడుట జరిగింది. అయినా పరిష్కారం కావలసినవి అనేక సమస్యలు వున్నవి.

ట్రయిబల్ వెల్‌ఫేరు ఉపాధ్యాయుల గ్రాంటు రిలీజు గురించి, ఎయిడెడ్, సోషల్ వెల్‌ఫేరు ఉపాధ్యాయులగ్రాంటుల గురించి, మునిసిపల్ ఉపాధ్యాయుల గ్రాంట్సురిలీజు, పూర్తి గ్రాంటురిలీజు గురించి నిర్విరామ కృషి చేశాం.

అలాగే యీ కాలంలో ప్రతినెల సర్క్యులర్లు పెడుతూ, ముఖ్యసమస్యలపై పత్రికా ప్రకటనలుయిస్తూ, ఉద్యమంగురించి, సంఘకృషి గురించి, సభ్యులను చైతన్యపరచేదానికి కరపత్రములు యిస్తూ ఇలా నిర్మాణ సంబంధమైన అనేక కార్యకలాపాలు సాగించాం.

అలాగే ప్రతినెల రాష్ట్రసమావేశాలు జరిపి, నిర్ణయాలు తీసుకొని వాటి అమలుకై తగుచర్యలు గైకొన్నాం. రెగ్యులర్ ఫంక్షనింగు, కరస్పాండెన్సు, రాయబారాలు, యీ కాలంలో ఉద్యమాన్ని మరింత ముందుకు నడిపాయి. కార్యకర్తలు మరింత నిగ్గుతేలాతు సమస్యలు అనేకం పరిష్కరింపబడ్డాయి.

## రెండవ భాగం

1976 సెప్టెంబరు 29, 30 తేదీలలో చరిత్రాత్మకమైన గుంటూరు సదస్సు జరిగింది. వేయి మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు విద్యావిషయములు చర్చించబడినాయి.పనిగంటుల బడిదినాల తగ్గింపుపై ఐక్యకార్యాచరణకు పిలుపు ఇవ్వబడింది.

జె.సి.టి.ఎ. ఏర్పాటు :- ప్రభుత్వం పనిగంటలు బడి దినాలు పెంచింది. అదనపు భారాన్ని ఉపాధ్యాయులపై మోపింది. దాన్ని మౌనంగా అందరూ భరించారు. దేశంలో ఏ పరిస్థితులువున్నా,విద్యావిధానానికే గొడ్డలిపెట్టయినయీచర్యపై యు.టి.యఫ్. తన తీవ్రనిరసన తెలుపుతూ ప్రకటన యిచ్చింది కొన్ని పత్రికలలో అది వచ్చింది.

ఉపాధ్యాయులలో ఎంతో ఊరటకల్గింది. ఈ పరిస్థితులలో కూడా తమ పక్షాన నిలిచి పనిచేసేవారున్నారని సేద తేరారు.

అంతటితో ఆగక గుంటూరు విద్యా గోష్టి ద్వారా పనిగంటల, బడిదినాలపై ఉద్యమాన్ని ఉర్మించాలని తలచాం. అందుకు అనుగుణంగా జె.సి.టి.ఎ. 31-10-76 న ఏర్పడింది. శ్రీ యం. జె మాణిక్యరావుగారు కన్వీనరుగా ఎన్నికయిరి.

అప్పటికి 5 సంఘాలు మాత్రమే అందులో సభ్యులు. మిగిలిన సంఘాలు 14-12-76 నాడు హైద్రాబాదులో జె.సి.టి.ఎ.లో చేరాయి. 15-12-76 నాడు 11 సంఘాలతో 30 మంది ప్రతినిధులతో 8 మంది టీచర్స్ యం.యల్.సి. లతో విద్యాశాఖమంత్రితో సంప్రతింపులు జరిగాయి. చర్చల అనంతరం ప్రభుత్వం 7 తరగతి వరకు, పెంచిన బడిగంటల పనిదినాలను సడలించుటకు అంగీకరించింది.

కార్డు, టెలిగ్రాముల కార్యక్రమం : 10 వ తరగతి వరకు పెంచిన పనిగంటల బడిదినాలు తగ్గించుటకు కార్యక్రమం చేపట్టబడింది. రాష్ట్ర వ్యాప్తంగా విద్యా సదస్సులు జరపాలని, కార్డులు, టెలిగ్రాములు పంపాలని నిర్ణయించుట జరిగింది.

వరంగల్లులో,నర్సంపేటలో,తాడికొండలో,విజయవాడలో విద్యాగోష్టులు జరిగాయి.

1977 ఫిబ్రవరి 1 నుండి 14 వరకు నిరసన వారం జరిపి, టెలిగ్రాములు కార్డులు పంపుట జరిగింది. 12 వేల టెలిగ్రాములు, 80 వేల కార్డులు ముఖ్యమంత్రికి పంపబడ్డాయి.

ఫలితంగా ప్రభుత్వందిగివచ్చింది. మార్చి 31 చర్చలలో 10 వ తరగతి వరకు పెంచిన పనిగంటలు బడిదినాలను ఉపసంహరించుకొంటూ ఉత్తర్వులు ఇచ్చారు.

అలాగే ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి ఎయిడెడ్ స్కూలు వరకు మాత్రం 1:25 గా అంగీకరించారు.

జె.సి.టి.ఎ. పనిగంటల బడిదినాల మేరకు మాత్రమే పరిమితం చేయవలసివచ్చుటచే 12-5-77న అతిస్వల్పకాలంలో అనన్య సామాన్యమైన విజయంసాధించి రద్దయింది.

ఫేప్టో (FAPTO) ఏర్పాటు : 1960లో ప్రారంభించబడి1972 నిబంధనావళి వ్రాయబడి 1977 జనవరి 26 న ఫెడరేషన్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఆర్గనైజేషన్స్, ఏర్పడింది. తొలుత కొన్ని సంఘాలుతో మాత్రమే అది ఏర్పడింది. యు. టి. యఫ్. కు మొదటస్థానం కల్పించబడలేదు, దానిపై మనం ఫేప్టో కన్వీనరుకు లెటరు పెట్టుట, పత్రికలో సంపాదకీయం వ్రాయుట జరిగింది. ఫలితంగా 27-3-77 ఫేప్టో సమావేశానికి మనలను పరిశీలకులుగా పిలిచారు. నాడే ఫేప్టో ఎన్నికలుజరపాలని నిర్వాహకులు అనుకున్నా చాలామంది అది సరికాదు అందరినీ ఫేప్టో చేర్చుకున్న తరువాతనే ఎన్నికలని పట్టుపట్టుటచే వాయిదా పడ్డాయి.

11-5-77న హైద్రాబాద్‌లో ఫేప్టో సమావేశం జరిగింది, మొత్తం పది సంఘాలు సభ్యులుగా చేరాయి. 1) రాష్ట్ర ఉపాధ్యాయ సంఘం. 2) ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 3) ఉపాధ్యాయ ఫెడరేషన్ 4) రిజిష్టర్ ఫెడరేషన్ 5) టీచర్స్ యూనియన్ 6) పంచాయితీరాజ్ ఉపాధ్యాయ సంఘం 7) జాతీయ ఉపాధ్యాయ పరిషత్. 8) మున్సిపల్ టీచర్స్ యూనియన్, 9) ఎయిడెడ్ ప్రైవేటు టీచర్స్ సంఘం 10) జూనియర్ లెక్చరర్స్ అసోసియేషన్ ఈ సంఘాలుగాక 8 మంది ఉపాధ్యాయ యం.యల్.సి.లు సభ్యులుగా వున్నారు.

నాటిఫెడరల్ కౌన్సిల్ సమావేశానికి మనసంఘపక్షాన 5 గురు హాజరయ్యారు. నాడుకూడా ఎన్నికలు జరపాలన్నది చర్చనీయాంశమైనది. చివరకు ఈ క్రింది నిర్ణయాలతో సమావేశం ముగిసినది.

(1) ఇంకను చేరవలసియున్న అన్ని సంఘాలను చేర్చుకొనుట,

(2) నిబంధనావళిని సవరించుట.

(3) అంతవరకు ఎన్నికలు వాయిదా వేయుట,

ఈ అన్ని విషయాలను సరిచేసుకుని ఫేప్టోను పటిష్టవంతం చేసుకోవాలి. సమైక్య ఉద్యమంగా రూపొందించుకోవాలి.

చారిత్రాత్మకమైన ఏప్రిలు ఉద్యమం :- ఉద్యమ చరిత్రలో అపూర్వమైన అత్యవసర పోరాట కార్యక్రమం 77 ఏప్రిలు 4నుండి 7వరకు జరిగింది.

ఉపాధ్యాయ సంఘాలు, ఉపాధ్యాయ యం.యల్.సి.లు సమైక్యంగా జరిపిన పోరాట కార్యక్రమమది.

21 సమస్యలతో ముఖ్యమంత్రిగార్కి నోటీసు ఇవ్వబడింది. దానికి ఎట్టి జవాబులేని కారణంగా, 3-4-77 న అన్ని సంఘాలు సమావేశమయి పోరాట కార్యక్రమాన్ని, యాక్షన్ కమిటీని 7 మందితో నియమించుట జరిగింది.

4-4-77 న సెక్రటేరియట్ ముందు రిలే నిరాహారదీక్ష ప్రారంభమైనది. 50 మంది వరకు దీక్షతో కూర్చున్నారు.

ముగ్గురు ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించారు.

ముఖ్యమంత్రి నుండి వచ్చిన ఆహ్వానాన్ని పురస్కరించుకొని, ఏక్షన్ కమిటీ సంప్రతింపులకు వెళ్ళింది. వెంటనే పరిష్కరిస్తానన్న ముఖ్యమంత్రి 6 వ తేదీ వరకు పలుకలేదు.

5-4-77 న డైరెక్టరేట్ ముందు నిరాహారదీక్ష సాగింది. తిరిగి 6-4-77న సెక్రటేరియట్ ముందు నిరాహారదీక్షసాగింది.

6 వ తేదీ శాసన మండలిలో విద్యామంత్రి 21 అంశాలనై, సమస్యలు దాటవేస్తూ చూస్తాం, చేస్తాం అంటూ, ఉపయోగంలేని ప్రకటన చేశారు. దానిపై శాసన మండలిలో ఉపాధ్యాయ శాసన మండలి సభ్యులు ధర్నా ప్రారంభించారు. ప్రభుత్వం దిగివచ్చి తన ప్రకటన ఉపసంహరించుకొంది. 7 వ తేదీ ఉపాధ్యాయ సంఘాలతో శాసన మండలి సభ్యులతో చర్చలకు అంగీకరించింది.

7వ తేదీ చర్చలలో 21 అంశాలపై ఒప్పందం కుదిరింది. అందు ముఖ్యంగా ఇన్ సర్వీసు ఉపాధ్యాయులను అప్ గ్రేడు చేయుట, 1969 నుండి లిబరలైజ్డు పెన్షన్ మొ. ముఖ్య అంశాలున్నాయి.కాని ప్రభుత్వం ఒప్పందానికివిరుద్ధంగా, ఉత్తర్వులను విడుదల చేసింది. వాటిపై తిరిగి పోరాట కార్యక్రమం చేపట్టాలి.

రాయబారాలు : ఉపాధ్యాయుల వివిధ సమస్యలపై ప్రతినెల ప్రభుత్వ అధికారులతో రాయబారాలు జరుపుతున్నాం.

8-10-76 : విద్యాశాఖ డైరెక్టరు, ప్రధాన కార్యదర్శి, పంచాయతీరాజ్ కార్యదర్శి, ట్రైబల్ వెల్ఫేరు డైరెక్టరు, మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ డైరక్టరుగార్లను కలిసి వివిధ సమస్యలపై రాయబారాలు సాగించాము.

వీజన్సీ ఉపాధ్యాయులు, స్టయిపెండరీవారి గ్రాంటు రిలీజు అయింది. వరంగలు హిందీ కళాశాలనుండి తొలగించిన వారిని తిరిగి చేర్చుకొనుట జరిగింది.

17-11-76 : వివిధ అధికారులను కలిసి సంప్రతింపులు జరుపుట జరిగింది.

శ్రీమతి థెరిసా 93 రోజులు అన్‌డ్యూటీగా పరిగణించుట, తెలంగాణా ఏరియా జిల్లా స్థాయిలో ప్రయివేటు అభ్యర్థులకు డిగ్రీ పరీక్ష కేంద్రములు తెరుచుట జరిగింది.

16-12-77 : రాజధానిలో వివిధప్రభుత్వ అధికారులను కలిసి రాయబారాలు జరుపుటజరిగింది.ఫలితంగాహిందీపండితుల కంటిన్యూఉత్తర్వులు, బి.పి.ఎం.ల బదిలీలు నిలుపుదలఉత్తర్వు, సెకండరీ వారి సెలక్షన్ గ్రేడు మార్గమం చేరనక్కరలేదనే ఉత్తర్వులు వెలువడ్డాయి.

12-1-77 బదిలీల రద్దుగురించి కృషిచేయుట జరిగింది. కర్నూలు, తూ.గో.జిల్లా, కష్ణాజిల్లాలోని అక్రమ బదిలీలు రద్దు చేయించుట జరిగింది.

23-3-77:- రాజధానిలోని వివిధ ప్రభుత్వ అధికారులను కలసి రాయబారములు జరుపుట జరిగింది. కృష్ణాజిల్లా అక్రమ బదిలీలు ఎంక్వయిరీ పెట్టించుట, అన్‌క్వాలిఫైడ్‌వారి కంటిన్యూ ఉత్తర్వులు, భీమవరం మున్సిపల్ కండక్టర్ల కంటిన్యూ ఉత్తర్వులు, వెలువడాయి.

13-5-77 :- వివిధ ప్రభుత్వ అధికారులతో కలసి రాయబారములు జరుపబడ్డాయి ట్రయిబలు వేల్ఫేరుగ్రాంటు, ఎయిడెడ్ వారి గ్రాంటు, విడుదలయింది. సోషల్ వెల్ఫేరు ఉపాధ్యాయుల స్టేటస్ గురించి, మునిసిపల్ పుపాధ్యాయుల కుటుంబ నియంత్రణ ఇంక్రిమెంట్లు గురించి, అన్‌ట్రయిండువారి ఇంక్రిమెంట్లుగురించి,డ్యూటీఅలవెన్సుకుఎ డి.ఎ కలుపుటగురించిహిందీ పండితులు కంటెన్యూ ఉత్తర్వులు వెలువడ్డాయి.

22-7-77 తేదీన రాజదానిలో విద్యాశాఖ కార్యదర్శి, డైరెక్టరు, పంచాయితీరాజ్ మంత్రి, కార్యదర్శి, మునిసిపల్ అడ్మినిస్ట్రేషను కార్యదర్శి, ఇంటర్ మీడియట్ బోర్డు కార్యదర్శి, యల్. యఫ్. ఎగ్జామినరు మొదలగు వారిని కలిసి రాయబారాలు జరుపుట జరిగింది.

నేటివిటీ ఉత్తర్వు రద్దు, జూనియరు కాలేజీ స్టాపు విలీసీకరణ ఉత్తర్వులు వెలువడ్డాయి. సెంట్రల్ స్కూలు వారిని రాష్ట్రీ కళాశాలలో చేర్చుకొనుటకు ఉత్తర్వులు వెలువడ్డాయి. మొగల్తూరు సి.డి. ఉత్తర్వు, తెండవ వాయిదాకు ఉత్తర్వులు ఇవ్వబడ్డాయి.

అలాగే జిల్లా స్థాయిలలో అపరిష్కృత సమస్యల పరిష్కారానికి ఆ యా శాఖలు అనేక చర్యలు గైకొన్నాయి. తూర్పు గోదావరి జిల్లా పిఠాపురంలో అక్రమ బదిలీ రద్దు గురించి ఆమరణ నిరాహారదీక్ష సాగించబడింది. గిద్దలూరు, తిరుమలాయపాలెం, మొవ్వ, ఉలవపాడు, రాజోలు మొదలగు సమితులలో ధర్నా నోటీసులు ఇచ్చి చాలవరకు సమస్యలు పరిష్కరింప జేసుకున్నారు. నెల్లూరు, గుంటూరు, తూ. గో. జిల్లాల్లో జిల్లాశాఖలు ప్రత్యక్షచర్య నోటీసుయిచ్చి సమస్యల పరిష్కారానికి కృషిచేశారు.

అపరిష్కృతంగావున్న సమస్యలు పరిష్కరించబడక నిత్యం పెరుకుపోతూ హిమాలయాలతో పోటీపడుచున్నాయి. పాలకులుగాని పరిపాలనా యంత్రాంగంగానీ ఏమీపలకరు, సమస్యలు పరిష్కృతంగాక ఎంతోమంది హృదయాలు మధనపడుతున్నా, జీవితాలేపోతున్నా, వారికి చీమకుట్టినట్లులేదు,

హైద్రాబాదులో బ్రాంచి ఆఫీసు తెరచి నిత్యం అనేక సమస్యల గురించి కృషిచేస్తూ శ్రీ యమ్. నరహరిగారు ఆ బాధ్యతలు చూస్తున్నారు. వందలాది ఉత్తరాలకి జవాబులు వ్రాస్తున్నారు.

ఏదిఏమైనా సమస్యల పరిష్కారానికి శక్తివంతమైన కార్యక్రమం చేపట్టవలసివుంది,

**శాసనమండలి-మనకృషి :** శాసన మండలిలో మనం బలపరిచిన అభ్యర్థులు శ్రీ యమ్. మాధవరావు, శ్రీ యం. జె. మాణిక్యారావుగారలు ఆయా సమసలపై నిర్విరామమైన కృషి జేస్తున్నారు. శాసన మండలిలో ప్రశ్నలు, వాయిదా తీర్మాన

ములద్వారా సమస్యలు లేవనెత్తుతున్నారు. మన రాయబారాలలలో సహకరించుచున్నారు. మన సమావేశములలో పాల్గొనుచున్నారు.

శ్రీ యం. మాధవరావుగారు చిత్తూరు జిల్లాలో మనశాఖ నిర్మాణానికి ఎనలేని కృషిచేశారు. బలమైన శాఖగా అది రూపొందింది. వారికి ధన్యవాదములు.

అనేక సమస్యల పరిష్కారం విషయంలో సహకరిస్తున్న శాసనమండలి సభ్యులు శ్రీయుతులు యం. జె. మాణిక్యారావు, డి. శివరామరాజుగారలకు ధన్యవాదములు.

**ఉద్యమ క్లాసులు:-** గతసం॥రం జరిగినట్లు ఈ సం॥రం కూడా ఉద్యమ క్లాసులు జరపాలనుకున్నాము. అయితే రాష్ట్ర మహాసభలు జరుపనున్న దృష్ట్యా ఒకచోటతప్ప మిగిలినవన్నీ వాయిదా వేయటం జరిగింది.

మహబూబ్‌నగర్‌జిల్లా మార్చాలలో మే 25 నుండి 27 వరకు 100 మందితో క్లాసు జయప్రదంగా జరిగింది.

**మహా విజ్ఞాపన ప్రతములు:-** నేటివిటీ ఉత్తర్వు రద్దు మొదలగు ప్రధానమైన 16సమస్యలుగల మహావిజ్ఞప్తి పత్రముల పైన రాష్ట్రవ్యాప్తంగా 12 వేల సంతకాలు సేకరించి 1977 జూలై 21 ఉభయ శాసనసభలకు సమర్పించటం జరిగింది.

నేటివిటీ సూత్రం రద్దుకు, మిగతా సమస్యల పరిష్కారానికి హామీలు యిచ్చారు.

**నిర్బంధ రిటయిరు మెంటుపై కృషి:-** అక్రమంగా నిర్బంధ రిటయిరు మెంటుకు గురి అయిన శ్రీ కె. గంగిశెట్టి మొదలగువారిని తిరిగి వెంటనే సర్వీసులోకి తీసుకోవాలని ప్రకటన చేయుట, ప్రభుత్వమును కలిసి కృషి చేయుట జరిగింది. సమస్య యింకా ప్రభుత్వ పరిశీలనలో వుంది.

**ప్రపంచ ఉపాధ్యాయ వుద్యమ సంబంధాలు:** ప్రపంచ ఉపాధ్యాయ ఫెడరేషన్‌లో మనం చేరుటకు అపయి చేశాం. దాని 30వ వార్షిక సమావేశానికి (77 జూన్ 27 నుండి జూలై 1) రమ్మని ఆహ్వానము వచ్చినా, ఆహ్వానము ఆలస్యముగా అందటం, మహాసభల కారణంగా వెళ్ళలేక పోయాం. చెన్నుపాటి పదవ వర్ధంతి సభలు రాష్ట్ర వ్యాపితంగా డిశంబరు 9 నుండి 15 వరకు జరిపి, ఆ మహనీయునికి శ్రద్ధాంజలి ఘటించాం.

**సంఘనిర్మాణం:-** ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ తమపాలిటి ఆశాజ్యోతిగా వుపాధ్యాయులు భావించారు. ఎన్ని కష్టనష్టాలు ఎదురయినా, వారి సమస్యల పట్ల నిలిచి పని చేసే పోరాట సంస్థగా గుర్తించారు. అత్యవసర పరిస్థితి కాలంలో కొందరు అన్నిటికి తిలోదకాలువదిలి 'చిత్తం నీ బానిసని దొర' అన్న వారున్న పరిస్థితులలో పోరాట కార్యక్రమాలుచేపట్టింది యు. టి. యఫ్. ఒక్కటే అని వారు గుర్తించారు.

అవినీతికి వ్యతిరేకంగా మనం చేస్తున్న కృషి కొందరికి బాధాకరమై మనపై ధ్వజమెత్తారు. అయినా భయపడేది లేదు. అటువంటి చర్యలు మన దీక్షను మరింత బలపరచితీరుతాయి. నిప్పును తాకడం ప్రమాదమని తరువాతయినా వారు తెలుసుకుంటారు.

మనం 1974లో 7వేల సభ్యత్వంతో మొదలుపెట్టి, 1976 గుంటూరు విద్యాగోష్టినాటికి 14 వేలకు చేరాము. 1977 ఖమ్మం మహాసభలనాటికి 20వేలకు పురోగమించాం.

ప్రస్తుతం 17జిల్లాలలో మనశాఖలు పనిచేస్తున్నాయి. మిగిలిన జిల్లాలతోకూడా సంబంధాలు వున్నాయి. వాటినిర్మాణం కూడా పూర్తిచేయాలి.

**సంఘ పంక్షనింగు:** సమావేశాలు రెగ్యులరుగా జరుగుతున్నాయి. నిర్ణయాలు తీసుకొని పనిచేస్తున్నాము.

| | | | | |
|---|---|---|---|---|
| 1976 | సెప్టెంబరు | 29, 30 | నూతన కౌన్సిలు | గుంటూరు |
| 76 | అక్టోబరు | 1 | కార్యవర్గం | గుంటూరు |
| 76 | నవంబరు | 7 | కార్యవర్గం | విజయవాడ |
| 76 | డిశంబరు | 9 | సబ్ కమిటీ | విజయవాడ |
| 77 | జనవరి | 11 | కార్యవర్గం | విజయవాడ |
| 77 | ఫిబ్రవరి | 12 | సబ్ కమిటీ | విజయవాడ |
| 77 | మార్చి | 5,6 | కౌన్సిలు | విజయవాడ |
| 77 | ఏప్రిల్ | 9 | సబ్ కమిటీ | విజయవాడ |
| 77 | మే | 10 | కార్యవర్గం | విజయవాడ |
| 77 | జూన్ | 19 | సబ్ కమిటీ | ఖమ్మం |
| 77 | జూలై | 17 | కార్యవర్గం | విజయవాడ |

**సర్క్యులర్లు:-** సంఘ నిర్ణయాలు, పోరాట కార్యక్రమాలు, కార్యకర్తలకు సూచనలు, ప్రభుత్వ ఉత్తర్వులు, రాయబార వివరాలు, ప్రతి నెలా తెలియజేయడం జరుగుతున్నది.

**కరపత్రములు:-** ఈ నివేదికా కాలంలో ప్రజలకు, తలిదండ్రులకు తదితరులకు విజ్ఞప్తి పేరుతో విద్యా విధానంలో ప్రభుత్వ అవకతవకలు బయటపెడుతూ 12 పేజీల కరపత్రము వేసి పదిపైసలకు అమ్మాం. అందరూ అభినందించారు.

ఈ నివేదిక కాలంలో వేసిన కరపత్రాలు.

1. 7-10-76 చిత్తూరుజిల్లా పర్యటన
2. 2-10-76 తలిదండ్రులకు విజ్ఞప్తి
3. 15-10-76 కౌన్సిల్ తీర్మానాలు
4. 1-12-76 చెన్నుపాటి వర్ధంతి సభలు
5. 18-1-77 విజయవాడ విద్యాగోష్టి
6. 20-1-77 కృష్ణాజిల్లా అక్రమ బదిలీలు
7. 1-2-77 జె సి.టి ఎ. కార్డులు
8. 1-3-77 మహావిజ్ఞాన పత్రములు
9. 1-4-77 ఫెప్టో కన్వీనరుకు లేఖ
10. 15-5-77 ఆహ్వానసంఘ కరపత్రం
11. 7-7-77 యు. టి. యఫ్. విజ్ఞప్తి

**ప్రకటనలు:** ఉపాధ్యాయులు సమస్యలపైననూ, విద్యా విధానంపై ప్రభుత్వ పాలసీపైననూ, ప్రభుత్వ ఉత్తర్వుల, అవకతవకపైననూ, సోదర పోరాట సంఘాల కార్యక్రమాలపైననూ పత్రికా ప్రకటనలు చేశాము. సంఘ తీర్మానాలు, సమావేశ వార్తలుకూడా పంపుచున్నాము. ప్రజాశక్తి, ఈనాడు, జ్యోతి, ప్రభ, పత్రిక మొ॥ వాటిలో ప్రచురింపబడుచున్నాయి.

ఉద్యమం మరింత విస్తృతంగా వ్యాపింపవలసివుంది. యు. టి. యఫ్. అంటే ఉపాధ్యాయులకు ఆదరణవుంది. దానిని అన్ని రకాలుగా మనం ఉపయోగించుకోవాలి.

నేడుసంఘానికి యిద్దరు,పత్రికకు ముగ్గురు హోల్‌టయిమర్లువున్నారు. ఆఫీసు నిర్వహణకు ఒకరిద్దరు గుమస్తాలుకూడా అవసరం. అప్పుడుకాని, కార్యకలాపాలు చక్కగా సాగవు.

దాతల విరాళాలవల్ల, అభిమానుల ఆదరణవల్ల, కార్యాలయానికి కొంతవరకు హంగులు అమిరాయి. టైపుమిషను, సైక్లోస్టయిల్ మిషనులుకూడా వున్నాయి. అయితే దాతలు తమ వాగ్దానాలు చెల్లిస్తే తప్పక కార్యాలయాన్ని మరింత తీర్చిదిద్దగలం. ఆర్థిక యిబ్బందులు వెన్నాడుతూనేవున్నాయి. సంఘ కార్యకలాపాలు అప్పులతో సాగించవలసి వస్తున్నది ఉపాధ్యాయులు త్యాగాలతో ముందుకువస్తేతప్ప యీ భారంనుండి బయట పడలేము. ఉపాధ్యాయులు అందుకు సిద్ధంగావున్నా, మనం కదలకపోతే యీ కొరత తీరేదికాదు.

**సోదరులారా !**

విద్యా విధానం యింకా ఒక క్రమపద్ధతిలోలేదు. ఒకే వ్యవస్థలో ఎన్నో అంతరాలు, మరెన్నో దొంతరులు, ఎన్నెన్నో వింతలు విడ్డూరాలు. ప్రభుత్వ ఉద్యోగులకువున్న జి. వో. స్థానిక సంస్థల ఉద్యోగులకు వర్తించవు. వారికి వర్తించేది ఎయిడెడ్ వారికి వర్తించదు. అందరికి వర్తించేవి ఉపాధ్యాయులకు వర్తించవు. అసలు పనిచేసిన కాలానికి జీతమే యివ్వరు. ఇదే ఉపాధ్యాయుల సంక్షేమబాట దీనిపైననే విద్యా విధానపు నడక. వానిపైననే భావిపౌరుల పురోగతి. అది, అంతంలేని అయోమయ స్థితిలో అల్లల్లాడుతోంది. విద్యావ్యవస్థ.

వీటినుండి బయట పడేదానికి యీ క్రింది భవిష్యత్ కార్యక్రమాలు మనం నిర్వహించాలి.

1. ప్రత్యామ్నాయ విద్యా విధానంరూపొందించి వెంటనే అమలు జరిపేదానికి కృషిచేయాలి.

2. పనిహక్కు రాజ్యాంగబద్ధం చేసేదానికై కృషి చేయాలి.

3. అవినీతికి వ్యతిరేకంగా నిర్విరామంగా పోరాడాలి.

4. అపరిష్కృత సమస్యల పరిష్కారానికి శక్తివంతమైన ఉద్యమాన్ని నిర్మించాలి.

5. పని చేసిన వారికి నెల నెలా సక్రమంగా జీతాలు వచ్చేదానికి కృషిచేయాలి.

6. ప్రభుత్వ వాగ్దానాలుఅమలు పరిచేలా పోరాడాలి.

7. ఉపాధ్యాయ సంఘాలమధ్య ఐక్యతమరింతముందుకు తీసుకుపోవాలి.

యు. టి. యఫ్. ఆవిర్భావమే ఒక చారిత్రక అవశ్యకత. అది నిర్వహించవలసిన కర్తవ్యాలూ అట్టివే. విధివిరామం లేని కార్యక్రమాలే మనం చేపట్టాం. అలక్ష్యం విడనాడి మన లక్ష్యం ఎరిగి, విద్యాభివృద్ధికి అధ్యాపక సంక్షేమానికి, జాతి అభివృద్ధికి శక్తివంతంగా కృషిచేద్దాం.

మొత్తం మూడు సంవత్సరాల సంఘ కార్యకలాపాల సంక్షిప్త నివేదిక మీ ముందుంచాను. పరిశీలించి నిర్మాణాత్మక మైన సూచనలు యిచ్చి నివేదికను పరిపుష్టమొనర్చండి.

భవదీయుడు

ఎ. వెంకటస్వామి

ప్రధాన కార్యదర్శి

# జిల్లా శాఖల రిపోర్టులు

విశాఖ జిల్లా శాఖ: ప్రస్తుతం 400 సభ్యత్వం ఉంది. క్రొత్తప్రాంతాలకు ఉద్యమం వ్యాపిస్తున్నది. ఇటీవల నూతన కౌన్సిల్ ఎంతో ఉత్తేజకరంగా జరిగింది. 80 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అనకాపల్లి, పెందుర్తి, నక్కపల్లి సమితి శాఖలు పటిష్టవంతంగా పనిచేస్తున్నాయి. కోట. రావికమతం, విజయంపేట, సబ్బవరం సమితులకు ఉద్యమం విస్తరించే అవకాశాలున్నాయి. సమస్యల పరిష్కారానికి నిత్యకృషి సాగుతున్నది. కార్యకర్తలు కదిలితే వుద్యమం మరింత పురోగమింపగలదు. జిల్లా గ్రంథాలయ సంస్థ వారిచే అన్ని గ్రంథాలయాలకు పత్రికలు తెప్పించే కృషిచేశాము.

—ఎ. బాబూరావు, ప్రధాన కార్యదర్శి.

తూర్పు గోదావరి జిల్లాశాఖ: ఐక్యఉద్యమానికి పెట్టని కోటగానున్న జిల్లా. 4500 సభ్యత్వంతో దాదాపు అన్నిసమితులకు పట్టణాలకు వ్యాపించి అగ్రశ్రేణిలోఉంది. పత్రికా క్యాంపెయిన్లో ప్రథమస్థానంలభించి బహుమతులందుకొన్నది. పోరాట సాంప్రదాయంగల పలువురు కార్యకర్తలు, సమితిశాఖలు ఉన్నాయి. సమర్థవంతమైన నాయకత్వంఉంది ముమ్మిడివరం సమితిశాఖఅధ్యక్షులు శ్రీ కె.గంగిశెట్టి అధికారులకక్షాచర్యలకు గురియై నిర్బంధ రిటైర్‌మెంట్ చేయబడ్డారు. అత్యవసర పరిస్థితిలో సదరుశాఖ ప్రారంభించిన ధర్నా సందర్భంగా జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి అరెస్టు చేయబడి. తిరిగి నిర్దోషిగా విడుదల చేయబడ్డారు. శ్రీ యల్. సోమరాజుగారు కాకినాడలో అమరణ నిరాహారదీక్ష ప్రారంభించిన సందర్భంలో వారికి అండగా జిల్లాశాఖ నిలబడి శిబిరాన్ని నిర్వహించి విజయం సాధించింది. అపరిష్కృత సమస్యల పరిష్కారానికి ప్రత్యక్షచర్యకు జిల్లాకలెక్టర్‌కు నోటీసుయిచ్చి, సమన్వయ సమావేశం జరిపించి వివిధసమస్యలపరిష్కారంకై కృషిచేశాం.అవినీతి పరులైన నిరంకుశాధికారుల్ని అడుగడుగునా అడ్డుకొంటున్నాం. అమలాపురం సమితిలో అక్రమ వసూళ్ళను టీచర్లకుతిరిగి ఇప్పించటం జరిగింది

నెలనెలా విద్యారంగానికి చెందిన అందరుజిల్లా అధికారులతో రాయబారాలు జరుపుతూ, వివిధ సమస్యలపై రిప్రజెంట్ చేస్తూ పురోగమిస్తున్నశాఖ. సెకండరీరంగంలోకి చొరవతో చొచ్చుకుపోతున్నాము. ఆ కృషి ద్విగుణీకృతం చేయాల్సిఉంది. అయాసమితుల్లోగల కొద్ది లోటుపాట్లను సర్దుకుంటే జిల్లాలో ఎదురులేని సంఘం కాగలదు. త్యాగనిరతి, ఉత్తమ సాంప్రదాయాలు పుణికిపుచ్చుకొన్న కార్యకర్తలుండటంతో జిల్లాఉద్యమంఅప్రతిహతంగా పురోగమింపగలదనిఆశింపవచ్చు రాష్ట్రశాఖయిచ్చిన అన్ని కార్యక్రమాలు విజయవంతం చేస్తున్నాము.

—వి. సూర్యనారాయణరాజు, ప్రధాన కార్యదర్శి.

పశ్చిమ గోదావరిజిల్లా శాఖ:- 1500 సభ్యత్వంతో ప్రారంభమై ప్రస్తుతం 2800తో పురోగమిస్తున్నది. ఉద్యమం సెకండరీ రంగానికి వ్యాపించింది. యువ కార్యకర్తలనేకులున్నారు. సమన్వయ కృషితో ముందుకు పోతే అన్ని జిల్లాల కంటె అగ్రభాగాన నిలబడే అవకాశాలున్నాయి. ఉత్తమపోరాట సాంప్రదాయాలు జీర్ణించుకొన్న శాఖ యిది. జీవిత చందాల సాధన కృషిలో అగ్రభాగాన వుంది. నెలనెలా అధికారులతో రాయబారాలు నడుపుతూ సమస్యాపరిష్కారానికి కృషి సాగిస్తున్నది. ఉద్యమం వున్న ప్రతి సమితిలోను సమన్వయ సమావేశాల ద్వారా సమస్యా పరిష్కార కృషి సాగుతున్నది. రాష్ట్ర శాఖ యిచ్చిన ప్రతి కార్యక్రమం నిర్విఘ్నంగా నెరవేరుస్తున్నది. ఆర్థిక పరిస్థితి సరిదిద్దుకొంటే వుద్యమం మారు మూలలకుకూడా పురోగమించే స్థితి ఉంది. సెకండరీ రంగంనుండి ఇంకా కార్యకర్తల్ని ముందుకు తీసుకురావల్సివుంది.

—యస్. ఆర్. పోలిశెట్టి, ప్రధాన కార్యదర్శి.

కృష్ణా జిల్లాశాఖ: అనేక ఆటుపోటుల్ని ఎదుర్కొని నిలదొక్కుకొని, పురోగమిస్తున్న జిల్లా. అపారానుభవం గల కార్యకర్తలున్న జిల్లా. ప్రస్తుతం జిల్లాలోగల 17 సమితుల్లో 9సమితులోను, 3 మునిసిపాలిటీలలో ఒక మునిసిపాలిటీలోను శాఖలు పనిచేస్తున్నాయి. 500 సభ్యత్వంతో ప్రారంభమై 1100సభ్యత్వానికి పురోగమించింది. సెకండరీ రంగానికి చెందిన కార్యకర్తలు లభించటంతో ఉద్యమానికి క్రొత్త వూపువచ్చి జిల్లాలో అన్ని హైస్కూళ్ళకు వ్యాపించగల అవకాశాలున్నాయి. ఉరకలు వేస్తున్న ఉద్యమోత్సాహంతోపాటు నిర్మాణం పటిష్టవంతంగా కొనసాగితే ఈ జిల్లా అగ్రశ్రేణికి అతి త్వరితంగా రాగలదు. ఉపాధ్యాయుల ఆదరణ, అండదండలు రంగమంతా సిద్ధంగా ఉంది. కావల్సింది కార్యకర్తల చొరవ ... దీక్షలు మాత్రమే.

సమస్యా పరిష్కారకృషి :- సమితుల్లో, జిల్లాపరిషత్‌లో డి. యి. ఓ ఆఫీసులో నిత్యం సమస్యలపై రాయబారాలు జరుపుతూ,కరస్పాండెన్స్ నడిపిస్తూ పరిష్కార కృషిసాగిస్తున్నాము. జడ్.పి.లో జరిగిన మూక ఉమ్మడి అక్రమబదిలీలపై కరపత్రం వేసి ఆందోళన జరిపాము. మొవ్వ సమితిశాఖ బి.డి ఓ మొండి వైఖరి కారణాన ధర్నా జరిపి సమస్యాపరిష్కారం సాధించింది. కక్షా చర్యలుగా బదిలీలు సాగుతుంటే ఎదిరించి పీడితోపాధ్యాయుల పక్షాన నిలబడుతున్నది. ఇతర సంఘాలతో కలిసి నందిగామ సమితిలో అమరణ నిరాహారదీక్ష వ్రతం చేపట్టి సమస్యా పరిష్కారం సాధింపబడింది. సమిష్టి, వ్యక్తిగత సమస్యలపై ఎప్పటికప్పుడు కరస్పాండెన్స్ జరపటంలో జిల్లాశాఖ కృషిచేస్తూ వుంది. రాష్ట్రశాఖ యిచ్చిన అన్ని కార్యక్రమాల్లో పాల్గొంటున్నది. ఆర్థిక దుస్థితి అధిగమిస్తే జిల్లాశాఖ మరింత పటిష్ఠవంతంగా పనిచేయగలదు. దానికై గణనీయ కృషి సాగుతున్నది. అది ఉద్యమాభివృద్ధికి శుభసూచకం.

— యం. ఏసురత్నం, ప్రధాన కార్యదర్శి.

గుంటూరు జిల్లా: జిల్లాలో యు. టి. యఫ్. కు ఉజ్వల భవిష్యత్తువుంది. ప్రథమంలో 700మంది సభ్యత్వంతో ప్రారంభమై పిదప 1900కు వృద్ధి పొంది, ప్రస్తుతం 2800 తో కొనసాగుతున్నది. ఇంకా 200 సభ్యత్వం వసూలు కావల్సిఉంది. రోజు రోజుకు ఉపాధ్యాయుల అపారాదరణ లభిస్తూవుంది. ఆ ఆదరణతోనే గతసంవత్సరం గుంటూరులో విద్యాగోష్టి సఫలంచేశాం. జిల్లా ఉపాధ్యాయ వర్గం దానికిదాదాపు రు. 8 వేలు విరాళంగా ఇచ్చింది. పనిగంటలు, పని దినాలు పెంచటం అశాస్త్రీయమని ఎలుగెత్తిచాటి, జె. సి. టి. ఎ. నిర్మాణానికి దారితీసి, ఉద్యమ చరిత్రలో నూతన పుటల్ని చేర్చిన చరితాత్మక ఘటన ఆగోష్టి.

జిల్లాలో రేపల్లె,తాళ్లూరు,రాజుపాలెం,తాడికొండ,మంగళగిరి, అమృతలూరు, తెనాలి, ఈమని సమితుల్లోనూ, తెనాలి మునిసిపాలిటీలోను మన శాఖలు పటిష్టంగా పనిచేస్తున్నాయి. పొన్నూరు, పల్లపట్ల సమితుల్లో క్రొత్తగా శాఖలు ఏర్పడ్డాయి. నరసరావుపేట, పల్నాడు, బాపట్ల ఏరియాలకు విస్తరించటానికి అడ్‌హాక్‌బాడీలు ఏర్పడినవి. సెకండరీ పాఠశాలల్లో దాదాపు అన్నిచోట్ల సభ్యత్వం చేర్చే అవకాశముంది.

కార్యక్రమాలు :- జిల్లా పరిషత్తులలో జరుగుతున్న ప్రతి సమన్వయ సమావేశంలోను జిల్లా శాఖ నిర్మాణయుతంగా పాల్గొంటున్నది సమస్యల సేకరణలోను, పరిష్కార కృషిలోను అగ్రభాగాన నిలుస్తున్నది. అధ్యక్ష, కార్యదర్శులు ఆయా ఆఫీసులకు తరచుగా వెళ్ళి పరిష్కార కృషిసాగిస్తున్నాము. మన సంఘం ద్వారా దీర్ఘకాలం ఆందోళన జరిపి డి.ఇ.ఓ. ఆఫీసులో మొదటిసారిగా సమన్వయ సమావేశం జరిపించుకోగలిగేం. అక్రమ బదిలీలు సరిజేయించడంలోను, అరియర్స్ మంజూరు చేయించటంలోను, సీనియారిటీ లిస్టులు తయారు చేయించటంలోను, హిందీ పండితుల జీతాల విషయంలోను కొన్ని విజయాలు పొందేం. కాని అధికారుల జాప్యాన్ని, ఆఫీసుల్లో అవినీతిని ఎదుర్కొంటానికి పటిష్ట పోరాటం నిర్వహించాల్సి ఉంది. వివిధ సమితుల్లో సమస్యా పరిష్కారానికి మన కార్యకర్తలు అగ్రభాగాన నిలబడి గణనీయ కృషిసాగించి చాలా సమస్యలు సాధించాము. తాడికొండ, భట్టిప్రోలు, ధూళిపూడి మొదలగు చోట్ల విద్యా గోష్టులు జరిపాము. తెనాలి తాలూకాలో టీచర్లందరికి అందేట్టు 2 వేల పంచదార కార్డులు పంపకం చేశాము.

తూర్పు రాయలసీమ ఎన్నికలప్రచారానికి జిల్లా కార్యకర్తలు 5 గురు అనేక వ్యయ ప్రయాసలకోర్చి వెళ్ళి విజయానికి దోహదపడటం జరిగింది. రాష్ట్ర శాఖ ఇచ్చిన అన్ని కోటాలు యధాశక్తి పూర్తిచేస్తున్నాము జిల్లాలో దాదాపు 600 పత్రికలు వస్తున్నవి జిల్లా ఆఫీసు నిర్వహణ, పెరోల్ టైమర్ నియామకాలకు సన్నాహాలు జరుగుతున్నవి.

—టి. అంజిరెడ్డి, ప్రధాన కార్యదర్శి.

ప్రకాశం జిల్లా: ఈ జిల్లాలో మన ఉద్యమం దినదినాభివృద్ధి నందుతున్నది. 1974లో 200 మందితో ప్రారంభమైన ఉద్యమం ఈ రోజుకు 2000 సభ్యత్వంతో ముందుకు సాగుతున్నది. జిల్లాలోని మొత్తం 17 సమితుల్లో 8 సమితులలోను, (ఉలవపాడు, గిద్దలూరు, పరుచూరు. ఒంగోలు, కొరిశపాడు. కొండపి, కనిగిరి, మద్దిపాడు సమితులు) 3 మునిసిపాలిటీలలో ఒక మునిసిపాలిటీలోను (చీరాల) మన శాఖలున్నవి. ఈ సంవత్సరం మరి 4 సమితులకు, మరొక మునిసిపాలిటీకి విస్తరించే

అవకాశాలున్నాయి. ప్రాథమిక, సెకండరీ పాఠశాలలలో 1:1 వంతున సభ్యత్వం ఉండటం సంఘ పురోభి వృద్ధికి తోడ్పడు తున్నది. ఇంకా 300 సభ్యత్వం వసూలు కావల్సివుంది. రాష్ట్ర ఆఫీసుకు టైప్ మిషన్ కొని యిచ్చిన జిల్లా.

పోరాటాలు : 1975లో యు.టి.యఫ్. ఏర్పడక పూర్వం జిల్లా పరిషత్‌లో సమస్యా పరిష్కారానికి కృషిచేసే సంఘంలేదనే చెప్పాలి. యు. టి యఫ్ ఏర్పడగానే జిల్లాపరిషత్‌లో అనేక సమస్యలపై రాయబారాలు, ఆందోళనలు సాగించి పరిష్కారానికి పాటుబడింది. వాటిలో ముఖ్యమైనవి (1)జిల్లాఅంతటా టీచర్లకు పంచదార కోటాల పెంపుదల (2)1974 పే ఫిక్సేషన్ చేయించుట-ఎరియర్స్ చెల్లింపజేయుట (3)పండితులకు జీతనష్టంపై ట్రయినింగుకు వెళ్ళినవారికిగూడ డెప్యుటేషన్ ఇప్పించుట (4)1972 సమ్మెకాలపులీవు మంజూరు చేయించుట మొదలగు నవి. మిగిలిన సమస్యల పరిష్కారానికి జిల్లా యు.టి.యఫ్ వివిధ పోరాట కార్యక్రమాలతో ఆయత్తమవుతున్నది.

ఉలవపాడు, గిద్దలూరు సమితులలో ఇటీవల ధర్నా నోటీసులిచ్చి ఉపాధ్యాయుల్ని పోరాట కార్యక్రమాలకు సమాయత్త పరచటంద్వారా చాలసమస్యలు పరిష్కరించబడ్డాయి. మిగిలినచోట్ల రాయబారాలతో సమస్యా పరిష్కారకృషి సాగు తున్నది. రాష్ట్రశాఖ యిచ్చిన ప్రతి కార్యక్రమం జయప్రదం చేస్తున్నాం. 1976 జనరల్ ఫండ్ పిలుపుగాని, తూర్పు రాయల సీమ నియోజకవర్గ అభ్యర్థి విజయానికి కృషి చేయటంలో, విరాళాల వసూళ్ళలో ఈ జిల్లాశాఖ కార్యకర్తలు శక్తికొలది కృషి చేశారు.

**—డి. రామిరెడ్డి, ప్రధాన కార్యదర్శి.**

నెల్లూరు జిల్లా శాఖ :- 1974 లో 500 సభ్యత్వంతో ప్రారంభమై నేడు 1825కి చేరుకొన్నది. జిల్లాలోగల 12 సమితులకు ఉద్యమం వ్యాపించింది. 120 హైస్కూళ్ళలో 100 హైస్కూళ్ళకు విస్తరించింది. తూర్పు రాయలసీమ ఎన్నికల సందర్భంలో ప్రధానబాధ్యతవహించి మన అభ్యర్థి విజయాన్ని సాధించింది. కార్యకర్తలమధ్య సమన్వయ కృషివుంటే జిల్లాలో తిరుగులేని సంఘం కాగలదు.

సమస్యలపై కృషి :- మన యమ్. యల్. సి. లోడ్పాటుతో 1969 నుండి టెంపరరీగా పనిచేస్తున్న వుపాధ్యాయులు ప్యానల్ ఉపాధ్యాయులుగా గుర్తింపబడటం, పంచాయత్ ఎన్నికల శలవు రిజర్వేషన్, శిక్షణ పొందిన పొందుతున్న పండితులకు వేతనాల సాధన, సి. డి. మొదటి వాయిదా చెల్లింపు, 1976 వరకు పి.యఫ్. స్లిప్పులు, అనేక వ్యక్తిగత సమస్యలు మన సంఘ కృషిద్వారా సాధింపబడినయ్. ప్రతినెల అధికారులతో రాయబారాలు నడుపబడుతున్నవి. రాష్ట్ర కార్యదర్శి తిరిపాలు, యం.యల్.సి. శ్రీ మాధవరావు వాటికి అధ్వర్యం వహిస్తున్నారు. రాష్ట్ర కార్యక్రమాలన్నీ విజయవంతం చేయబడుతున్నాయి. ఉదయగిరి సమితిలో ధర్నా నోటీసు ఇచ్చి పోరాట కార్యక్రమంద్వారా సమస్యాపరిష్కార కృషి సాగింపబడింది. కార్యకర్తలు మరింత చొరవ తీసుకొంటే మా జిల్లా సభ్యత్వం మరో వేయికి పెరిగే అవకాశం వుంది.

**—టి. కొండాచారి, ప్రధాన కార్యదర్శి.**

చిత్తూరు జిల్లా శాఖ: యమ్. యల్. సి. ఎన్నికలలో విజయం పొందిన తర్వాత క్రొత్తగా 2000 సభ్యత్వంతో నిర్మాణంలోకి వచ్చిన జిల్లా, దాదాపు అన్ని సెకండరీ పాఠశాలల్లోను శాఖలున్నాయి ఎలిమెంటరీ రంగంలో పిచ్చాటూరు, సత్యవేడుసమితులకు వుద్యమం వ్యాపించింది. నేటివిటీ జి. ఓ. వలన జిల్లా వుపాధ్యాయవర్గం చింతర వందరై అనేకబాధలకు లోనయింది. జడ్. పి.లో సమస్యలు కోకొల్లలుగా వున్నాయ్. యం, యల్. సి. రాష్ట్ర సంఘ సహకారాల్తో సమస్యల పరిష్కారానికి జిల్లా శాఖ కృషి చేసింది. పాక్షిక విజయాలు సాధించింది. కార్యకర్తలు సమన్వయ కృషితో పట్టుదలగా ప్రయత్నిస్తే మారుమూలలకు కూడా ఉద్యమ వ్యాప్తి జరిగే అవకాశాలున్నాయి. రాష్ట్రశాఖ కార్యక్రమాన్ని జిల్లా శాఖ అమలు జరుపుతున్నది. కరపత్రాలద్వారా ఎప్పటికప్పుడు సమస్యాపరిష్కార కృషిని ఉపాధ్యాయులకు తెలియజేస్తున్నది.

**—సి. మహదేవరెడ్డి, ప్రధాన కార్యదర్శి.**

కర్నూలు జిల్లాశాఖ : సభ్యత్వంలో కొంతవెనుకబడింది. ప్రస్తుతం 440తో కొనసాగుతున్నది.కార్యకర్తలలోటు సవరించు కొంటే ఉద్యమం ముందుకుపోయే అవకాశాలున్నాయి అక్రమ బదిలీలనరికట్టే కృషిలో విజయం సాధించారు. నిర్మాణం ఇంకా పటిష్ఠం కావల్సిఉంది.

**—కె. తర్రెన్న, ప్రధాన కార్యదర్శి.**

అనంతపురం జిల్లా :- కొత్తగా నిర్మాణంలోకి వచ్చింది. ఉద్యమానుభవం గల కార్యకర్తలున్నారు. సమస్యా పరిష్కార కృషి క్రమ పద్ధతిలో సాగిస్తున్నాము. టీచర్లకు ఇళ్ళస్థలాల సాధనకు ప్రత్యేక కృషి చేస్తున్నాము. అక్రమ బదిలీల రద్దు సాధించాము. నిర్బంధ రిటైర్‌మెంట్‌కు గురయిన వారికి తిరిగి ఉద్యోగా లివ్వాలని నిరాహార దీక్ష పట్టుదలగా సాగించాము. వివిధ సమితులకు ఉద్యమం క్రమంగా వ్యాపిస్తున్నది. ఆర్థిక దుస్థితి అధిగమిస్తే జిల్లా ఉద్యమం నిరాఘాటంగా పురోగమించ గలదు.

**-బి. వెంకటసుబ్బయ్య, ప్రధాన కార్యదర్శి.**

ఖమ్మం జిల్లా: గతంలో వివిధ ఉపాధ్యాయ ఉద్యమాలలో పాల్గొని అనుభవం గడించిన అగ్రశ్రేణి కార్య కర్తలు యు టి. యఫ్. లోకి రావటం వలన సంఘ ప్రతిష్ట, ఉద్యమ వ్యాప్తి అతిశీఘ్రంగా జరిగింది. 75 సం॥ లో 500 సభ్యత్వంతో ప్రారంభమైప్రస్తుతం 1200కు చేరుకున్నది తిరుమలాయపాలెం ఖమ్మం, మధిర, కొత్తగూడెం, భద్రాచలం, కూనవరం, వి.ఆర్. పురం, సమితులు పటిష్టంగా పనిచేస్తున్నాయి. ఖమ్మం పట్టణ శాఖ నిర్మాణంలోకి వచ్చింది. అశ్వారావుపేట, ఇల్లెందు, సుదిమెళ్ళ సమితుల్లో అడ్‌హాక్ బాడీలు ఏర్పడి కృషిసాగిస్తున్నయ్. కల్లూరుసమితిలో సభ్యత్వం ఉంది. ఈ విధంగా జిల్లాలో గల అన్ని సమితుల్లోకి ఉద్యమం చొచ్చుకు పోతున్నది, రాష్ట్ర శాఖ యిచ్చిన ప్రతి కార్యక్రమం పత్రికాచందాలుగాని, జనరల్ ఫండ్ వసూళ్ళుగాని, ఇతర కార్యక్రమాలు గాని అక్షరాలా అమలు పరుస్తున్న జిల్లా. కోటాల్ని అధిగ మిస్తున్న జిల్లా. నిత్య చైతన్యంతో పురోగమిస్తున్నజిల్లా.

అన్నివసతులతోకూడిన ఆఫీసును సమకూర్చుకొని వివిధ ప్రాంతాలనుండి వచ్చేపోయే ఉపాధ్యాయులతో క్రిక్కిరిసి ఉండటం జిల్లా ఉద్యమ స్థాయికి ఓశార్కాణం. పని గంటలు బడి దినాల తగ్గింపు విషయమై ఐక్యకృషికి ఇతర సంఘాలతో సంప్రదింపులు జరిపి కలిసి వచ్చిన పి. ఆర్. టి. యు. తో జె. సి. టి. ఎ నిర్మాణంచేసి దాని కార్యక్రమాన్ని జయప్రదం చేయటానికి జిల్లా శాఖ తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చింది. తిరుమలాయపాలెం సమితి అన్ని సంఘాలతో ఐక్య సంఘటన ఏర్పాటు చేసి సమస్యాపరిష్కారానికి నిరాహారవ్రత నోటీసు ఇచ్చి నూతన పోరాట సాంప్రదాయాన్ని నెలకొల్పింది.

సమస్యా పరిష్కార కృషి :- జడ్ పి. జాప్యంమూలంగా ఆఫీసు వద్దనే డిటెయిన్ చేయబడిన టీచర్ల సర్వీసు ఆన్ డ్యూటీగా గుర్తింపచేయడంలోను, లోకల్‌ఫండ్ ఆఫీసు నుండి జీతాల గ్రాంటులు ఎరియర్స్ గ్రాంటులు రిలీజు చేయించుట లోను, జడ్.పి. టీచర్లను టైమ్ చార్ట్ బిల్సు, సి.డి, టి.టి.ఎ.ల మంజూరు చేయించటంలోను కొత్తగూడెం సమితి ఏజన్సీ అల వెన్సు గ్రాంటు రిలీజు చేయించుటంలోను అశ్వరావుపేట సమితిలో ఇంక్రిమెంటల్ ఎరియర్స్ చెల్లించు కృషిలోను ఎయిడెడ్ టీచర్ల జీతాల గ్రాంట్లు రిలీజు చేయించటంలో జిల్లాశాఖ విజయాలు పొందింది. ఇంకా సాధింపవలసిన సమస్యలనేకం ఉన్నాయి. సమస్యా పరిష్కారానికి అధ్యక్ష, కార్యదర్శులు, కార్యవర్గ సభ్యులు నిత్య కృషి సాగిస్తున్నారు. యు టి.యఫ్. సాగించిన కృషి ఫలితంగా జిల్లా ఉపాధ్యాయ వర్గం సంఘంపై అపారాదరణ చూపుతున్నారు. దాన్ని సంఘటిత పరచి మరింత పటిష్టవంతంగా ముందుకు పోగలమనే ఆత్మ విశ్వాసం జిల్లా శాఖకు ఉన్నది. ద్వితీయ విద్యామహాసభలు నిర్వహించేభారం మాపై వేశారు. జిల్లాలోని ప్రగతిశీలకాముకుల, కార్యకర్తల, ఉపాధ్యాయుల, ఇతరజిల్లా కార్యకర్తల, రాష్ట్రసంఘ సహకారంతో ఆ బాధ్యతలు జయప్రదంగా నిర్వహించగలమని భావిస్తున్నాము. అందుకు ఆత్మవిశ్వాసంతో కృషి చేస్తున్నాము.

**— వి. మల్లిఖార్జునరావు, ప్రధాన కార్యదర్శి.**

వరంగల్ జిల్లా శాఖ: 100 సభ్యత్వంతో ప్రారంభమై 700కు చేరుకున్న జిల్లా. వరంగల్‌లో 800 మందితోను, నర్సంపేటలో 300 మందితోను విద్యాగోష్టులు జరిపాము నర్సంపేట గూడూరు, పర్కాల, వరదన్నపేట. ఘనపురం సమితుల్లోనూ, వరంగల్ హన్మకొండ పట్టణాలలోను సంఘ శాఖలు పనిచేస్తున్నాయి. కార్యకర్తల మధ్య సమన్వయ కృషి ఉంటే అతిత్వరితంగా జిల్లాలో గల అన్ని ప్రాంతాలకు ఉద్యమం వ్యాపించే అవకాశం ఉంది.

సమశ్యలపై కృషి: జడ్. పి.లో మూడు మాసాలకొకసారి జరిగే సమన్వయ సమావేశాల్లో జిల్లాశాఖ పటిష్టంగా పాల్గొంటున్నది. వాణీనికేతన్‌ఉపాధ్యాయులకు నేరుగాజీతాలు చెల్లించుట, నర్సంపేట జడ్ పి. హైస్కూలు (బాలురు) గుర్తింపు సాధించుట, వారికి వేతనాలిప్పించుట, మేడపల్లి ఉపాధ్యాయులపై జరిపిన దౌర్జన్యాలపై ఆందోళనజరిపి ముద్దాయిలతో క్షమాపణ చెప్పించుట, దసరా పండుగసందర్భంలో ఉపాధ్యాయులకు వేతనాలిప్పించుట, 7వ తరగతి పరీక్షలు, నిర్వహించిన వారికి పి.పి. లీవు ప్రపోర్షనేట్‌గ ఇప్పించుట మొదలగు విజయాలు సాధించితిమి. ఇంకా అనేక సమస్యలపై రాయబారాలు జరపటం, కరస్పాండెన్స్ జడపటం, జరుగుతున్నది. ఆర్థిక ఇబ్బందులనధిగ మించి, కార్యకర్తలు దీక్షవహిస్తే జిల్లా ఉద్యమం మరింత ముందుకు పోగలదు.

**— జి. మల్లయ్య, ప్రధాన కార్యదర్శి.**

నల్లగొండజిల్లా శాఖ : 100 సభ్యత్వంతో ప్రారంభమై 400 కు చేరుకున్న జిల్లా. ఆర్థిక కొరత, కార్యకర్తల కొరత వెన్నంటుతున్నా త్యాగాలే పెట్టుబడిగాగల కార్యకర్తల కృషి ఫలితంగా జిల్లా సంఘం క్రమక్రమంగా బలీయంగా రూపొందుతున్నది. యువకార్యకర్తలెందరో ముందుకు వస్తున్నారు. వారిని సంఘటితపరచి నిర్మాణయుత కృషి సాగించాల్సి ఉంది. పైరవీయే ప్రధానంగాగల కొందరు స్వార్థపరులు తమపునాదులు కదలసాగేసరికి అపనిందల బురదచల్లటానికి పూనుకొన్నారు. విషప్రచారాల ఉధరసాగించారు. ఆ బాలారిష్టాల్ని దృఢ దీక్షతో జిల్లాశాఖ ఎదుర్కొన్నది.

సమస్యా పరిష్కార కృషి :- జడ్ పి.లో జరిగిన అక్రమ బదిలీలు ప్రభుత్వ దృష్టికితెచ్చి అవసరమైన మేరకు సరిజేయించడం జరిగింది. హుజూర్ నగర్ సమితిలో సి డి ఇప్పించడం, జడ్.పి.లో టి.టి.ఎ.లు సాధించడం, ఎరియర్స్ ఇప్పించడం, దాదాపు 21 మంది వ్యక్తిగత సమస్యల పరిష్కార కృషి సాగించడం జరిగింది. నిరంకుశ అధికారుల, లంచగొండి ఉద్యోగుల ఆటంకాలను అడుగడుగునా ఎదుర్కోవాల్సివస్తున్నది.రానున్న దసరాలో జిల్లా స్థాయిలో ఉద్యమ క్లాసులు నిర్వహించేదానికి సూర్యాపేట కార్యకర్తలు ఉత్సాహ పడుతున్నారు. ఉద్యమంలోకి వస్తున్న యువ కార్యకర్తల్ని ఎంత త్వరితంగా చైతన్య పరచి సంఘటిత కృషి సాగిస్తే అంత త్వరితంగా జిల్లా ఉద్యమం ఉరకలు వేసుకుంటూ ముందుకుపోగలదు.

**— పి. సత్యనారాయణ, ప్రధాన కార్యదర్శి.**

మహబూబ్ నగర్ జిల్లా: క్రొత్తగా నిర్మాణంలోకి వస్తున్న జిల్లా. యువకార్యకర్తలనేకులు చొరవతో వివిధ సమితులకు ఉద్యమాన్ని వ్యాపింపజేస్తున్నారు. ప్రస్తుతం 380 సభ్యత్వముంది. అది త్వరలో వెయ్యికి చేరే అవకాశాలున్నాయి. జిల్లాఅడ్‌హాక్ కమిటీ ఏర్పడి ఉద్యమ వ్యాప్తికి నిర్విరామ కృషిసాగిస్తున్నది. కొల్లాపూర్‌లో జిల్లాస్థాయి విద్యాగోష్ఠి జరుపబడింది. కల్వకుర్తి తాలూకా మార్చాలలో గత వేసవిలో 100 మందితో ఉద్యమ క్లాసులు నిర్వహించబడినయ్. దానికి జిల్లాలో గల 16 సమితులలో 14 సమితుల నుండి కార్యకర్తలు హాజరయ్యారు. అక్కడ పొందిన చైతన్యంతో జిల్లాఉద్యమాన్ని మహాసభలు జరుపుకొనే స్థాయికి తీసుకు వెళ్ళాలని ఉద్యమ వ్యాప్తికి పూనుకొన్నారు. పలుచోట్ల సఫలమవుతున్నారు.

సమస్యలపై కృషి : సమితి సంఘాలేర్పడిన ప్రతిచోటా సమస్యా పరిష్కార కృషిసాగుతున్నది. జడ్. పి లోను ఇతర ఆఫీసుల్లోను రాయబారాల ద్వారా, కరస్పాండెన్స్ ద్వారా నిర్విరామకృషి చేస్తున్నాము. పత్రికలు 175 దాకా వస్తున్నవి.

**— ఎస్. విజయకుమార్, ప్రధానకార్యదర్శి.**

# ఉజ్జ్వల ఉద్యమం మూస పత్రికగా వర్ధిల్లుతున్న ఐక్య ఉపాధ్యాయ

## సంపాదకుని పత్రికా నివేదిక



అధ్యక్షా !

నూతన రాష్ట్ర కౌన్సిల్ సభ్యులారా !

ప్రత్యేకాహ్వానితులారా !!

స్వాగతం ! సుస్వాగతం !!

వివిధ ప్రజాతంత్ర ఉద్యమాల కేంద్రమూ, వీర తెలంగాణా పోరాట వారసత్వంగల ఖమ్మం పట్టణంలో మన 5 వ నూతన రాష్ట్ర కౌన్సిల్, దానితోపాటు ద్వితీయ విద్యా మహాసభ పెద్దఎత్తున జరుపుకొంటున్నాం. ఆ సందర్భంలో ఐక్య ఉద్యమ రథసారథులుగా, పీడితోపాధ్యాయుల ప్రతినిధులుగా, అనేక పోరాటానుభవాలతో వివిధ ప్రాంతాల నుండి తరలి వచ్చిన మీ అందరికీ సంపాదక వర్గం తరఫున ఇవే నా హార్దికాభివందనలు !

మనం జరుపుకొనే యీ కౌన్సిల్‌కు, మహాసభలకు ప్రత్యేక ప్రాధాన్యత ఉంది. ఐక్య ఉద్యమ మహాప్రస్థానంలో ఓ మూల మలుపుగా, ఓ మహాసేతు నిర్మాణంగా, ప్రాంతీయ అడ్డుగోడల్ని బద్దలుగొట్టిన విజయధ్వజ ప్రతిష్ఠాపనగా యీ సభల్ని మనం జరుపుకొంటున్నాం. ఆ విధంగా ఐక్య ఉద్యమ చిరస్వప్నాల్ని పండిస్తూ, ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో గర్వింపదగిన నూతన పుటల్ని చేరుస్తున్నాం. అంతేకాదు ... ఎమర్జెన్సీ కారుచీకటి తొలగి, వాక్ సభా, పత్రికా స్వాతంత్ర్యాలు పునరుద్ధరింపబడి, కలానికి గళానికి స్వేచ్ఛ వచ్చిన ప్రత్యేక పరిస్థితిలో మనమిపుడు సమావేశ మౌతున్నాం. గతంలో కోల్పోయిన సౌకర్యాలు పునస్సాధనకు, న్యాయమైన హక్కులకు, వృత్తి భద్రతకు, సంక్షేమానికి వివిధ పోరాటరూపాలు తీసుకొని, మనశాఖలు అనంతపురంలో, ఉదయగిరిలో, ఉలవపాడులో, తిరుమలాయపాలెంలో, నందిగామలో, పిఠాపురంలో, మొవ్వలో, తూర్పు గోదావరిలో, వివిధ జిల్లాలలో విజయశంఖం పూరించి అధికార బధిరాంధక శవాలకళ్లు తెరిపించిన ప్రత్యేక స్థితిలోకూడా మనమిపుడు సమావేశమవుతున్నాం. ఆ ఉద్యమోత్సాహానికి ప్రతీక మనపత్రిక. ఆపోరాట పటిమకు ప్రతిబింబం మన పత్రిక, ఆ ఐక్య ఉద్యమ వజ్రశక్తికి పతాక మన పత్రిక. దానికింకా సానబట్టి, నిగ్గుతేల్చాల్సిన అవసరాన్ని మీ ముందుంచుతూ, మన పత్రికా చరిత్రను సంగ్రహంగా మీకు నివేదిస్తాను.

### పత్రిక అవతరణ - అభివృద్ధి

74 అక్టోబరు 20, 21 తేదీలలో రాజమండ్రిలో జరిగిన చరిత్రాత్మక ప్రథమ మహాసభలో మనసంఘ అధికారవాణిగా "ఐక్య ఉపాధ్యాయ" ప్రచురించాలని నిర్ణయం జరిగింది. ఆ నిర్ణయానుసారం డిశంబరు 8న మహాసభ సావనీర్ వెలువరించి 75 జనవరి నుండి పత్రికా ప్రచురణ ప్రారంభించాం. పూవు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు మన మహాసభ సావనీర్ విశేష ప్రాచుర్యాన్ని పొంది పత్రికాభివృద్ధికి తగు వాతావరణం ఏర్పరచింది, మన నిబంధనావళి, మనలక్ష్యాలు, విద్యారంగంలో మనం ఆశిస్తున్న మార్పులు, విశాలైక్యత ప్రాతిపదికగా సంఘటిత ఉద్యమం వ్యాప్తిచెందాలనే మన ఆకాంక్ష అశేషోపాధ్యాయుల్ని ఆకర్షించి మన పత్రికా వ్యాప్తిని మరింత ముందుకు తీసుకుపోయింది.

అంతేగాక ఐక్య ఉద్యమ ప్రతిబింబంగా మన పత్రిక ప్రతి పరీక్షా సమయంలోను పీడితోపాధ్యాయులకు అండగా నిలబడింది. నిర్బంధ డిపాజిట్ పథకం ప్రవేశపెట్టినపుడు, నేటి

---

హైద్రాబాద్ జిల్లాశాఖ: జిల్లాలో ఉద్యమం నెమ్మదిగా ముందుకునడుస్తున్నది. ప్రధాన బాధ్యుడు తన శక్తియుక్తులన్నీ రాష్ట్ర సబ్ ఆఫీసు నిర్వహణకు, రాష్ట్ర సమస్యల పరిష్కారానికి వినియోగించటంవల్ల జిల్లా ఉద్యమం మందంగా నడుస్తున్నది. అందువల్ల సభ్యత్వం 110 కి మాత్రమే చేరింది, నగర శాఖ ఇపుడిపుడే ఉత్సాహంగా కదులుతున్నది. బాధ్యతల పంపకానికి కార్యకర్తలు పూనుకొని ప్రధాన బాధ్యునిభారం తగ్గిస్తే జిల్లాఉద్యమం విస్తృతమయ్యే అవకాశాలున్నాయి. జిల్లా సంఘం ద్వారా సమస్యా పరిష్కార కృషికొంతసాగింపబడింది. ఆ బలహీనతల్ని అతిత్వరలో సర్దుకోవాల్సిఉంది.

—యం. నరహరి, ప్రధానకార్యదర్శి.

నిజామాబాద్ జిల్లా శాఖ: పత్రికా క్యాంపెయినతో గణనీయ కృషిచేసింది 275 పత్రికలు దాకా జిల్లావ్యాప్తంగా వస్తున్నాయ్. యువకార్యకర్తలున్నారు. సమన్వయ కృషితో నిర్మాణ లోపాలు సరిదిద్దుకొంటే ఉద్యమానికి భవిష్యత్తుఉంది.

—పి. అమరేశ్వరరావు, కన్వీనర్.

మెదక్ జిల్లా శాఖ: కొత్తగా నిర్మాణంలోకి వచ్చిన జిల్లా, కొన్ని ప్రాంతాలకే ఉద్యమం పరిమితమైఉంది, జహీరాబాద్ మెథడిష్టురూరల్ హైస్కూలు టీచర్ల సమస్యాపరిష్కారానికి ప్రత్యేక కృషి చేసింది. కన్వీనింగ్ బాడీఏర్పడి ఉద్యమ వ్యాప్తికి కృషి సాగిస్తున్నది.

—యస్. రామాచారి, కన్వీనర్.

Grams : "NEWAR"




P. B. No. 5

Phone : 294

# THE ASSOCIATED COTTON TAPE INDUSTRIES

Marketing Company (Regd)

Sole Distributors of Cotton Tape (Gold Medalists)







## నాణ్యానికి మన్నికకు
## ప్రసిద్ధికెక్కినది మా నవారు

PALAKOL



W. G. Dt.
(AP)

46

వివిధ జీ. ఓ. జారీ చేసినపుడు, అత్యవసర పరిస్థితిలో మన హక్కుల్ని హరించినపుడు, వేలాది ఉపాధ్యాయుల్ని నిర్బంధ రిటైర్‌మెంట్‌కు బలి చేసినపుడు. బడిగంటల్ని, పనిదినాల్ని పెంచినపుడు, ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి పెంచి రిట్రెంచ్‌మెంటుకు దారితీసినపుడు అన్ని సందర్భాలలో మన పత్రిక నిర్బంధాలకు జడవకుండా, సెన్సార్ కొరడా బెదిరింపులకు చలించకుండా, అవకాశవాదాలకు లోబడి శత్రువుల ముందు జెండా దించకుండా పోరాట పత్రికగా నిలబడిన ఘన చరిత్ర మన పత్రికకు వుంది. దానివలన కూడా అనేకులు మన పత్రిక వైపు ఆకర్షింపబడ్డారు.

అందుకే మన పత్రిక జన్మ దినోత్సవంనాడు ఎందరో అభిమానులు, కవులు, కళాకారులు "వేల వేల ఒజ్జలకు వేగు చుక్క" అన్నారు. "చైతన్య జ్వలితాగ్ని" అని ప్రస్తుతించారు. "ఐక్యోద్యమవాణిగా ... మహోదాశయ శర్వాణిగా" వినుతించారు.

దానికి తగినట్లే మన పత్రికా పుత్రిక వయస్సు కేవలం 2½ వసంతాలే అయినా కార్యకర్తల నిర్విరామకృషి; పాఠకుల అపార ఆదరణ వలన బాల్యాన్ని అతిక్రమించి అతి త్వరలో ప్రౌఢ అయింది. వేలాది ఉపాధ్యాయుల గారాల బిడ్డగా... కంటిపాపగా దినదినాభివృద్ధినంది సర్వాంగ సౌందర్యాన్ని సంతరించుకొన్నది. అన్ని రంగాలవారి ఆప్యాయత ఆదరాభిమానాల్ని చూరగొని రాష్ట్రంలోగల అన్ని వైజ్ఞానిక పత్రికల కంటె అత్యధిక ప్రచారం పొందింది. ప్రథమ వసంతంలోనే 2 వేల సర్క్యులేషన్‌లో ప్రారంభమై 19 జిల్లాలకు వ్యాపించి ద్వితీయ వసంతారంభానికి 5 వేలకు అందుకొని ఆంధ్రప్రదేశ్‌లో గల అన్ని జిల్లాలకు వ్యాపించి ప్రస్తుతం 6 వేలకు చేరుకొంటు న్నది. పత్రిక వెళ్ళిన చోటల్లా ఉద్యమం వ్యాపిస్తున్నది. ఉద్యమాభివృద్ధితోపాటు పత్రికా వ్యాప్తికూడా జరుగుతున్నది. ఈ విధంగా ఉద్యమమూ పత్రికా అవినాభావ సంబంధంతో ఏకోన్ముఖంగా పయనించటం మన అందరికీ గర్వకారణం.

ఈ విధంగా మనపత్రికా పుత్రికను తమగారాల బిడ్డగా, ప్రాణసమానంగా పెంచి పెద్దజేస్తున్న కార్యకర్తలకు, పత్రికా పాఠకులకు, ఉద్యమాభిమానులకు ఈ సందర్భంగా సంపాదక వర్గం తరపున జేజేలు పలుకుతున్నాను.

గత 5½ మాసాల పత్రికా నివేదిక సమర్పించే ముందు గత జనరల్ కౌన్సిల్ సందర్భంలో మనంతీసుకొన్న నిర్ణయాల్ని ఒకసారి సమీక్షించుకోవటం అవసరమని ఈ సందర్భంలో భావిస్తున్నాను.

మన పత్రిక నింకా సర్వాంగసుందరంగా పోరాటాయుధంగా తీర్చిదిద్దాలనీ, స్థాయి పెంచి పాఠకుల చైతన్యాభివృద్ధికి దోహదకారి కావాలనీ, నెల నెలా ప్రతి జిల్లా 25 చందాలు పంపటం ద్వారా క్రమపద్ధతిలో సర్క్యులేషన్ పెంచాలనీ, జీవిత చందాదార్లను ఇబ్బడిముబ్బడి చేయాలని ప్రతిజిల్లా విధిగా కోటాలుప్రకారం ప్రకటనలు సేకరించాలనీ, సకాలంలో పత్రిక వెలువరించాలనీ చందాదార్లకు సక్రమంగా పత్రిక అందేట్టు చూడాలనీ, పత్రిక గ్రంథాలయాన్ని అభివృద్ధి చేయాలని, కార్యాలయాన్ని సర్వాంగ పరిపుష్టంగావించాలని అనేక నిర్ణయాలు తీసుకొన్నాం.

పై నిర్ణయాలకనుగుణంగా ఇటు సంపాదకవర్గం, అటు ఆఫీసు తగుచర్యలు తీసుకొన్నది. ఉద్యమాశయాలకనుగుణంగా పత్రిక స్థాయిని పెంచటానికి వివిధ శీర్షికలు నిర్వహించటం ద్వారా సంపాదకవర్గం గణనీయ కృషిచేసింది. మన కార్యకర్తలు గత స్పెషల్, జనరల్ క్యాంపెయిన్లలో వరుసగా 1070, 2773 మొత్తం 3843 పత్రికల్ని క్రొత్తగా చేర్పించగలిగారు. జీవిత చందాలను గణనీయంగా పెంచారు. ప్రకటనల సేకరణలో గుంటూరు, ఖమ్మం, తూ॥ గోదావరి, ప॥ గోదావరి, కృష్ణా జిల్లాలు యథాశక్తి కృషిసాగించినవి. సకాలంలో పత్రిక అందించడానికి కృతనిశ్చయులమైనా ప్రెస్ ఇబ్బందుల వలన దానిని నెరవేర్చలేకపోతున్నాము పత్రిక గ్రంథాలయాన్ని కూడా మనం తగినంతగా పెంచుకోలేకపోయాం. రిఫరెన్సు గ్రంథాల లోటువల్ల ఉత్తర ప్రత్యుత్తరాల్లో జాప్యం జరుగుతున్నది. పత్రికా కార్యాలయం ఇరుకుగదుల్లోనే నడుస్తున్నది.

పత్రికా క్యాంపెయిన్లు: గత సంవత్సరం సాగించిన స్పెషల్ క్యాంపెయిన్లలో తూర్పుగోదావరి జిల్లా, ఖమ్మం, ప్రకాశం జిల్లాలు ప్రథమ; ద్వితీయ, తృతీయ స్థానాలు పొందేయి. జనరల్ క్యాంపెయిన్‌లో తూర్పు గోదావరి, గుంటూరు, ఖమ్మం ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు పొందేయి. మనం ప్రకటించినట్లుగా ఆ క్యాంపెయిన్లలో పోటీబడి దీక్ష ప్రకటించిన కార్యకర్తల్ని యీ మహాసభల్లో మనం గౌరవించుకోబోతున్నాం. ఈ సందర్భంలో ఆయా జిల్లాల్ని, కార్యకర్తల్ని సంపాదక వర్గం తరపున అభినందిస్తున్నా. నిత్య జాగరూకతతో ప్రతినెలా అంతమైన చందాలనుపునరుద్ధరించేట్టు చూడటం, క్రొత్త చందాలను చేర్పించటం ఉద్యమ కార్యక్రమంలో ఒక భాగంగా మనం కొనసాగించాలి. రాబోయే క్యాంపెయిన్లలో ఇనుమడించిన దీక్షాదక్షతతో పదివేల సర్క్యులేషన్ని మనం సాధించాలి. పత్రిక వ్యాప్తికి, ఉద్యమ వ్యాప్తికి పరస్పర సంబంధం గలదని, ఆ సమన్వయం వుంటేనే ఐక్యోద్యమం మరింత వేగంగా విస్తరించి మిలిటెంట్ ఉద్యమంగా రూపొందుతుందనే సత్యాన్ని, అనుభవ సారాన్ని ఈ సందర్భంలో మీ అందరికీ మళ్ళీ మళ్ళీ గుర్తుచేస్తున్నా. కృష్ణా, తూ. గో., ప. గో., విశాఖ జిల్లాల జి. యల్. యల్. ఎ. అధికారులు తమ గ్రంథాలయాలకు ఆర్డరిచ్చి తమ సహకారాన్ని తెల్పినందుకు మా అభివందనలు. ఆవిధంగానే ఇతర జిల్లాల సంఘాలు కూడా ప్రయత్నించాలని మీకు మనవి చేస్తున్నా.

జీవిత చందాలు : పత్రిక స్వయం పోషకత్వానికి, ఆర్థికపరిపుష్టికి మనం జీవితచందాల ప్రణాళిక ప్రవేశపెట్టాం. 2 వ కౌన్సిల్ నాటికి 25 గా ఉన్న జీవిత చందాలు 3 వ కౌన్సిల్‌కు 63 గాను 4 వ కౌన్సిల్ నాటికి 110 గాను ప్రస్తుతం 135 గాను పెంపొందినవి. వాగ్దానాలు పూర్తిచేస్తే ఆ సంఖ్య యిబ్బడి ముబ్బడి కాగలదు. ఈ సందర్భంలో వాటి అభివృద్ధికి ప్రత్యేక కృషిచేసి అగ్రగామిగా నిల్చిన పశ్చిమ గోదావరి జిల్లాకు నా అరుణాంజలులు. ఆ జిల్లాకు చెందిన విస్సాకోడేరు సమితి, తోలేరు సెంటర్ శాఖ, మొగల్తూరు సమితి శాఖ, భీమవరం పట్టణశాఖ, ఒక ప్లాను ప్రకారం జీవిత చందాలు అభివృద్ధికి కృషిచేస్తున్నవి. ఆ బాటలో అన్నిశాఖలూ నడిస్తే అతి త్వరలో జీవిత చందాలు సహస్ర సంఖ్యకు రాగలవని దాన్ని

ఆదర్శంగా తీసుకొని అన్ని శాఖలు పురోగమించాలని యీ సందర్భంలో కోరుతున్నాను. జీవిత చందాల ధనం ఫిక్సెడ్ డిపాజిట్ రూపంలో భద్రపరచబడిఉంది. పై సహస్ర సంఖ్య గమ్యాన్ని మనం ఎంత త్వరగా పూర్తిచేస్తే అంతత్వరగా మనం స్వంత కార్యాలయాన్ని స్వంత ప్రెస్సును, కావలసిన అన్ని హంగుల్ని సమకూర్చుకోగలమని మీ దృష్టికి తెస్తున్నా.

**సంపాదకీయాలు:** ఈకాలంలో మన సంపాదకీయాలు సమయోచితంగా, చైతన్య స్ఫోరకంగా కొనసాగాయి. మార్చి సంపాదకీయంలో ఎయిడెడ్ సిబ్బంది యెడల ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని, సవతితల్లి ప్రేమను బట్టబయలు చేశాం. దానినే ఫేప్టో అధ్వర్యాన రాజధాని పోరాటంలో ప్రధాన సమస్యచేసి అందరితో కలసి పోరాడాం. ఏప్రిల్‌లో సముచిత వైఖరి ద్వారా ఇతర సంఘాల యెడ మన వైఖరి స్పష్టపరిచాము. ఆ సంచికలోనే 'సక్రమ విధానం' పేరుతో ఉద్యోగులయెడ నూతన కేంద్రప్రభుత్వ కర్తవ్యాలను నిర్దేశించాం.

జూన్ సంచికలో నూతన విద్యా సంవత్సర శుభాకాంక్షలందిస్తూ "సమైక్య ఉద్యమమే సమస్యా పరిష్కారానికి మార్గమని, పటిష్ట సంఘ నిర్మాణమే దానికి ప్రాణం" అని గుణపాఠాల్ని అందించాం. విద్యను జాతీయ జీవనంతోను, ప్రజల ఆశలతోను, సమ్మిళితంజేసి దేశంలో మెజారిటీ ప్రజల సమస్యల్ని పరిష్కరించే శాస్త్రీయ విద్యా విధానం కొరకు, దానికి చెందిన సామాజిక బాధ్యతల నిర్వహణకొరకు పురోగమింపవలసిందిగా ఉత్తేజపరిచాం. జులై సంచికలో విద్యాభివృద్ధికి గొడ్డలిపెట్టుగావున్న 'నేటివిటీ' సూత్రాన్ని ఉపసంహరింప వలసిందిగా డిమాండు చేశాం. ఆగస్టు సంచికలో గేయ రూపంలో ఖమ్మం మహాసభల పిలుపు నందించాం. ఈ విధంగా మన సంపాదకీయాలు చైతన్య స్ఫోరకాలుగా రూపొందాయి.

**కార్టూనులు:** కార్టూనుల్లో మన పత్రిక ప్రత్యేకత సంతరించుకొన్నదని తగిన వ్యాఖ్యలు రూపొందుతున్నాయని విజ్ఞుల మన్ననల్ని పొందింది. ఈ కాలంలో టార్గెట్లు బెదిరింపు అభినవగజేంద్రమోక్షం, సిలబస్ భారం, అమ్మామ్మా విశ్వరూపం, వాయింపు, ఖమ్మం చలో అనే కార్టూనులు సమయోచితంగా రూపొంది పాఠకుల్ని అలరించాయి. పత్రిక స్థాయి పెంపుకు తోడ్పడిన చిత్రకారులకు మనందరి తరఫున కృతజ్ఞతాభివందనాలు.

**విద్యా సమస్యలు:** పాఠ్య గ్రంథాలూ-తీరుతెన్నులూ శీర్షిక క్రింద పాఠ్య గ్రంథాలలోని అపకతవకల్ని బయటపెట్టాం. అశాస్త్రీయ పాఠ్య ప్రణాళిక, పరీక్షా సంస్కరణలు, రాజ్యాంగ లక్ష్యాల కనుగుణమైనవిద్యావ్యవస్థ అనే సవిమర్శక వ్యాసాల్ని ప్రచురించి నూతన విద్యా విధానావసరాన్ని తేటపరిచాం. అలాగే తూర్పు జర్మనీ సోవియట్ యూనియన్ లోని విద్యావిధానాల్ని పరిచయం చేశాం.

**కథలు - గేయాలు:** ఈశీర్షికక్రింద ఆధునిక ఫణితిలో రచించబడిన కథల్ని, గేయాల్ని ప్రచురించటమేగాక క్రొత్త రచయితల్నెకుల్ని వెలుగులోకి తెచ్చాం. జూనియర్ లెక్చరర్ దుస్థితిని వివరించే 'చింత చెట్టు' కథ పలువురి మన్ననల్ని పొందింది. అలాగే మొదటి సారిగా 'ప్రొద్దు పొడిచింది' అనే నాటిక సీరియల్‌గా పాఠకుల కందించాం. అదీ చాలా మంది అభిమానాన్ని పొందింది. ఈవిధంగా స్థాయిలోను, శిల్పంలోను దేనికీ తీసిపోని రచనల్ని అందించి పత్రికాభివృద్ధికి తోడ్పడిన రచయితలందరికీ ప్రత్యేకాభివందనలు తెలియ జేస్తున్నాను.

**ఇతర శీర్షికలు:** 'ప్రశ్నోత్తరాలు' ప్రామాణికంగా ఉంటున్నాయని 'మనమూ మన ఆరోగ్యమూ' ఎంతో ప్రయోజనకరంగా ఉంటున్నదనీ, నియమ నిబంధనలు ఎన్నోవిషయాల్ని తేట పరుస్తున్నాయని, విజ్ఞానవీధి, వార్తా ప్రపంచం శీర్షికలు విజ్ఞానదాయకంగా ఉన్నాయని పాఠకులు తమమన్ననల్ని అందించారు.

**ఆఫీసు నిర్వహణ:** ఆఫీసులో పనిభారం యిబ్బడిముబ్బడి అయింది. ఆ పైన నలుగురు వస్తే ముగ్గురు లేచిపోయే ఇరుకు గదుల్లో పనిచేసుకోవాల్సి వస్తున్నది. పనిసులువుకోసం టైపు మిషన్‌ని, డూప్లికేటర్ మిషన్ని పత్రిక తరఫున కొనుగోలు చేశాం. కార్యకర్తలు కృతనిశ్చయంతో స్థిరదీక్షతోకృషి చేస్తే మనం పత్రిక స్వంత కార్యాలయాన్ని ఏర్పరచుకోగలం. ఉద్యమ పితామహ చెన్నుపాటి స్మారక భవనాన్ని అతిత్వరలో నెలకొల్పుకోగలం. దానికి మీ నిర్మాణయుత సూచనల్ని యివ్వండి.

**ఆర్థికం:** పత్రికా కార్యాలయాన్ని, హోల్ టైమర్సునీ పోషించుకోవాలంటే పత్రిక స్వయం పోషకం కావాలంటే నెలనెలా ప్రతి జిల్లా 25 పత్రికలచందాలు పంపే కార్యక్రమం నిర్విరామంగా కొనసాగుతుండాలి. జీవిత చందాల్ని పెంచాలి. ఆయాజిల్లాలు కోటాల ప్రకారం నిర్ణీతకాలంలో ప్రకటనలు విధిగా సేకరించాలి. పత్రికనిర్విఘ్నంగా కొనసాగాలంటే పై బాధ్యతలు ఖచ్చితంగా నిర్వహిస్తేనే సాధ్యమవుతుంది. (పత్రిక ఆర్థిక రిపోర్టు వేరే ఇస్తున్నాం)

**సూచనలు :-** ప్రెస్ ఇబ్బందులు, ప్రకటనల సేకరణ వంటి కారణాలవలన ప్రతినెల పోస్టింగ్ ఆలస్యమవుతున్నది. చందాదారుల చిరునామాలు పంపేటప్పుడు విధిగా పిన్ కోడ్ వేసి డూప్లికేటులో పంపాలి. చిరునామాలు మార్పుచేయాలన్నా ఏది సరిజేయాలన్నా చందా నెంబరు ఉదహరించితీరాలి. కార్యకర్తలు వుద్యమరిపోర్టులు పంపేటప్పుడు ప్రధానవిషయం శీర్షికగా వుంచి, సంగ్రహీకరించి కాగితం ఒక వైపునే వ్రాసి పంపాలి. అలాగే ఆంగ్ల పదాలు తెలుగులిపిలో పంపితే ఎడిట్ చేయడం, కంపోజ్ చేయడం సుకరం అవుతుంది. పత్రిక చేరలేదనే కంప్లెయింట్స్ ఇంకా ఎక్కువగా వస్తున్నాయి. పై విషయాల్లో కార్యకర్తలు సహకరిస్తే అది తేలిగ్గానే సరిదిద్ద బడుతుంది.

కామ్రేడ్స్ !

సంగ్రహంగా సమర్పించిన ఈ రిపోర్టును చర్చించి, తగు సూచనలిచ్చి మన పత్రికనింకా ప్రయోజనాత్మకంగా, ఉద్యమ ప్రతి బింబంగా తీర్చిదిద్దటానికి తోడ్పడండని ఈ నివేదిక ముగిస్తున్నాను.

అభివందనాలతో
మైనేని వెంకటరత్నం
ప్రధాన సంపాదకుడు.

# ఆర్థిక నివేదిక

## ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

### అర్థిక నివేదిక 1-3-77 నుండి 31-7-77 వరకు

**జమ**

| | |
|---|---|
| గత నిల్వ | 3,654-17 |
| సభ్యత్వము | 4,920-00 |
| జనరలు ఫండు | 604-60 |
| విరాళములు | 302-12 |
| అమ్మకాలు | 16-00 |
| డెలిగేటు ఫీజు | 96-00 |
| వడ్డీ | 40-15 |
| మొత్తము | 9,633-04 |

**ఖర్చులు**

| | |
|---|---|
| ప్రయాణాలు | 3,177-70 |
| ముద్రణ | 589-33 |
| స్టేషనరీ | 99-85 |
| పోస్టేజి | 249-40 |
| అలవెన్సులు | 2,570-00 |
| కౌన్సిల్ సమావేశముల నిర్వణ | 96-00 |
| కార్యాలయ నిర్వహణ, అద్దె | 309-00 |
| ఫెప్టో | 300-00 |
| బకాయిలు | 627-32 |
| ఇతరములు | 25-00 |
| బ్యాంకు నిల్వ | 1341-63 |
| చేతి నిల్వ | 247-81 |
| మొత్తము | 9,633-04 |

## ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

### అర్థిక నివేదిక 1-11-74 నుండి 31-7-77 వరకు

**జమ**

| | |
|---|---|
| సభ్యత్వ రుసుము | 22,170-00 |
| జనరల్ ఫండ్ | 5,368-10 |
| విరాళములు | 6,656-12 |
| బ్యాంకు వడ్డీ | 127-65 |
| సాహిత్యము అమ్మకాలు | 565-50 |
| యం.యల్.సి ఎన్నికలనిధి | 269-00 |
| ప్రతినిధుల రుసుము | 1230-00 |
| అప్పులు | 7434-81 |
| మొత్తము | 43,821-18 |

**ఖర్చులు**

| | |
|---|---|
| ప్రయాణములు | 12,263-68 |
| ముద్రణ | 5,728-94 |
| స్టేషనరీ | 2,382-69 |
| పోస్టేజి | 1,014-80 |
| అలవెన్సులు | 15,123-68 |
| కార్యాలయనిర్వహణ అద్దెతో | 2 315-20 |
| గ్రంథాలయము | 111-15 |
| కౌన్సిల్ సమావేశము నిర్వహణ | 578-65 |
| విరాళములు | 100-00 |
| జె. సి. టి. ఎ. | 122-25 |
| ఫెప్టో | 300-00 |
| త్రైవుమిషన్ | 2000-00 |
| ఇతరములు | 240-00 |
| బ్యాంకు నిల్వ | 1341-63 |
| చేతినిల్వ | 247-81 |
| మొత్తము | 43,821-18 |

## ఐక్యఉపాధ్యాయ

### అర్థిక నివేదిక 1-3-77 నుండి 31-7-77 వరకు

**జమ**

| | |
|---|---|
| ప్రారంభ నిల్వ (1-3-77) | 27,577-20 |
| సంవత్సర చందాలు (855 × 10) | 8,550-00 |
| అర్థసంవత్సర చందాలు(39 × 5) | 195-00 |
| జీవిత చందాలు 23 × 116 | 2 668-00 |
| ఏజన్సీలు, విడిప్రతుల అమ్మకము | 1,325-00 |
| అడ్వర్టయిజ్‌మెంట్లు | 1,135-00 |
| బ్యాంకు వడ్డీ | 351-00 |
| మొత్తం | 41 801-70 |

**ఖర్చు**

| | |
|---|---|
| ప్రయాణములు | 695-30 |
| ముద్రణ | 9,248-55 |
| స్టేషనరీ | 204-20 |
| కార్యాలయ నిర్వహణ, అద్దె | 353-50 |
| పోస్టేజి | 910-40 |
| అలవెన్సులు | 2,950-00 |
| గ్రంథాలయము | 124-40 |
| బకాయిలు | 1.534-60 |
| రోనియో మిషన్ | 2,500-00 |
| ఇతరములు | 56-00 |
| ఫిక్సెడ్ డిపాజిట్ | 13,800-00 |
| బ్యాంకు నిల్వ | 9,252-35 |
| చేతి నిల్వ | 172-40 |
| మొత్తం | 41,801-70 |

## ఐక్య ఉపాధ్యాయ

### ఆర్థిక నివేదిక 1-10-74 నుండి 31-7-77 వరకు

#### జమ

| | |
|---|---|
| సంవత్సర చందాలు ($8 \times 2064 + 10 \times 9253$) | 1 09,042-00 |
| అర్ధ సంవత్సర చందాలు ($4 \times 24 + 5 \times 198$) | 1 086-00 |
| జీవిత చందాలు ($116 \times 135$) | 15 660-00 |
| సావనీర్లు | 1534-00 |
| ఏజన్సీలు, విడి ప్రతుల అమ్మకము | 3,354-00 |
| అడ్వర్‌టయిజ్‌మెంట్ | 15,470-37 |
| బ్యాంకు వడ్డీ | 990-30 |
| విరాళములు | 151-80 |
| ఇతరములు | 428-51 |
| మొత్తం | 1,47,716-98 |

#### ఖర్చు

| | |
|---|---|
| ప్రయాణ ఖర్చులు | 70,15-15 |
| స్టేషనరీ | 2,040-15 |
| ముద్రణ | 76,704-98 |
| అలవెన్సులు | 14,231-75 |
| తపాలా | 4,227-25 |
| గ్రంథాలయము | 657-00 |
| కార్యాలయము నిర్వహణ అద్దెతో | 1,954-00 |
| ఇతరములు | 201-80 |
| రోనియో మిషన్ | 2500-00 |
| బకాయిలు | 14 959-23 |
| ఫిక్సెడ్ డిపాజిట్లు | 13 800-00 |
| బ్యాంకు నిల్వ | 9,252-35 |
| చేతి నిల్వ | 172-40 |
| మొత్తం | 1,47,716-98 |

తనిఖీ చేసి ధృవపరచడమైనది.

టి. కొండాచారి
వి. సత్యనారాయణరాజు
(ఆడిట్ కమిటీ)

ఎ. వెంకటస్వామి
ప్రధాన కార్యదర్శి

---

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

# ప్రతిపాదించిన శాస్త్రీయ నూతన ప్రత్యామ్నాయ విద్యా విధానం

ప్రస్తుత విద్యా విధానం ఎందుకూ పనికిరానిది.

జీవితానికి ఉపయోగ పడనిది.

ప్రజల ఆశల్ని, అవసరాల్ని తీర్చలేనిది.

దేశాభివృద్ధికి దోహదపడనిది, - కాన ఈ విద్యావిధానాన్ని సమూలంగా మార్చాలి!

—ఈ మాటలు మనవి కావు.

ముప్పయ్యేళ్ళు దేశాన్ని పరి పాలించిన కాంగ్రెసు ప్రభుత్వ అధినేతలవి. మరి ఎవరు ఆ మార్పులు తేవద్దన్నారు? దాని కడ్డుపడిందెవరు?

విద్యావిధానాన్ని దేశప్రయోజనాల కనుగుణంగా ఎవరు మార్చవద్దన్నారు?

అసలు పాలకవర్గాలకు ఆమార్పులు రావడంఇష్టమేనా?

—ఇవన్నీ ప్రజాతంత్ర ఉద్యమం ముందుకు వచ్చిన ప్రశ్నలు. జాతి ప్రగతికి మూలకందమైన ఉపాధ్యాయ వర్గం విద్యావిధానంలో మార్పుల్ని, స్పష్టమైన ప్రత్యామ్నాయ మార్గాన్ని చూపాల్సిన చారిత్రక కర్తవ్యం నేడేర్పడింది.

ఆచర్చల సారాంశమే... వేలాది ఉపాధ్యాయుల అనుభవ సారమే యు.టి యఫ్: ప్రతిపాదించు ఈ ప్రత్యామ్నాయ విద్యా విధానం.

## శాస్త్రీయ నూతన ప్రత్యామ్నాయ విద్యావిధానం

కోట్లాది ప్రజల్ని అజ్ఞానంలో ఉంచటం ... పరిపాలనా యంత్రాంగానికి కావలసిన కొద్దిమంది ఉన్నత విద్యావంతుల్ని గుమాస్తాల్ని తయారు చేసుకోవటం. వలసవిద్యావిధాన ప్రధాన లక్షణం. ఆ విద్యా వ్యవస్థే కొద్ది పై పై మెరుగులతో నేటికి కొన సాగుతున్నది. తత్ఫలితంగా ... ...

—స్వాతంత్ర్యం వచ్చి ముప్ఫయి యేళ్ళయినా ...ఒకే పార్టీ పరిపాలనలో ఉన్నా దేశంలో 70 శాతం జనాభా ఇంకా నిరక్షరాస్యులుగానే ఉన్నారు. అజ్ఞానాంధకారంలో మ్రగ్గిపోతున్నారు.

— '6_14 సంవత్సరాల బడి యీడు వయస్సుగల బాలబాలికలందరికి 10 సంత్సరాలలో నిర్బంధోచిత ప్రాథమిక విద్య లభింపజేయాల'న్న రాజ్యాంగ ఆదేశిక సూత్రం 27 సంవత్సరాలు గడిచినా నెరవేర లేదు.

— పాఠశాలల్లో చేరుతున్న ఆ పిల్లలుకూడా ఒకటో తరగతిలో 100 మంది ప్రవేశిస్తే 5వ తరగతిలోనికి వచ్చేసరికి 40మంది, 8వ తరగతికి25 మంది10వ తరకతికి 8మంది మాత్రమే చేరుకొంటున్నారు. మిగిలినవారు సాంఘిక ఆర్థిక పరిస్థితుల కారణంగా మధ్యలోనే చదువునాపుతున్నారు.

— ఏటేటా అక్షరాస్యుల శాతం కంటే నిరక్షరాస్యుల శాతం పెరిగిపోతున్నది.

— ఆ చదివినవాళ్లుకూడా ఉద్యోగాల కొరకు ఉపాధి కేంద్రాలలో కోటిపదిలక్షలమంది తమపేర్లు నమోదు చేయించుకున్నారు. ఎక్కడజూచినా నిరుద్యోగుల సేనలు కొండవీటి చాంతాడులా పెరిగిపోతూనే వున్నవి.

—పోనీ ఉన్నత విద్యావంతులైనా జాతి ప్రయోజనాల కుపయోగిస్తున్నారా అంటే వేలాది శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు, వైద్యశాస్త్ర పట్టభద్రులు పొట్టచేత్తో బట్టుకొని ఇతర దేశాలకు ఏటేటా వలసపోతూ వున్నారు.

—నేటికి రాజ్యాంగంలో విద్యాహక్కు, పనిహక్కు కల్పింపబడలేదు.

—విద్యావసరాలకు తగిన బడ్జెట్ కేటాయింప బడక పోవటమే కాకుండా కనీసం తాము నియమించిన ఖేర్ కమిటీ సిఫార్సుల్ని, మొత్తం కేంద్రబడ్జెట్‌లో 10 శాతం రాష్ట్ర బడ్జెట్‌లో 30 శాతం విద్యాపద్దుకు కేటాయించాలనేసూచనల్ని పాటించనైనా లేదు.

ఫలితంగా దుర్భర దారిద్ర్యం... అజ్ఞానం... నిరుద్యోగం నిరాశా నిస్పృహలు ...ఆఖరికి ఆత్మహత్యలు ఇది ప్రస్తుత విద్యారంగ విషాదోదంతం.

అయితే పాలకవర్గాలు విద్యా విధానంలో మార్పుల కోసమంటూ ప్రజలకళ్ళనీళ్ళుతుడవటానికి అనేక కమీషన్లను నియమించినయ్. అవి ప్రయోజనకరమైన వివిధ సూచనల్ని కూడా చేసినయ్. కాని యేంలాభం? బడ్జెట్ లేదనే నెపంతో అవన్నీ బుట్టదాఖలాచేయబడినయ్.

ఆ కమీషన్లు సూచించినట్లు విద్యలో పని అనుభవాన్ని సమన్వయించటంగాని, పాఠశాలలు వర్క్ షాపుతో జోడించటంగాని, స్వయం ఉపాధి కల్పించే వృత్తి విద్యలను ప్రాధాన్యతనివ్వటంగాని, సృజనాత్మక శక్తిని అభివృద్ధిపరచి స్వయం శక్తిపై విశ్వాసాన్ని కలిగించే విధానాల నమలుపరచటంగాని, ప్రస్తుత విద్యావ్యవస్థ లక్ష్యాలుగ లేకపోగా తద్వ్యతిరేకంగా బానిసభావాలు దోపిడీ సంస్కృతియెడల అభిమానం, శ్రమైక జీవనంపట్ల అయిష్టత రోజురోజుకి పెరగటం మన కళ్ళముందు దారుణంగా ప్రత్యక్షమవుతున్నాయ్.

కాన ఈ విద్యావ్యవస్థను సమూలంగా మార్చనిదే జాతికి భవిష్యత్తు లేదు. దీన్ని మార్చితీరాలి. **'this should go lock stock and barrel'** దీని స్థానే శాస్త్రీయ నూతన విద్యా విధానం ప్రవేశపెట్టబడాలి.' అని అనేక సంవత్సరాలుగా ఆందోళన జరుగుతున్నదేగాని, జాతికవసరమైన ప్రత్యామ్నాయ శాస్త్రీయ విద్యావ్యవస్థరూపం స్పష్టంగా ప్రజల ముందుంచబడ లేదు ఆ స్థితిలో విద్యారంగంలో క్రియాశీలక పాత్ర వహిస్తున్న ఉపాధ్యాయవర్గంప్రత్యామ్నాయ విద్యావ్యవస్థ స్వరూప స్వభావాలపైనా లక్ష్యాలపైనా తగుచర్చలు జరిపి స్పష్టమైన ప్రత్యామ్నాయ విద్యావిధానాన్ని రూపొందించటం నేడు ప్రధాన కర్తవ్యంగా భావించాలి.

## విద్యారంగ ఆశయం – కర్తవ్యం

దేశ జనాభాలో 62 శాతం ప్రజలు దుర్భర దారిద్ర్యపు టంచుకు దిగువ నున్న స్థితిలో, విద్యా విధానం జాతీయ జీవనంలో ప్రజానీకపు అవసరాలతోను కోర్కెలతోను, మిళితమైనదిగాను, వారి సమస్యల పరిష్కరించేదిగాను ఉండాలి.

కాని సిద్ధాంత పరమైన విజ్ఞానానికి, కేవలం పుస్తక జ్ఞానానికి ప్రాధాన్యత నిచ్చి క్రియానుభవానికి, ప్రాధాన్యత నివ్వక పోవడం వలన ప్రస్తుత విద్యావిధానం మన ప్రజలకు రెండు విభిన్న దృక్పధాలు గల వర్గాలుగ విభజించు తున్నది. అందు వల్ల ప్రత్యామ్నాయంగా శారీరక శ్రమకు మానసిక శ్రమకు మధ్యనున్న వ్యత్యాసాన్ని తొలగించే క్రొత్త విధానం రూపొం దింపబడాలి. మొత్త విద్యారంగంలో ఆధునిక శాస్త్రీయ పద్ధతులు సాంఘిక శ్రమకు తోడుగా నుండేటట్లు సిద్ధాంతపరమైన విజ్ఞానాని కనుగుణమైన ఆచరణకు సంబంధించిన విజ్ఞానాన్ని సంపాదించుటకై విద్యారంగపు ప్రతిముగింపు దశలోను వ్యావసాయిక లేదా పారిశ్రామిక వృత్తి కేంద్రంలో పనిచేసేట్లు అవకాశం కల్పించబడాలి. దేశంలో అత్యధిక మెజారిటీగా నున్న కష్టజీవుల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక స్థితిగతులలో అభివృద్ధి సాధించే ప్రజాతంత్ర శాస్త్రీయ విద్యావిధానం కావాలి.

ప్రజాతంత్ర శాస్త్రీయ విద్యావిధానవు లక్షణాలు

1. రాజ్యాంగంలో విద్యాహక్కు కల్పించబడటం.

2. విద్యా పరిధిలో అన్ని వర్గవిభజనల రద్దు

3. విద్యార్థులలో శాస్త్రీయ పరిశీలన, న్యాయాన్యాయాల విచక్షణాజ్ఞానం నిశిత మేధాసంపత్తిని పెంపొందించటం, ఉత్తేజకరమైన ఆసక్తిని కలిగింపజేయడం శాస్త్రీయమైన మత రహిత ప్రజాస్వామిక దృక్పధాన్ని పెంపొందించడం.

4. విద్యార్థులకు ఉద్యోగావకాశాలను గ్యారంటీ చేస్తూ వారికున్న ప్రజ్ఞా ప్రతిభలను ప్రజల ప్రగతికి జాతీయోత్పత్తిచే తోడ్పడేట్లు చెయ్యడం.

5. ప్రతిపౌరుడు సమాజంలో నాగరికమైన పౌరుడుగా జీవించే లక్షణాలనభివృద్ధి చేయడం.

పై లక్షణాల కనుగుణంగా విద్య
ఈ క్రింది విధంగా రూపొందించబడాని.

ఎ) 6-15 సంవత్సరాల మధ్యవయస్సుగల పిల్లలందరికీ పది సంవత్సరాల పాటు ఉచిత నిర్బంధ విద్యా విధానాన్ని ప్రవేశ పెట్టాలి. అందులో 7 సంవత్సరాల ప్రాథమిక విద్యను 1982 కల్లా అమలు జరపాలి.

బి) ప్రాథమిక విద్యానంతరం కోరిన విద్యార్థులకుకోరిన అంశాలపై 2, 3 సంవత్సరాల వృత్తి విద్యా శిక్షణ నిచ్చేందుకు తగినన్ని కేంద్రాలను ఏర్పరచాలి.

సి) 10 సం॥ సెకండరీ విద్యానంతరం వృత్తి విద్యా శిక్షణకు అవకాశం కల్పించాలి. ప్రతి విద్యార్థికి ఉపాధి అవకాశం కల్పించాలి.

డి) 10 సం॥రాల సెకండరీ విద్యా నంతరము 2 సం॥రాల సన్నాహక దశయుండాలి ఈ దశలో వృత్తి సాంకేతిక విద్యాకోర్సులను జోడించాలి ఏదో ఒక విషయంపై స్పెషలైజేషన్ కోర్సుగ యుండాలి, ఇదిప్రస్తుతమున్న ఇంటర్మీడియట్ కోర్సుకు భిన్నంగా ఉంటుంది. ఈ దశలో ముగింపు చేయదల్చుకున్న విద్యార్థికి ఉపాధిలభించే అవకాశముండాలి.

ఇ) 2 సం॥రాల సన్నాహక దశ తర్వాత స్పెషలైజేషన్ కోర్సు 3 సం॥రాలపాటు ఉండాలి. పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులు 2 సం॥లుండాలి. అంటే కొఠారి కమీషన్ సూచించిన 10+2+3 విద్యా విధానం దేశమంతటా ఒకేరీతిగ ప్రవేశపెట్టాలి.

యఫ్) దేశమంతటా వయోజన విద్యా కేంద్రాలను తెరచి 5 సంవత్సరాలలో నిరక్షరాస్యతను రూపుమాపాలి. ఒక పెద్ద ప్రజా ఉద్యమంగా దీనిని చేపట్టాలి. విద్యాగంధ శూన్యులైన శ్రామికులకు ప్రోత్సాహాన్ని కల్గించేచర్యలు తీసుకోవాలి.

## తీసికొనవలసిన చర్యలు

1. ప్రభుత్వం అన్ని మేనేజిమెంట్లక్రిందగల విద్యా సంస్థలను స్వాధీనం చేసుకొని అన్ని దశలలోను ప్రజాతంత్ర శాస్త్రీయ విద్యా విధానాన్ని ప్రవేశ పెట్టాలి.

2. ప్రజలందరికీ సమానావకాశాలుకల్పించుటకై ఒకే విద్యా విధానాన్ని అన్ని దశలలోను ఏర్పాటు చేయాలి. సమాజంలోనున్న వివిధవర్గాల అవసరాలు ఏర్పడిన పాఠశాలలోను, కళాశాలలలోను వర్గవ్యత్యాసాలను రద్దు చేయాలి.

3. అన్ని ప్రాథమిక పాఠశాలలను 7సంవత్సరాలపాటు విద్య గరిపే పాఠశాలలుగ మార్చాలి.

4. ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యావకాశమునుండి తప్పిజారిపోయిన బాల బాలికలకు పూర్తికాలపు లేక కొంతకాలపు విద్యకుసదుపాయాలు కల్పించాలి (నాన్ ఫార్మల్)

5. పూర్తికాలపు కోర్సును ఉపయోగించుకొన వీలులేని వారికి తమ విజ్ఞాన స్థాయిని పెంపొందించుకొనగోరే వారికి, రాత్రి పాఠశాలలు, కరస్పాండెన్సు కోర్సులు ప్రవేశపెట్టాలి.

6. చదువు ముగించిన ప్రతివిద్యార్థికి ఉద్యోగం కల్పించాలి, లేదా నిరుద్యోగ భృతి చెల్లించాలి.

7. సాంకేతిక శిక్షణాలయాలనూ, వృత్తి విద్యా శిక్షణాయాలమూ, వ్యవసాయిక సంస్థలలో శిక్షణావకాశాలనూ విస్తృత పర్చాలి.

8. సంక్షిప్త వైద్య విద్యాకోర్సులను ప్రవేశపెట్టి ఎక్కువ మందికి శిక్షణ కల్గించి అత్యధికంగాయున్న గ్రామీణ పేద ప్రజలకు సేవజేసే అవకాశం కల్పించాలి.

9. పేద విద్యార్థులకు పై చదువులకు అవకాశంకల్పించుటకై ఉచిత విద్యావకాశం కల్పించడమే గాక ప్రత్యేకమైన స్కాలర్‌షిప్పుల నివ్వాలి.

10. ప్రాథమిక సెకండరీ, కాలేజీ, యూనివర్శిటీలలో పనిజేసే ఉపాధ్యాయులందరికీ దేశవ్యాపితంగా ఒకే రీతిలో నుండేటట్లుగ శాస్త్రీయ ప్రాతిపదికపై సముచితమైన జీతాలు, వృత్తిభద్రత, సంక్షేమ సౌకర్యాలు కల్పించాలి.

11. పై అంశాల అమలు కవసరమైన ప్రజాతంత్ర యంత్రాంగం స్వయం పాలనాధికారం గల విద్యాబోర్డులు నెలకొల్పాలి. ఉత్తరప్రదేశ్‌లో మాదిరి అటానమస్ బోర్డ్సు ఆఫ్ ఎడ్యుకేషన్ ఏర్పరచాలి. అదితల్లిదండ్రుల ఉపాధ్యాయుల ప్రభుత్వ ప్రతినిధులతో కూడినదై యుండాలి.

12. దేశంలోవున్న విభిన్న భాషలు మాట్లాడే ప్రజలను జాతులను వాస్తవదృష్టిలో నుంచుకొని మన రాజ్యాంగపు ఫెడరల్ స్వభావాన్ని పరిరక్షిస్తూ రాష్ట్రాలకు వీలైనంత ఎక్కువ స్వయం పాలనావకాశాలిచ్చినపుడే ప్రజలకవసరమైన ఆయా భాషా సంస్కృతులభివృద్ధి కవసరమైన విద్యావకాశా

లను కల్పించగలదు అందువలన విద్యరాష్ట్రప్రభుత్వ అధీనంలో ఉండాలి. 42వ రాజ్యాంగ సవరణ ద్వారా విద్యను ఉమ్మడి జాబితాలో చేర్చినదానిని రద్దుచేయాలి.

13. ప్రాథమిక దశనుండి యూనివర్శిటీ దశవరకు మాతృభాషలోనే విద్యాబోధన జరగాలి. త్రిభాషా సూత్రాన్ని రద్దుచెయ్యాలి.

## సిలబస్

ప్రాథమిక, సెకండరీ, కాలేజీ, యూనివర్శిటీ అన్ని రంగాలలోను ప్రస్తుతమున్న కాలంచెల్లిన భావాలను ప్రచారం చేసే సిలబస్‌ను మార్చాలి. మూఢ విశ్వాసాలకు వ్యతిరేకమైన హేతుయుక్తమైన, శాస్త్రీయ భావాలతో కూడిన అన్ని దశలకూ జాతీయస్థాయిలో ఒకే సిలబస్‌ను ప్రవేశపెట్టాలి. ప్రజాభిప్రాయ సమీకరణకు పాతసిలబస్‌లోని లోపాలను, కొత్త సిలబస్‌లోని ఔన్నత్యాన్ని గురించి నచ్చచెప్పాలంటే పూర్తి వివరణతోకూడిన సిలబస్‌ను ప్రజలముందుంచాలి. అందుకు చాలా శ్రమ, కాలం అవసరం అందుచేత స్థూలంగా ఈ క్రింది వివరణ ఇస్తున్నాము.

## ప్రాథమిక విద్య

5-12 సం॥ల వయస్సులోవున్న పిల్లలందరూ ఈ విధమైన విద్యకు అర్హులవుతారు. వారీ క్రింది విషయాలు నేర్చుకుంటారు.

1. వారి మాతృభాషలో మంచిపరిజ్ఞానం. ఈ స్థాయిలో రెండవ భాషను ప్రవేశపెట్టకూడదు.

2. అర్థమాటిక్స్‌లోను, కొంతవరకు మోడరన్ మాథమాటిక్స్‌లోను ప్రాథమిక విజ్ఞానం.

3. భారతదేశచరిత్ర, వివిధ యుగాలలోని సమాజ పరిస్థితులు, ఉత్పత్తి సాధనాల అభివృద్ధి, ప్రభుత్వానికి సాంఘిక సాంస్కృతిక విధానాలకు మధ్యవున్న సంబంధం, రాజులకు పరిపాలకులకు తక్కువ ప్రాధాన్యతనిస్తూ ప్రజలకు ఎక్కువ ప్రాధాన్యతయిస్తూ విద్యగరపడం. జాతీయ అంతర్జాతీయ శ్రామికులలో సంఘీభావం కల్పించే రీతిగా దేశచరిత్రను బోధించడం.

4. ప్రధానంగా ఆయా రాష్ట్రాలకు సంబంధించిన భౌగోళికాన్ని, భారతదేశభౌగోళికాన్ని, ప్రపంచభౌగోళికాన్ని ఒక ప్రాథమిక పరిజ్ఞానంతో భౌగోళిక శాస్త్రాన్ని రూపొందించడం.

5. ప్రాథమిక విజ్ఞాన శాస్త్రాల్ని బోధించాలి.

6. కళలైన సంగీతం, చిత్రలేఖనం మొదలగువాటిలో బోధనా, ఆటలు, వ్యాయామం ఒక పరిపూర్ణ విద్యార్థిగా తయారుకావడానికి తోడ్పడ్తాయి.

7. ప్రాథమిక పౌరశాస్త్రం, భారతదేశ పౌరుని హక్కులు.

8. ప్రాథమిక శుభ్రత మరియు ఆరోగ్యరీతులు.

9. శ్రమానుభవం : శ్రమానుభవానికి ప్రత్యేక తరగతులను ఏర్పాటుచేయడం ద్వారా శారీరక శ్రమయందు గౌరవం, విలువ, విద్యార్థుల మేధస్సులలో గుర్తించబడుతాయి. మొదటి సంవత్సరాలలో పిల్లలను శారీరక శ్రమచేయడానికి ప్రోత్సాహమివ్వాలి.

ఉదాహరణకు మొక్కలకు నీరుపోయడం, జంతువులకు మేతవేయడం, బొమ్మలు తయారుచేయడం, పరిసరాలనుశుభ్రం చేయడం, బీరువాలలో పుస్తకాలను సర్దడం మొదలయినవి.

పిల్లల జ్ఞానం, నేర్పు పెరిగినకొలది వారికి పనిముట్లిచ్చి పనిచేయించవచ్చు. శారీరక శ్రమజరిగే ప్రాంతాలయిన పొలాలకు, ఫ్యాక్టరీలకు పిల్లలను తీసుకువెళ్ళి చూపించవచ్చు. ఈ కార్యక్రమమంతా సిలబస్‌లో భాగంగా గుర్తించి కొన్ని పిరియడ్స్ కేటాయించాలి.

ప్రాథమిక విద్య పూర్తయిన వారంతా రెండు మూడు సంవత్సరాల పాటు వృత్తి తర్ఫీదు కేంద్రాలలోగాని, లేక సెకండరీ పాఠశాలలోగాని వారు గడపవలసి వుంటుంది వృత్తి తర్ఫీదు కేంద్రాలలో శిక్షణపొందిన వారికి ఉద్యోగాలుచూపించాలి. సెకండరీ విద్యను పూర్తిచేయదలచుకున్న వారికి పూర్తి సౌకర్యాలు కల్పించాలి. అది సగం పని-సగం చదువు పద్ధతి మీదగాని పనితరువాత చదువు-అనే పద్ధతిమీదగాని జరగాలి. ఆ విధంగా వారు సెకండరీ విద్యను పూర్తి చేస్తారు.

## సెకండరీ విద్య

మూడు సంవత్సరాల సెకండరీ విద్యా కాలంలో ఈ క్రింది విషయాలు బోధించ బడతాయి.

1. మాతృ భాష.

2. అతని ఇష్టానుగుణంగా రెండవభాష. ఇదిసిలబస్‌లో నిర్బంధంగాదు.

3. లెక్కలు

4. ఫిజికల్ సైన్స్‌లో కెమిస్ట్రీ, ఫిజిక్సు చివరి రెండు సంవత్సరాలలోనూ వేర్వేరుగా బోధించబడతాయి.

5. జీవశాస్త్రంలో వృక్షశాస్త్రం. జంతుశాస్త్రం మానవ దేహనిర్మాణ శాస్త్రం వుండాలి.

పరిణామ సిద్ధాంతం, పరిమిత భూగర్భశాస్త్రం - ఇది భూమి ఎలా ఏర్పడిందనే దానికి తోడ్పడుతుంది. ఎలిమెంటరీ ఫిజిక్సుకు సంబంధించిన ప్రాథమిక సూత్రాలు (ఉదాహరణకు: అణువుయొక్క రూపం, మానవుడు మానవ సమాజ పరిణామం మొదలగునవి 4, 5 లలో చేర్చాలి.)

6. భౌగోళిక శాస్త్రము మరియు ప్రపంచ చరిత్ర (వర్గ సమాజాల పరిణామం పెట్టుబడిదారీ, సోషలిస్టు దేశాల గురించి ఆర్థిక విశేషాలు ప్రధానంగా నొక్కి చెప్పాలి. ప్రధానంగా భారత దేశం గురించి చెప్పాలి. ప్రపంచంలోనున్న రెండు ప్రధానమైన ఆర్థిక వ్యవస్థల గురించి ప్రాథమిక విజ్ఞానం వుండాలి.

7. పౌరశాస్త్రం మరియు సాంఘిక శాస్త్రం.

8. శారీరకశ్రమ, సాంఘిక సేవ.

సెకండరీ విద్య ముగింపుతో సాధారణమైన విద్యను విద్యార్థి పూర్తి చేసినట్లవుతుంది. యూనివర్శిటీ చదువులకు అర్హతలున్న వారికితప్ప మిగతావారి నందర్నీ వివిధ ఉద్యోగాలలో రెండుమూడేండ్ల తర్ఫీదుకొరకై తీసుకొనబడాలి. వారికి ఉద్యోగావకాశాలు కల్పించేంతవరకు నిరుద్యోగ భృతి యివ్వబడాలి.

## + 2 లేక సన్నాహకదశ

వివిధ విద్యాదశలలో +2 విద్యాదశ చాల ప్రాముఖ్యం

గలిసది. ఈ దశలో అకడిమిక్ కోర్సులతో ఒకేషనల్, సాంకేతిక కోర్సులను జోడించాలి. యూనివర్సిటీ విద్యవరకు, లేదా సాంకేతిక డిగ్రీ కళాశాలలలో తమ విద్యను కొనసాగించుటకు ఇది సన్నాహకంగా ఉపయోగపడాలి. ఒకవేళ చదువు కొనసాగించలేని పరిస్థితులలో స్థిరపడడానికి అవసరమైన వృత్తి లేదా సాంకేతిక నైపుణ్యం సంపాదించగల్గిన స్థితిలోయుండాలి. మాతృభాషలోనే విద్యా బోధన జరగాలి. ఐచ్ఛికంగా మరొక భాషను నేర్చుకొనడానికి అవకాశం కల్పించవచ్చును. పారా మెడికల్, పారా ఇంజనీరింగ్, వ్యవసాయ, ఫార్మసీ, ఎలక్ట్రికల్, కమ్మర్షియల్ ప్రాక్టీస్, కేటరింగ్, ఫుడ్ టెక్నాలజీ, డ్రాఫ్ట్సమన్ డ్రెస్ మేకింగ్ వగైరా వృత్తిసంబంధమైన సాంకేతికమైన కోర్సులను ప్రవేశపెట్టాలి. అకడిమిక్ నుండి ఒకేషన్లకు పరస్పరము అవగాశం కల్గించాలి.

## యూనివర్శిటీ విద్య

విభిన్న విజ్ఞాన పరిధిలో విభిన్న విషయాలకు సంబంధించి స్పెషలిస్టులను దేశ ఆర్థిక విధానానికి అనుగుణంగా తయారు చేయడమే యూనివర్శిటీ విద్య లక్ష్యం. దీని కోసం సెకండరీ విద్యను పూర్తి చేసిన వారు, యూనివర్శిటీలో ప్రవేశానికి అర్హులుగా ఉంటారు. ఉద్యోగానుభవమున్న వారికి ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

యూనివర్శిటీలో ప్రవేశానికి షెడ్యూలు కులాలకు, తెగలకు, ఇతరత్రా వెనుకబడిన తరగతుల వారికి కొంతశాతంసీట్లు కేటాయించాలి. ఈ విధంగా మిగతావారి స్థాయి నందుకునేందుకు వారికి అవకాశం కల్పించాలి.

అతనికి దేనిలో విస్తృత పరిజ్ఞానంవున్నదో ఆ సబ్జక్టుకు, ఆ అంశాలకు సంబంధించినవి సిలబస్‌గా వుంటాయి. సాధారణంగా డిగ్రీకోర్సు మూడు సంవత్సరాలు, పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సు రెండు సంవత్సరాలు మొత్తం 5 వంత్సరాల కాల పరిమితిలో అతను లేక ఆమె ఒక ప్రధానమైన సబ్జక్టులో విస్తృతమైన విజ్ఞానాన్ని సంపాదించాలి. ఆ సబ్జక్టును ఆధారం చేసుకొని తనవిజ్ఞానాన్ని పెంపొందించుకోవాలంటే ఆయాసబ్జక్టుతో సంబంధమున్న ఇతర శాస్త్రాలనుకూడ చదవవలసి వుంటుంది. ప్రస్తుతం డిగ్రీ తరగతులలో వున్నమాదిరిగా కాకుండా లాంగ్వేజెస్ ఈ దశలో నిర్బంధంకావు. స్పెషలైజ్డ్ కోర్సులు చదవడానికి కొన్ని సందర్భాలలో లాంగ్వేజి అవసరమైనప్పుడు ఆ సిలబస్‌లో భాగంగా లాంగ్వేజి వుంటుంది. లాంగ్వేజెస్ మీద అభిలాషవున్న వ్యక్తులు ఏదో ఒక లాంగ్వేజిని స్పెషల్ సబ్జెక్టు క్రింద తీసుకొనవచ్చును. డిగ్రీకోర్సులకు చెందిన వివిధ సబ్జెక్టులకు సిలబస్‌ను ఇంకా పరిశోధించి తయారుచేయవలసి వున్నది.

ఒక రాష్ట్రంలో పనిచేయాలనుకున్న ఇంకొక రాష్ట్ర వ్యక్తులకై, కొందరి వ్యాపారావసరార్థం, ప్రభుత్వం ఇతర ఉద్యోగులవసరార్థం వారు ఆ రాష్ట్రంలోని భాష నేర్చుకొనడానికి వీలుగా పరిమితకాలపు కోర్సులతోవుండే భాషా సంస్థలను ఏర్పాటుచేయాలి.

## పరీక్షావిధానంలో జరగవలసిన మార్పులు

పరీక్షలు జరపడంలో ప్రధానంగావున్న ఉద్దేశాలు

1. పై తరగతులకు విద్యార్థులను ఉత్తీర్ణులనుచేయు సందర్భంగా విద్యార్థులు స్థాయిని అంచనా వేయటం.
2. ఆదేవిధంగా విద్యార్థి ఏ సబ్జెక్టులో లేక ఏ అంశంలో వెనకబడియున్నాడో గమనించి తదనుగుణంగాతగుసమయంలో ఈ బలహీనతను ది ఆ విద్యార్థిని అభివృద్ధి చేయడం.

ఆ విధంగా పరీక్షలయొక్క ఉద్దేశ్యం విద్యార్థికి సహాయకారిగాను, ఉత్తేజ పరిచేదిగాను విద్యాస్థాయి అభివృద్ధికిదోహదకారిగాను ఉండాలిగాని పై తరగతికి ఉత్తీర్ణులగుటకు ఇదియొక గుదిబండగా తయారుకారాదు.

అందువలన విద్యార్థులు పరీక్షలో తమ అర్హతలను మరియొకసారి నిరూపించుకొనుటకు విస్తారమైన అవకాశాలు కల్పించే పరీక్షా విధానాన్ని రూపొందించాల్సిన అవసరం ఎంతయినావుంది.

ఈ విధమైన అవకాశాలు కల్పించడం మూలంగా విద్యార్థులకు పైతరగతులకు పోవులకు, డిగ్రీలు, సర్టిఫికెట్లు పొందుటకుగల అవకాశాలు పెరుగుతాయి.

సాధారణంగా వ్రాత పరీక్షలద్వారా పరీక్షించడం జరగాలి. అయితే ఏ విద్యార్థి అయినా తన అభిప్రాయాలు పూర్తిగా వ్రాతమూలంగా వ్యక్తం చేయలేని యెడల నోటి ప్రశ్నలద్వారా (ఓరల్ టెస్టు) పరీక్షించే అవకాశంకల్పించాలి. కాని యీ విధమయిన అవకాశం (ఓరల్ టెస్టు) విద్యార్థిపై

తరగతికి ఉత్తీర్ణుడగుటకు ఉపయోగపడాలేగాని అతనిని అనర్హుడను చేయుటకుగానీ, అభివృద్ధికి ఆటంకం కలిగించే విధంగా గాని ఉండరాదు.

ప్రస్తుతమున్న ఏ పాఠ్యాంశాని కాపాఠ్యాంశంలో పరీక్ష జరిపే పరీక్షా విధాన స్థానంలో విద్యార్థులు ఏ ఏ సబ్జెక్టులలో పరీక్షలు వ్రాయుటకు సిద్ధంగా ఉన్నారో ఆ పరీక్షలకు హాజరగు పద్ధతికి అవకాశం కల్పించాలి. ప్యాకేజ్ సిస్టం ఆఫ్ ఎగ్జామినేషన్స్ సర్టిఫికెట్లు-డిగ్రీలు ఆ విధంగా ఆయా సబ్జక్టులకు అనువైన ఉద్యోగాలను వారు హక్కుగాకోరుటకు వీలవుతుంది:

ప్రత్యామ్నాయపరీక్షా విధానంలో ఈ క్రింది విషయాలు సూచించడమైనది.

1. ప్రతి విద్యార్థి ప్రత్యేక శ్రద్ధవహించి పై విధంగా విద్య నేర్చుకొనటానికిగాను ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తి ప్రాథమిక స్థాయిలో 1:20 సెకండరీ స్థాయిలో 1:30 కి మించరాదు.

2. కాలేజీ, యునివర్శిటీ స్థాయిలలో విద్యార్థులకు నిర్బంధంగా ప్రత్యేక అధ్యయన క్లాసులు జరపాలి.

3. నిర్ణీత సమయాలలో పరీక్షలు ప్రాథమిక, సెకండరీ, కాలేజీ, యూనివర్శిటీ స్థాయిలలో జరపడం ద్వారా విద్యార్థి యొక్క అభివృద్ధిని పరీక్షించి బలహీనతలను తొలగించుటకు వీలు ఏర్పడుతుంది.

4 సంపూర్ణ పరికరాలు కలిగినప్రయోగశాలలు ఏర్పచాలి.

## 1. ప్రాథమిక వార్షిక పరీక్షలు

ఎ) ప్రాథమిక విద్యాదశలో అనగా 7వ తరగతి చివరి భాగంలో ఒక వార్షిక పరీక్ష జరగాలి.

బి) విద్యార్థులు సిలబస్‌లోవున్న అన్నిపాఠ్యాంశాలలో ఉత్తీర్ణులు కావాలి.

## 2. సెకండరీ విద్యలో పరీక్షా విధానం

ఎ) 3 సంవత్సరాల సెకండరీ విద్య(8నుండి 10 వరకు) చివర పబిక్ పరీక్ష వుండాలి.

బి) ఈ పబ్లిక్ పరీక్షలు దేశం మొత్తంగా ఒకేపద్ధతిలో వుండాలి. అవి వికేంద్రీకరణద్వారా అమలుజరపాలి. మరియు ఇంటర్నల్ పరీక్షాధికారులు ఇతర పరీక్షాధికారులపై కూడా ఆధారపడి ఉండాలి.

సి) విద్యార్థులు ఆ తరగతిలోని మొత్తం సబ్జక్టులో ఉత్తీర్ణులవ్వాలి.

డి) ప్రాథమిక వార్షిక పరీక్ష ప్యాసయిన విద్యార్థులు ఉద్యోగాలలో చేరుటమూలంగా సెకండరీ విద్యావకాశాలను కోల్పోకుండా వారు ఒకనిర్ణీత పద్ధతిలో సెకండరీ విద్యవార్షిక పరీక్షలకు హాజరగు అవకాశం కల్పించాలి. వారికి దీనికోసమై ప్రత్యేకంగా సెకండరీ విద్యలో వార్షిక పరీక్షలు జరపాలి.

ఇ) విద్యార్థులకు కొన్ని సబ్జక్టులో మంచి పరిజ్ఞానం ఉండి మరికొన్ని సబ్జక్టులో తప్పినట్లయితే వారికి పరిజ్ఞానం వున్న సబ్జక్టులో పై చదువులకు అవకాశం ఇవ్వాలి.

## కాలేజీలు, యూనివర్శిటీలలో వార్షిక పరీక్షలు

ఎ) డిగ్రీస్థాయిలోను పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయిలోను వార్షిక పరీక్షలు ప్రతిసబ్జక్టులోను జరపాలి. ఆ విధంగా ఒక సంవత్సరకాలానికి చెందిన సబ్జక్టును కొన్ని భాగాలుగా విభజించి ఆ సంవత్సర కాలంలోపల కొన్ని నిర్ణీత సమయాలలో ఆ భాగాలకు పరీక్షలు జరపడంద్వారా తను ఉత్తీర్ణుడైన భాగాలకు విద్యార్థి మరల పరీక్షలు వ్రాయవలసిన అవసరం వుండదు. అంతేగాక విద్యార్థి అన్ని సబ్జక్టులలోను మొత్తం ఒకేసారి పరీక్షవ్రాసి ఉత్తీర్ణుడవ్వవలసిన అవసరం వుండదు. వంతుల వారీగా కొన్ని పేపర్లు పాస్ అవుతూ ముందుకుపోవచ్చు.

బి) డిగ్రీకోర్సులను, పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులను కాలేజీలలో చదువుటకు అవకాశంలేని విద్యార్థులకు ప్రయివేటుగా కోర్సులను చదువుటకు అవకాశం కలిగించాలి. వీరికి కరెస్పాండెంట్ కోర్సులను ఏర్పాటుచేయాలి. వారికి వార్షిక పరీక్షలు, కాలేజీ విద్యార్థులతోగాక వేరుగా ఏర్పాటుచేయాలి. వీరికి కాలేజీ విద్యార్థుల వలె పేపరు తరువాత పేపరు, సబ్జక్టు తర్వాత సబ్జక్టు ఉత్తీర్ణులగుటకు, తప్పిన పరీక్షలు తరువాత జరుగు వార్షికపరీక్షలలో పూర్తి చేయుటకు అవకాశం కల్పించాలి.

సి) వార్షిక పరీక్షలేకుండా, స్కూళ్ళలోను, కాలేజీల్లోను, యూనివర్శిటీల్లోను, అప్పుడప్పుడు ఆయా విద్యాసంస్థలు కూడా పరీక్షలు నిర్వహించాలి.

## 4. పరీక్షాపత్రాలు ఉండవలసిన పద్ధతి

ప్రాథమికవిద్యనుండియూనివర్శిటీవిద్యవరకు ప్రతివార్షిక పరీక్షలలోను పరీక్షాపత్రాలు ఎక్కువ ప్రశ్నలతో దాదాపు పూర్తి సబ్జక్టునంతా ప్రతి బింబించునట్లుండాలి. ఇలా వుండడం మూలంగా విద్యార్థి విషయాన్ని ఎంతవరకు గ్రహించాడు. ఏ మేరకు సబ్జక్టులోని ముఖ్యమైన విషయాలను గుర్తించాడు. వారి విచక్షణాశక్తి ఎంత. అని పరీక్షించుటకు వీలగుతుంది. ఇదేవిధంగా ప్రయివేటు (ఎక్స్టర్నల్) మరియు కరస్పాండెన్సు కోర్సు విద్యార్థులకు ప్రశ్నా పత్రాలను తయారు చేయవచ్చు. విద్యార్థులు అన్ని ప్రశ్నలకు సమాధానాలు రాయాల్సి వుంటుంది.

## 5. ఉత్తీర్ణులగుటకు అవసరమైన మార్కులు

విద్యయొక్క అన్నిస్థాయిల్లోను, ఉత్తీర్ణతకు అర్హత సంపాదించుటను సమానమయిన మార్కులుగాని దానికి సమానమయిన గ్రేడుగానీ విద్యార్థుల అతితక్కువ గ్రహణశక్తిని

సూచిస్తాయి. ఆ పైన వచ్చిన మార్కులుగానీ గ్రేడులుగానీ ఆ విద్యార్థికి ఆ సబ్జక్టులోవున్న లోతుని అవగాహననూ నిరూపిస్తాయి. పై చదువులకు, ఉద్యోగాలకు విస్తృతమయిన అవకాశాలు వున్నట్లయితే గ్రేడింగు పద్ధతి అవసరమయినదీనూ, కోరదగినదీనూ.

## 6. పరీక్షలను నిర్వహించుట

వారి శక్తికిమించిన కారణాలవల్ల పరీక్షకు హాజరుకాలేని విద్యార్థులకు ఆ పేపరులోగానీ, ఆ పేపర్లలోగానీ, మళ్ళీ పరీక్షలు వ్రాయుటకు అవకాశం కల్గించాలి.

## 7. పరీక్షా ఫలితాల ప్రచురణ — మరలా తిరిగి పరీక్షలు పెట్టుట

ఎ) పరీక్షా ఫలితాలు ఒక మాసంలోగా ప్రకటించాలి.

బి) ఏ విద్యార్థయినా తను అనుకొన్న సబ్జెక్టులలో తప్పినా, లేక అనుకొన్న ఫలితాలను సాధించలేకపోయినా, పేపరులోగానీ, కొన్ని పేపర్లలోగాని తిరిగి తమ పేపరు పరీక్షించుటకు అనుమతికోరవచ్చు. ఆ పేపర్లు విద్యార్థి యొక్క ప్రతినిధుల సమక్షంలో పరీక్ష చేయబడాలి. తప్పిన విద్యార్థి కైనట్లయితే ప్యాస్ మార్కులతో పాసయిన విద్యార్థి యొక్క సమాధాన పత్రాలతోను తక్కువ మార్కులు వచ్చాయని భావించి ఆరోపణచేసిన విద్యార్థి సమాధానపత్రాలను, కుడియెడం కాగా అదే మార్కులు వచ్చిన మరో విద్యార్థి సమాధాన పత్రాలతోను పోల్చిచూడాలి. ఈ విధంగా చేయడం వలన ఆరోపణ చేయబడిన విద్యార్థికి ఏమయిన అన్యాయం జరిగిందా అన్న విషయం పరిశీలించవచ్చు.

## వేతనాలు — వానికి సంబంధించిన విషయాలు

విద్యార్థులు ఏ సబ్జక్టులో వెనుకబడి వున్నారో గ్రహించి వారు ఆసబ్జక్టులలో పైతరగతులలోనికి ఉత్తీర్ణులగుటకు అవసరమైన పరిజ్ఞానం వారికి చేకూర్చే బాధ్యత ఉపాధ్యాయుల మీద వుంటుంది.

ఈ లక్ష్యసాధనానికి కావలసిన సౌకర్యాలు ఏర్పరచడానికి, అందుకు ఎటువంటి అవాంతరాలు కలుగకుండా చూడటానికి అధికారులను ఒప్పించే నిమిత్తం ఉపాధ్యాయులంతా ప్రజాస్వామ్య ఉద్యమంలో చేరవలసి వుంటుంది.

నేడు ఉపాధ్యాయుల వేతనాలు ప్రాథమిక, విశ్వ విద్యాలయ శ్రేణులలో ఉన్న అత్యధికంగావున్న తేడాలే గాక, రాష్ట్రాల మధ్య వేతనానికి ఒకే రాష్ట్రంలోవుండే ప్రభుత్వ ప్రైవేటు విద్యాసంస్థలమధ్య వేతనాలకుతేడాలున్నాయి దీనితో పాటు వేతనాలలో వచ్చిన ఏ కొద్ది మార్పు అయినావుంటే అది నిత్యమూ పెరుగుతున్న ధరలతో కొట్టుకుపోయింది. అంతేగాక వుద్యోగ భద్రత తీవ్రతరమయిన సమస్యగా వుంది.

ప్రజాస్వామ్య శాస్త్రీయ పద్ధతులలో తేదలచుకున్న ఏ సంస్కరణ ఐనా విజయం పొందాలన్నా ఉపాధ్యాయులకు కనీస జీవనానికి సరిపడు వేతనాలు ఉండాలనీ అంగీకరించబడింది.

ఉపాధ్యాయులకు వుండవలసిన ఆశయాన్నే కలిగించడానికి ఇది అవసరం.

ఉపాధ్యాయుల వేతనాల విషయంలో ప్రైమరీ విద్యకు కావలసిన అధిక సౌకర్యాలు కలిగించడంలాంటి సంస్కరణలను ప్రవేశపెట్టడానికి కావల్సిన వాటిని ఆయత్తము చేసుకునే సమస్య పరిగణించవలసి వున్నది. అందుకు సరిపడే పథకాలను చేపట్టాలి.

వివిధ శ్రేణులలోవున్న ఉపాధ్యాయుల మధ్య ఇప్పుడు విపరీతమైన తేడాలను అంతరింపచేసి ఒక నిర్ణీత నిష్పత్తిలో నిర్ణయించాలి. ఈ విధంగా దేశమంతా ఒకేరకమైన, సమానమైన వేతనాల స్కేళ్ళను అమలుపర్చాలి. యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ మాదిరిగా సెకండరి మరియు ఎలిమెంటరీ ఎడ్యుకేషన్ గ్రాంట్సు కమీషను ఏర్పరచి పాఠశాలల భౌతిక పరిస్థితుల, ఉపాధ్యాయుల జీవన పరిస్థితుల అభివృద్ధికి, సంక్షేమానికి కృషిచేయాలి.

ఇట్లు,

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్.

## సంఘ సభ్యత్వ-పత్రిక వివరాలు

| జిల్లా | సభ్యత్వము 1974 | 1975 | 1976 | 1977 | ఐక్య ఉపాధ్యాయ చందాలు | జీవిత చందాలు |
|---|---|---|---|---|---|---|
| విశాఖ | — | 111 | 250 | 400 | 97 | 1 |
| తూ॥ గో॥ | 3000 | 3300 | 3500 | 4500 | 1009 | 26 |
| ప॥ గో॥ | 1500 | 2022 | 2050 | 2800 | 585 | 51 |
| కృష్ణ | 500 | 900 | 697 | 1100 | 472 | 4 |
| గుంటూరు | 700 | 1112 | 1900 | 2600 | 510 | 13 |
| ప్రకాశం | 300 | 800 | 1330 | 1700 | 414 | 7 |
| నెల్లూరు | 500 | 1300 | 1400 | 1825 | 393 | 6 |
| చిత్తూరు | — | — | — | 2000 | 87 | — |
| కర్నూలు | 500 | 500 | 100 | 410 | 27 | — |
| అనంతపురం | — | — | — | 100 | 26 | — |
| ఖమ్మం | — | 550 | 900 | 1100 | 609 | 13 |
| వరంగల్లు | — | 100 | 400 | 700 | 210 | 1 |
| నల్గొండ | — | 100 | 234 | 400 | 107 | 5 |
| నిజాంబాదు | — | 54 | 144 | 100 | 271 | 6 |
| మ॥ నగర్ | — | 60 | 25 | 330 | 173 | 1 |
| హైద్రాబాద్ | — | 65 | 82 | 84 | 67 | — |
| మెదక్ | — | — | — | 23 | 10 | — |
| ఇతరాలు | — | — | — | 15 | 21 | 1 |
| | 7000 | 11064 | 13012 | 20233 | 5088 | 135 |

## ఐక్య ఉపాధ్యాయ ప్రకటన రేట్లు

| | |
|---|---|
| 4 వ కవరు పేజీ | రు. 300-00 |
| 2, 3 కవరు పేజీలు (ఒక్కొక్కటి) | రు. 250-00 |
| లోపలి పూర్తి పేజీ | రు. 200-00 |
| లోపలి (అర) ½ పేజీ | రు. 100-00 |
| లోపలి (పావు) ¼ పేజీ | రు. 50-00 |

# 10+2+3 విద్యావిధానంలో +2 దశ ప్రాముఖ్యం — యు.టి.యఫ్. ప్రతిపాదన

నేడు భారతదేశమంతటా ఇటీవల కేంద్రప్రభుత్వ విద్యాశాఖామంత్రి ప్రకటనల సందర్భంగా 10+2+3 విద్యావిధానంపై అసక్తికరమైన చర్చలు జరుగుతున్నాయి. మారిన పరిస్థితులలో దేశంలో అత్యధికంగాగల నిరక్షరాస్యతను నిర్మూలించాలనీ అక్షరాస్యులలో నిరుద్యోగులుండకుండా అందరినీ జాతీయ ఉత్పాదకరంగంలో ఇముడ్చుకోవాలనీ అందుకనుగుణమైన విద్యాపాలసీని రూపొందించుకోవాలనేది ఈ చర్చల సారాంశము. అనేక సంవత్సరాలుగా 14, 15 సంవత్సరాల విద్యాదశను అంకెలగారడీగా మార్చడం తప్ప జాతీయాశయాల కనుగుణంగా, ప్రజల జీవనంతో నిత్యసంబంధంగల విద్యావిధానం రూపొందించబడలేదు.

## ప్రస్తుత పరిస్థితి

భారత రిపబ్లిక్‌లో 14 రాష్ట్రాలు, కేంద్రపరిపాలిత ప్రాంతాల్లో 14 సంవత్సరాల విద్యాదశ, 12 రాష్ట్రాలు, కేంద్ర పరిపాలిత ప్రాంతాల్లో 15 సంవత్సరాల విద్యాదశ, మరొక రాష్ట్రం, కేంద్ర పరిపాలిత ప్రాంతంలో 16 సంవత్సరాల విద్యాదశ నేటికీ కొనసాగించబడుచున్నాయి. 14 సంవత్సరాల విద్యాదశయున్న రాష్ట్రాలలో వివిధదశలుగ 10+1+3, 11+3గను 15 సంవత్సరాల విద్యాదశయున్న ప్రాంతాలలో వివిధ విద్యాదశలు 11+1+3, 11+2+2, 10+2+3 గను వున్నాయి. దేశానికంతటికీ ఒకే విద్యాదశగల్గిన విద్యావ్యవస్థ లేదు. 1962లో డాక్టర్ సంపూర్ణానంద్ నాయకత్వాన నియమించబడిన భావ సమైక్యతాకమిటీ 15 సంవత్సరాల విద్యాదశ దేశానికంతటికీ వర్తింపజేయాలని సిఫార్సుచేసింది. 1964-66 మధ్య పనిజేసిన కొఠారి విద్యాకమీషన్, 1967లో డాక్టర్ త్రిగుణసేన్ నాయకత్వాన ఏర్పరచబడిన విద్యావిషయికమైన పార్లమెంటుసభ్యులకమిటీ ఈ 15 సంవత్సరాల విద్యావిధానాన్ని బలపర్చాయి. కేంద్ర ప్రభుత్వం కొఠారికమిషన్ రూపొందించిన విద్యాదశను 1968లో ప్రకటించిన "విద్యా విధానంపై జాతీయ పోలసీ" అన్నప్రకటనలో దేశమంతటా దాన్ని అమలుపర్చాలని నిర్ణయించింది. 10+2+3 అనే విద్యాదశ తుదిరూపాల్ని కేంద్రప్రభుత్వంచేనియమించబడిన 11 మందిసభ్యులు (అందరూ అధికారులే)తో కూడిన నేషనల్ కమిటీ అనే సంఘం 1973లో ధృవీకరించి అన్ని రాష్ట్రాల్లోను అమలుచేయుటకుగాను 'బ్లూ ప్రింటు'గా రాష్ట్ర ప్రభుత్వాల పరిశీలనార్థం పంపించింది. కాని ఈ నేషనల్ కమిటీ రిపోర్టు ప్రచురణకాక పూర్వమే కేంద్ర విద్యాబోర్డు పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో కొంతభాగం, ఆంధ్ర ప్రదేశ్, కర్నాటక, కేరళవంటి రాష్ట్రాలు నిశితంగా పరిశీలన జరపకుండానే 10+2+3 విద్యాదశపథకాన్ని అమలుచేశాయి.

కేరళలో +2విద్యాదశను జూనియర్ కాలేజీలలో ఏర్పాటుచేసి విశ్వ విద్యాలయాలకు అనుబంధం చేశారు. ఆంధ్ర ప్రదేశ్‌లో జూనియర్ కాలేజీలలోను, డిగ్రీ కళాశాలలోను ద్వంద్వరీతిలో ప్రవేశపెట్టారు. ప్రత్యేకంగా ఇంటర్మీడియట్ బోర్డు నొకదానిని యాజమాన్యం కొరకు నెలకొల్పారు. కర్నాటకలో ప్రీయూనివర్శిటీ బోర్డు నొకదానిని నెలకొల్పి కాంపోజిట్ కళాశాలలో ఒక సంవత్సరకాలపు ప్రీయూనివర్శిటీ కోర్సును అదనంగా కలిపి, 2 సంవత్సరాల ప్రీయూనివర్శిటీ కోర్సుగల జూనియర్ కళాశాలలను కొన్నింటిని స్థాపించడం జరిగింది. ఒకఏకీకృత పద్ధతిలో ఈ విద్యా విధానం అమలు పర్చడానికి ప్రయత్నం జరగలేదనడానికి ఇంతకంటే వేరే నిదర్శనం అవసరంలేదు. ఆంధ్రప్రదేశ్‌లో అనుసరించిన పాలసీ కేవలం పాత ఇంటర్మీడియట్‌ను పునఃప్రతిష్ఠ చేయడమే. కర్ణాటకలో 2 సంవత్సరాల ప్రీయూనివర్శిటీ కోర్సుగా మాత్రమే పరిగణించడం జరిగింది. పాత ఇంటర్మీడియట్ కోర్సు కేవలం డిగ్రీకోర్సుకు సన్నాహక దశమాత్రమే. కాని కొఠారి సూచించిన + 2దశ ఉన్నత విశ్వవిద్యాలయ కోర్సుకు సన్నాహక దశగను, మరొకవైపున సాంఘికంగా జీవనరంగంలో ఉపయోగపడేవృత్తి విద్య కోర్సులను ప్రవేశపెట్టి జీవితంలో స్థిరపడడానికి ముగింపు దశగను తలంచబడింది.

## + 2 దశ ప్రాముఖ్యం

వాస్తవంగా జాతీయస్థాయిలో ప్రవేశపెట్టాలనే ఈదశ చాలా లోతైన భవిష్యత్‌లో మంచి ప్రాముఖ్యతగల్గిన దశగా వుండాలి. విద్యను జీవితానికి సన్నిహితంగా, ఉత్పాదక దృష్టికి ప్రాతిపదికగావుండేటట్లు ఈ దశరూపొందించాలి. మరోవిధంగా చెప్పాలంటే నూతన విద్యా విధానానికి మార్గదర్శకంగా ఉండాలి. విద్యా విషయకమైన ప్రధాన మార్పులు లేనపుడు విద్యా విధానంలో సంవత్సరాలు అటూ, ఇటుగాను మార్చినంత మాత్రాన ఏ ప్రయోజనమూ ఒనగూడదు. విద్యా ప్రపంచములో ఇంతవరకూ పరిశీలించబడని సముద్రాలపై నావికా ప్రయాణం చేయడం లాంటిది. ఈ + 2 దశ. అంతటి ప్రాముఖ్యత గల్గిన ఈ దశ విద్యా విధానం ఇంతవరకు ఉపాధ్యాయ సంఘాలతోగాని, యావద్భారత స్థాయిలో పేరెన్నికగన్న విద్యావేత్తలతోగాని చర్చించబడలేదన్న విషయం విచారకరంగా ఉన్నది. అందుచేత ఈ విద్యా దశ ధ్యేయం నెరవేరాలంటే, చక్కటి ప్లానింగ్ సన్నాహం అవసరం. నేషనల్ కమిటీ రిపోర్టును అన్ని ఉపాధ్యాయ సంఘాలకు, విద్యావేత్తలకు అందజేసి రాష్ట్ర స్థాయి యావద్భారత స్థాయి సెమినార్లు నిర్వహించియుండాల్సింది. అయినా కొన్ని రాష్ట్రాలు ఈవరకే ప్రవేశపెట్టాయి. మరికొన్ని ప్రవేశపెడుతున్నాయి. కొన్ని పెట్టబోతున్నాయి.

ఈ సందర్భంగా కొన్ని ఆలోచించాల్సిన ప్రశ్నలుదయిస్తున్నాయి.

1. ఈ రెండు సంవత్సరాలకోర్సు సెకండరీ పాఠశాలతో కలిపియుంచుతారా? లేక కళాశాలతో కలిపియుంచుతారా?
2. ఈ కోర్సుయొక్క ప్రధాన పాఠ్యవిషయం ఏమిటి?
3. పారిశ్రామిక తర్ఫీదు సంస్థలు, సాంకేతిక డిప్లొమా సంస్థలకు వీనికి తేడా ఏమిటి?
4. ఈ స్కీమును ఏవిధంగా అమలుపర్చాలను కుంటున్నారు?
5. ఈ స్కీమును అమలుపర్చడానికి కావలసిన ఆర్థిక

వనరులు ఏవిధంగా సమకూర్చుతారు.

6. ఈ స్కీము విద్యారంగపు విశాలమైన సాంఘిక, అర్థికాశయాలను ఏవిధంగా సాధిస్తుంది.

7. 14,15 సంవత్సరాల విద్యాదశలలోగల పాఠ్యాంశాలలోని నాలెడ్జిగాప్‌ను పరిగణనలోనికి తీసికొన్నారా? తీసికొంటే ఏవిధంగా ఆ గాప్‌ను పూరించదల్చుకున్నారు?

8. పాత విద్యాదశకంటే నూతనంగా ప్రవేశపెట్టబోయే విద్యా విధానంలోని విజ్ఞానం ఏవిధమైన విశిష్టత కల్గినది? ఈ నూతన విజ్ఞానాన్ని 10+2+3 దశలలో ఏవిధంగా విభజించాలి.

9. నూతన విద్యాదశకు సంబంధించిన పాఠ్యపుస్తకాలు తయారు చేయబడి సిద్ధంగాయున్నవా? ఉపాధ్యాయులకు శిక్షణ అవసరమైన రీతిలో ఇవ్వబడిందా?

మొదలైన ప్రశ్నలను ఆలోచించకుండా అమలుచేసిన ప్రాంతాలలో గందరగోళం మాత్రమే సృష్టించబడింది.

ఈనూతన విద్యాదశలో సాంకేతికమైన, వృత్తి సంబంధమైన కోర్సులు ప్రవేశపెడతారని విస్తృత ప్రచారం జరిగింది. వేలాదిమంది పారిశ్రామిక తర్ఫీదు సంస్థల్లోను, పాలిటెక్నిక్ సంస్థలలోను ఉత్తీర్ణులైనవారు నిరుద్యోగులుగ నున్నపుడు భారత అర్థిక వ్యవస్థపై దీని ప్రభావాన్ని గురించి ఆలోచించాలిగదా. వ్యావసాయిక, పారిశ్రామిక తదితర సేవారంగాల్లో పెరుగుదల రేటును దృష్టిలోనికి తీసికొని పరిశీలించక పోయినచో ముగింపుదశగ రూపొందే ఈ కోర్సులు నిరుద్యోగాన్ని పెంచడానికి మానవ సంపద వృధాకావడానికి దారితీస్తుంది. కాన+2 దశ కోర్సు ముగింపుదశగ రూపొందడమనేది వ్యవసాయిక, పారిశ్రామిక రంగాల్లోని ఉపాధి అవకాశాలపై ఆధారపడివుంటుంది, +2 దశ ప్రవేశపెట్టినంత మాత్రాన ఉద్యోగాలు లభించవు.

## +2 దశ లక్ష్యం

ఈ కోర్సుజాతియొక్క అర్థిక, రాజకీయ, సాంఘికాశయాల్ని సాధించాలంటే అవేమిటో స్పష్టంగా నిర్వచించి అందుకనుగుణమైన విద్యా ప్రణాళిక ఏర్పరుచుకోవాలి. జీవితానికి విద్యకూగల సంబంధాలను పటిష్టమొనరించడానికి, శాస్త్రీయ దృక్పధాన్ని కలిగించి ప్రజాతంత్ర జీవన విలువను రూపొందించడానికి నిజమైన ఉత్పాదక క్రమంలో భాగస్వామ్యం కల్పించే విధంగా విద్యను ఉత్పాదక శ్రమతో మిళితం చేయుటానికిగాను దాన్ని మార్పు చేయాలి. దీనిని సెకండరీ విద్యను పొడిగించడంగానే పరిగణించాలి. జీవితంలో సాంఘికంగా ప్రయోజనకరమైన వివిధ వృత్తులనవలంబించేందుకు అవసరమైన పరిజ్ఞానాన్ని, సిద్ధాంత ప్రాతిపదికను ఈ దశలో విద్యార్థులకు కల్పించాలి. సాధారణ మార్గంలోనూ, వివిధ వృత్తులకు సంబంధించిన రంగాలలోను ఉన్నత విద్యార్హతలు సంపాదించేందుకుగాను విద్యాసంబంధమైన వృత్తి విద్యార్జనకు ముందటిదశకు సంబంధించిన వృత్తి విద్యానైపుణ్యానికి సంబంధించిన డైవర్సిఫైడ్ కోర్సులతో కూడినదిగా ఆ దశ యుండాలి. అంతేగాని అకడమిక్ కోర్సులోకవైపున వృత్తివిద్యలోకవైపున ఏర్పాటుచేసి మానసిక శారీరక శ్రమకుమధ్య అంతరాన్ని అలానే ఉంచేందుకు ప్రయత్నించరాదు. ఈ కోర్సులన్నింటికి సంబంధించి జీవితంలో ఒక సాధారణ సాంస్కృతిక స్థాయికి జేరుకోవడానికిగాను తప్పనిసరిగా అధ్యయనం చేయవలసిన పాఠ్యాంశాల జాబితాను ముందు తయారుచేయాలి నిర్బంధ పాఠ్యాంశాలలో తప్పనిసరిగా మాతృభాషయుండాలి అదిగాక రాజ్యాంగం 8షెడ్యూలులో పేర్కొనబడిన అధునిక భారతీయ భాషలలోనొకదానిని ఐచ్ఛికంగా ఎంచుకొని చదువుకొనే అవకాశముండాలి.

## పాఠ్యాంశాలు

ప్రధానమైన తప్పనిసరిగాచదవవలసినపాఠ్యాంశాలలో 1) పౌరవిజ్ఞానం చరిత్ర కలిసి ఒకటిగావుండాలి. 2) భూగోళశాస్త్రం అర్థశాస్త్రం ఒకటిగావుండాలి సైన్సు సబ్జక్టులు చదవాలనుకునేవారికి ఇవి నిర్బంధ పాఠ్యాంశాలుగా యుండాలి. శాంఘికశాస్త్ర సంబంధమైన సబ్జక్టులను ఎంచుకున్నవారికి గణితశాస్త్రం, శాస్త్ర విజ్ఞానం అలానే తప్పనిసరి పాఠ్యాంశాలుగ యుండాలి. వృత్తి విద్యా సంబంధమైన కోర్సులు తీసికొన్న విద్యార్థులు గూడా సాంఘిక శాస్త్రంలోనూ, నేచురల్ సైన్స్‌లోనూ ప్రధానమైన పాఠ్యాంశాలను అధ్యయనం చేయాలి. పని అనుభవమనేది నిర్బంధ పాఠ్యాంశంగావుండాలి. పని-అనుభవం అంటే నామమాత్రంగా గాక ప్రజా జీవనంలో ఉత్పత్తి కార్యక్రమంలోను ప్రత్యక్షంగా పాల్గొన్న అనుభవంగా ఉండాలి. ఇదంతా కేవలం సూచనప్రాయమైన అభిప్రాయం మాత్రమే. సవివరమైన పాఠ్య ప్రణాళికను బోధనాంశాల వివరాలను రూపొందించేందుకుగాను వివిధ విద్యా విభాగాలలో అనుభవంగల నిపుణులతో కమిటీని నియమించాలి. ఈ దశ నుండే ప్రాథమికోపాధ్యాయులకు శిక్షణ గరపడం ప్రారంభించాలి. అలా శిక్షణపొందినవారు తమ విద్యార్హతలను పెంపొందించేందుకు ఉపాధ్యాయ వృత్తిలో తమ అభివృద్ధిని సాధించుకునేందుకు అవకాశం గల్పించాలి. ఒక కోర్సు నుండి వేరొక కోర్సుకు సులువుగా మారడానికి అవకాశంకల్పించడం కోసం, కరస్పాండెన్సు కోర్సులు. సాయంకాలం తరగతులు మొదలగు వాటిద్వారా విరామ సమయంలో విద్యగడించే సౌకర్యం కల్పించాలి.

## అజమాయిషీ-నిర్వహణ

ఒకటవ తరగతినుండి +2దశవరకు మొత్తం పాఠ్యాంశాల అంతటిపైన పూర్తిఅజమాయిషీ రాష్ట్రపాఠశాలల బోర్డుకే యుండాలి. ప్రాథమిక సెకండరీ విద్యలను +2 దశలోనిడైవర్సిఫైడ్ కోర్సులను సమన్వయ పరిచేందుకు అలా చేయుడం అవసరం. ఆ బోర్డు స్వయం నిర్ణయాధికార ప్రతిపత్తి గల్గినదిగా ఉండాలి. అది ప్రజాతంత్ర పద్ధతిలో పనిచేసేదిగా యుండాలి. ఉపాధ్యాయులు, తదితర కష్టజీవులు చురుకైన పాత్ర వహించేందుకు అందులో అవకాశముండాలి. అన్ని తరగతులకూ పాఠ్యాంశాల ప్రణాళికను అబోర్డే నిర్దేశించాలి. పదవతరగతి. +2దశ పరీక్షలను అదే నిర్వహించాలి. ప్రాథమిక సెకండరీ, +2 దశలకు సంబంధించి వేరువేరుగా మూడు ప్రత్యేక కమిటీలను ఆ బోర్డు ఏర్పాటుచేసి ఆయాకమిటీలలో ఆయాదశలకు

చెందిన ఉపాధ్యాయులు అధిక సంఖ్యాకులుగా, మిగతా దశలకు చెందినవారు తగినంతమంది యుండునట్లుగా ప్రాతినిధ్యం కల్పించాలి. అయితే +2దశకు సంబంధించిన కమిటీలో కాలేజీ, యూనివర్శిటీ అధ్యాపక ప్రతినిధులనుకూడా చేర్చాలి. అలా అయితే ఉత్తమ సమన్వయీకరణ సాధ్యపడుతుంది.

పదో తరగతివరకు గల విద్యాదశను దేశమంతటా ఒకే విధంగా ప్రాధమిక విద్య, సెకండరీ విద్యలుగా విభజించాలి. జాతీయస్థాయిలో విద్యావేత్తలతోను ప్రామాణికమైన ఉపాధ్యాయులతోను సంప్రదించిన మీదట పదో తరగతివరకుగల వివిధ విద్యాదశలకు పాఠ్య ప్రణాళికను బోధనాంశాల వివరాలను తయారుచేయాలి. పాఠ్యప్రణాళికల నుండి భాషల భారాన్ని తొలగించాలి. ప్రాధమికదశలో తప్పనిసరిగా ఒక్క భాషేయుండాలి. అది మాతృభాషగా యుండాలి. సెకండరీ దశలో ఐచ్ఛికంగా మరొక భాషను ఎంచుకునే అవకాశం జోడించవచ్చును. ఈ దశలో చరిత్ర పౌరవిజ్ఞానం మొదలగు సాంఘికశాస్త్రాలలో ఎలాంటి దురభిమానభావాలను ప్రచారం చేయడం తగదు. అమ్మకానికి యోగ్యమైన ప్రత్యేకంగా ప్రయోజనకరమైన వస్తూత్పత్తికి సంబంధించిన ఆధునిక శాస్త్రీయపద్ధతులకు పని అనుభవాన్ని ఈదశలో జోడించాలి. సైన్సులో ఆచరణాత్మక శిక్షణకు ప్రాధాన్యతనివ్వాలి. వాస్తవ జీవితంలో ఎదురయ్యే సమస్యలను పరిష్కారం చేసే దృష్టితో సిద్ధాంత పరిజ్ఞానాన్ని కూడ ఈదశలో తగు విధంగా తీర్చిదిద్దాలి. ప్రాధమిక దశనుండి సక్రమమైన బోధనా సూత్రాల ననుసరించి సైన్సుబోధనను ప్రారంభించాలి. ఆచరణలో దాని ఉపయోగానికి సంబంధించిన భాగానికి సరైన ప్రాధాన్యత నివ్వాలి.

## + 2 దశ విద్యా సంస్థలను ప్రత్యేకంగా ఏర్పాటు చేయాలి

+2 విద్యా దశకు ఖచ్చితంగా ప్రత్యేక విద్యాసంస్థల నేర్పరచాలి. వాటిని సెకండరీ పాఠశాలలకుగాని, డిగ్రీ కళాశాలలకుగాని జోడించరాదు. అలా జోడించినందువలన ఆవిద్యాదశకుగల ప్రాధాన్యత మరుగున పడుతుంది. విద్యార్థుల వయస్సు గ్రూపుకు చెందిన సమస్యలు కూడ ఉత్పన్నమవుతాయి ఇందుకయ్యే ఆర్థిక భారాన్నంతటినీ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలే భరించాలి. ఈ విద్యాసంస్థలపై ప్రజాతంత్ర పద్ధతులలో నడిచే మేనేజిమెంటు ఉండాలి. ఉపాధ్యాయ ప్రతినిధులకు అసంస్థలలో పనిజేసే ఇతర ప్రతినిధులకు విద్యార్థుల తల్లిదండ్రుల ప్రతినిధులకు ఆచరణాత్మకమైన ప్రాతినిధ్యం గల్పించాలి.విద్యాసంస్థలు సమాజానికంతటికి సంబంధించిన సంస్థలుగా పనిజేసేట్లు, మొత్తం ప్రజల అవసరాలు తీర్చేట్లు చూడటానికి విద్యాసంస్థలపై ప్రైవేటు యాజమాన్యంవల్ల కలిగే దుష్ఫలితాలను నివారించటానికి అది దోహద పడుతుంది. లేబరేటరీ, లైబ్రరీ బోధనోపకరణాలూ కళాశాల స్థాయిలో ఉండాలి.

ఈ దశలో ప్రవేశపెట్టే వృత్తి విద్యా కోర్సులు కేవలం యాంత్రికమైన నైపుణ్యాన్ని కల్పించేవిగా తయారుకారాదు. వృత్తి విద్యా కోర్సులనుండి సాధారణ విద్యా కోర్సులకు అదే విధంగా అటునుండి ఇటుమారడానికి సులభంగా అవకాశం ఉండే పద్ధతిలో మౌలికమైన శాస్త్రీయ విజ్ఞానాన్ని అవికల్పించాలి. తామెన్నుకున్న అంశాలలో వృత్తివిద్యలలో అత్యున్నతమైన యూనివర్శిటీ డిగ్రీలను పొందేంతవరకు తమవిద్యార్హతలు పెంపొందించుకునేందుకు వారికి అవకాశాలు కల్పించడంఅవసరం.

స్వయం ఉపాధిని గురించి నొక్కి చెప్పుండటం ద్వారా చదువులు ముగించుకుని పాఠశాలలనుండి బయటికివచ్చే యువజనులకు ఉద్యోగాలు కల్పించవలసిన బాధ్యతను ప్రభుత్వం పూర్తిగా త్రోసివుచ్చుతున్నది. మనదేశంలో స్వయం ఉపాధి పథకాలన్నీ విఫలమయ్యాయి. ప్రస్తుత ఆర్థిక వ్యవస్థలో అలా జరగడం అనివార్యం. అందువల్లే చేసేందుకు పనిగ్యారంటీ, పని దొరికేంతవరకూ ప్రభుత్వమే నిరుద్యోగభృతి చెల్లించటం విద్యా సంస్కరణను అర్థవంత మొనర్చుతుంది.

+2 దశలోవిద్యాబోధనకు పాఠశాలపద్ధతులనే అనుసరించాలి తన వెనుకబాటు తనాన్ని అధిగమించేందుకు ప్రతి విద్యార్థికి సహాయం జరగాలి. ఇతర యిబ్బందులను అధిగమించేందుకు ప్రతి విద్యార్థికి వీలుకల్పించాలి. అందువల్ల తరగతి గదిలో 30 మందికి మించకుండా ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి ఉండాలి.

అన్ని స్థాయిలలోను పనిచేస్తున్న ఉపాధ్యాయులకు సమాన విద్యార్హతగల వారందరికి సమానమైన వేతనం ఉండాలి. వివిధ విద్యార్హతలుగల ఉపాధ్యాయులకు దేశవ్యాపితంగా అనుసరింపదగిన జీతాల స్కేళ్ళను కేంద్రప్రభుత్వమే తక్షణం నిర్దేశించాలి. ఈ నూతన విద్యాస్వరూపం జయప్రదం గావాలంటే ఇది ఆవశ్యకం.

బోధనేతర సిబ్బంది సంఖ్య, వారి కుండవలసిన అర్హతలు డిగ్రీ కాలేజీలలోని బోధనేతర సిబ్బందితోపోల్చి తగువిధంగా నియమించాలి.

సాధారణ పాఠశాలలలో చదువుముగించి బయటికివచ్చే విద్యార్థులు, ఐ.టి.ఐ. జూనియర్ టెక్నికల్ కోర్సులలో శిక్షణ ముగించుకుని వచ్చినవారు ఈ విద్యా దశలో ప్రత్యేక వృత్తి విద్యాకోర్సులలోచేరి చదవడానికి అర్హులుగా ప్రకటించాలి.

## పరీక్షలు

ప్రస్తుతం అమలులోనున్న పరీక్షల వ్యవస్థను పద్ధతులను పూర్తిగా మార్చువేయాలి. ఇటీవలి కాలంలో ఇంటర్నల్ పరీక్షల కివ్వబడుతున్న అనవసర ప్రాధాన్యతను తొలగించడం, ప్రస్తుత పాఠశాలల పరిస్థితుల దృష్ట్యా, సామాజిక పరిస్థితుల దృష్ట్యా అవసరం. అన్నింటినీ గుదిగుచ్చి ఒకటిగా పరీక్షలు జరిపే పద్ధతి పోవాలి. పరీక్షల పద్ధతిలో అంచనాగట్టే పద్ధతులలో నూతన టెక్నిక్కులూ, సంస్కరణలూ అమలు జరపాలి.

ఇట్లు

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్



ఖమ్మం విద్యా మహాసభల్ని జయప్రదం చేసిన అఖిల ఉపాధ్యాయ వర్గానికీ

"ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్" కీ

ఉద్యమ ప్రతిబింబమైన "ఐక్య ఉపాధ్యాయ"కూ

## మా జే జే లు !

భ వ దీ యు లు

# పబ్లిక్ సర్వెంట్స్ కన్స్యూమర్స్ కోపరేటివ్ సొసైటీ

ము క్తే శ్వ ర ం - తూ. గో. జిల్లా

అయినాపురపు శ్రీరామమూర్తి,
అధ్యక్షులు

కె. నరసింహమూర్తి
శెక్రటరీ

---

తప్పక చూడండి!

అన్నపూర్ణ పిక్చర్స్

# ప్రేమలేఖలు

సులోచనారాణి నవల

నిర్మాత
దుక్కిపాటి మధుసూదనరావు బి.ఏ.

దర్శకుడు
కె. రాఘవేంద్రరావు బి.ఏ.

నవయుగ వారి

లీజ్ రైట్స్: తెలంగాణా & కృష్ణాజిల్లా: నవచిత్ర ఫిలింస్ (సికింద్రాబాద్)

...: టి.వి.వి.సూర్యారావు & కంపెనీ. (లక్క వరం); రాయలసీమ: విజయమల్లేశ్వరి కంబైన్స (మద్రాస్)

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ద్వితీయ విద్యా మహాసభలలో

# ఆమోదించిన తీర్మానాలు

## 1. సంతాప తీర్మానాలు

భారత రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీఅహమ్మద్, భారత రైతు ఉద్యమ అగ్రనాయకులు, మాజీ పార్లమెంటు ప్రతిపక్ష నాయకులు, శ్రీ ఎ. కె. గోపాలన్, గరిబోళ్ల డాక్టరుగా పేరు పొందిన డాక్టరు శ్రీ సత్యపాల్ తులీ, ప్రముఖ విద్యావేత్త డాక్టరు సదాశివరెడ్డి.

దక్షిణ భారత ఉపాధ్యాయ సంఘ అధ్యక్షుడు, ప్రపంచ ఉపాధ్యాయ సంఘ ఉపాధ్యక్షుడు అయిన ఎన్. నటరాజన్.

ప్రముఖ భాషావేత్త, సాహితీకర్త, కేంద్ర సాహిత్య అకాడమీ అధ్యక్షుడు అయిన డా॥ సునీల్ కుమార్ చటర్జీ.

విశాఖపట్నంలో సమస్యల పరిష్కారంకోసం నిరాహార దీక్షకు పూనుకొని యాజమాన్య దురహంకారానికి బలియైన ఉపాధ్యాయిని సహజాదేవి.

గ్రాట్యుటీ పొందలేక యాజమాన్యపు నిర్లక్ష్యానికి బలియైన హైద్రాబాద్ ఉపాధ్యాయుడు శ్రీ నరసింహారావుగార్ల మరణానికి యీ మహాసభ తన సంతాపాన్ని ప్రకటిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నది.

ఎమర్జన్సీ కాలంలో పోలీసు చిత్రహింసలకు లోనై అసువులుబాసిన దేశభక్తులందరికి యీ మహాసభ తన జోహార్లను అర్పించుతూ, వారి మృతికి తన గాఢ సంతాపాన్ని వ్యక్తం చేస్తున్నది.

## 2. స్వర్గీయ చెన్నుపాటి సంస్మరణ

తన యావజ్జీవితం కులమత, రాజకీయాలకు అతీతంగా అధ్యాపకులను ఐక్యపరచి, వారి సమస్యలను పరిష్కరించడానికి కృషిచేస్తూ జీవితాన్ని అంకితం చేసిన స్వర్గీయ చెన్నుపాటి కృషిని యీ మహాసభ ఆదర్శంగా పెట్టుకుంటూ ఆ మహాశయునికి తన జోహార్లర్పించుచున్నది.

ఆయన వారసత్వంతో సమరశీల సాంప్రదాయాల ప్రతిబింబంగా ప్రాథమిక, సెకండరీ, జూనియర్ కాలేజీల అధ్యాపకుల శక్తివంతమైన ప్రాతినిధ్య సంస్థగా ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ను నిర్మించి ఎంతో దీక్షతో యీ సంస్థ కార్యకలాపాలను ముందుకు తీసుకొనిపోతున్న కార్యకర్తలను, సహకరించి తోడ్పడుతున్న ఉపాధ్యాయులను యీ మహాసభ అభినందించుచున్నది.

స్వర్గీయ చెన్నుపాటి మిగిల్చిపోయిన యీ ఉద్యమ బాధ్యతలను మరింత దీక్షతో నిర్వర్తించవలసిన కర్తవ్యమును గుర్తిస్తూ ఆ బాధ్యతలను పూర్తిచేసే కార్యక్రమాన్ని నిర్వహింపగలమని యీ మహాసభ ప్రతినిధులమైన మేము ఈసందర్భంలో శపథం చేస్తున్నాము.

## 3. విద్యా విషయక తీర్మానాలు

1. విద్యా విధానంలో సమూలమైన మార్పులు :- సామ్రాజ్యవాద విద్యావిధానానికి పైపై మెరుగులు దిద్దబడిన యీనాటి విద్యావిధానాన్ని సమూలముగా మార్చివేసి దీని స్థానములో కొఠారి కమీషను సిఫారసుల మేరకు మన ప్రజల నిత్యజీవితానికి ఉపయోగపడగల శాస్త్రీయ అభిరుచితో గూడిన విజ్ఞానాన్ని పెంపొందించగల పనిరూపక విద్యకు కీలకమైన స్థానము గలిగియుండి, వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో ఆధునికీకరణ కార్యక్రమాన్ని త్వరితముచేసి, ఉత్పత్తిని పెంచుటకు ఉపయోగపడగల, ప్రజలలో సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక పరివర్తన తెచ్చి, జాతీయ సమైక్యతతోపాటు పోషలిస్టు వ్యవస్థ నిర్మాణానికి తోడ్పడగల ప్రత్యామ్నాయ విద్యా విధానాన్ని అమలు జరపాలని యీ మహాసభ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను కోరుతూ తీర్మానిస్తున్నది.

2. ఖేర్ కమిటీ సిఫార్సులు :- కేంద్ర ప్రభుత్వ బడ్జెట్‌లో 10% విద్యావ్యాప్తి కొరకు కేటాయించాలని కేంద్ర ప్రభుత్వం చేత నియమించబడిన "ఖేర్ కమిటీ" 1952 సం॥లో సిఫారసు చేసిన సంగతిని ఈ మహాసభ కేంద్ర ప్రభుత్వము వారి దృష్టికి తీసుకొని వస్తున్నది. ఆ సిఫారసులను అమలుజరిపి విద్యారంగ పురోభివృద్ధికి తోడ్పడాలని ఈ మహాసభ కేంద్ర ప్రభుత్వము వారిని కోరుతూ తీర్మానిస్తున్నది.

3. ఎడ్యుకేషన్ గ్రాంట్సు కమిషన్లు :- 'యూనివర్శిటీ గ్రాంట్సు కమిషను' ప్రాతిపదికమీద, 'ప్రైమరీ ఎడ్యుకేషను గ్రాంట్సు కమిషను' మరియు 'సెకండరీ ఎడ్యుకేషన్ గ్రాంట్సు కమిషన్లు' వేర్వేరుగా ఏర్పాటుజేసి అన్ని రాష్ట్రములలోను ఒకేవిధమైనస్థాయి, స్వరూపములుగల ప్రాథమిక, సెకండరీ విద్యావిధానములు ఏర్పరచి అమలు జరుపుటకును, ఉపాధ్యాయులకు ఒకేవిధమైన జీతాలసేళ్ళు సర్వీసు కండిషన్లు, శలవు పెన్షను సదుపాయములు, సర్వీసు భద్రతకు రక్షణలు కల్పించుటకును యీ కమీషన్లద్వారా గ్రాంట్లు మంజూరు చేయబడుటకు తగుచర్యలు తీసుకోవాలని యీ మహాసభ కేంద్ర ప్రభుత్వము వారిని కోరుతూ తీర్మానిస్తున్నది.

4. ఫ్రీ ప్రైమరీ పాఠశాలలు:- మన రాష్ట్రంలో పాఠశాల వయస్సురాని బిడ్డలందరికి ఫ్రీ ప్రైమరీ పాఠశాలలను ఏర్పాటు చేయాలని యీ మహాసభ ప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానిస్తున్నది.

5. జూనియర్ పాలిటెక్నిక్ పాఠశాలలు :- ఉన్నత విద్యాభ్యాసమునకు అవకాశములేని పేద, మధ్య తరగతి విద్యార్థులు సమాజమునకు ఉపయోగపడవలసిన అవసరము దృష్ట్యాను రాష్ట్రములో మధ్యతరహా పరిశ్రమలను యేర్పరచి, వాటిని అభివృద్ధిచేయవలసిన దృష్ట్యాను ప్రతిజిల్లాలోను గణనీయమైన సంఖ్యలో జూనియర్ పాలిటెక్నిక్ పాఠశాలలను, ఇండస్ట్రియల్ ట్రయినింగ్ సెంటర్లను యేర్పాటు చేయాలని ఈ మహాసభ ప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానిస్తున్నది.

6. నిరక్షరాస్యతా నిర్మూలన :- ముప్పది సంవత్సరాల స్వాతంత్ర్యానంతరం గూడా మన దేశ ప్రజలలో నూటికి డెబ్బదిమంది నిరక్షరాస్యులుగానే యున్నారు. ఈ దురదృష్ట కరమైన స్థితి మన ప్రజల పురోభివృద్ధికి తోడ్పడదు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఈ దురదృష్టకరమైన పరిస్థితిని పరిశీలించి, ఈ నిరక్షరాస్యతా నిర్మూలనకు ప్రణాళికా బద్ధమైన కార్య క్రమము చేపట్టి, అమలు జరపాలని, ఈ మహాసభ కోరుతూ తీర్మానిస్తూంది.

7. బిడ్డల హాజరు : తల్లిదండ్రుల ఆర్థిక దుస్థితి వలన, మనరాష్ట్రములో లక్షలాది పేద బాలబాలికలు పాఠశాలలకు రాలేనిస్థితిలో నున్నారు వ్యవసాయ సంస్కరణలను అమలు జరుపుటలో జాప్యము లేకుండా నిర్దిష్టమైనచర్యలు తీసుకొనుట, గణనీయమైన సంఖ్యలో చిన్న, మధ్య తరగతి, పెద్ద పరిశ్రమ లను రాష్ట్రములో యేర్పరుచుట, గృహపరిశ్రమలను పునరుద్ధ రించుట లాంటి మౌలికమైన మార్పులు తెచ్చుటకు ప్రభుత్వం కృషిచేయనిదే మన ప్రజల ఆర్థిక దుస్థితి తొలగదని ఈ మహా సభ విశ్వసిస్తున్నది. ఈ మౌలిక మార్పుల కొరకు తగుచర్యలు తీసుకోవాలని యీ మహాసభ ప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానిస్తున్నది. ఈ మార్పులకొరకు తగుచర్యలుతీసుకొనుటతో పాటు పాఠశాలల వెలుపలనున్న బిడ్డలను, పాఠశాలలకు ఆకర్షించుటకు యూనిఫారం దుస్తులు, పలకలు, పుస్తకములు వగైరాలు వారికి ఉచితముగా సప్లయి చేయబడాలని, విద్యా విషయక సభల యేర్పాటు, విద్యావిషయక చలన చిత్రముల ప్రదర్శనలాంటి ప్రబోధక చర్యలతోపాటు తల్లిదండ్రుల సంఘ ములను యేర్పాటుచేసి వారి తోడ్పాటుతో బిడ్డలను పాఠశాల లకు రాబట్టుటకు కృషిచేయాలని, కేర్ ఫలహారముల స్థానంలో మధ్యాహ్న ఉచిత భోజన సదుపాయాలను ఏర్పాటుచెయుటకు తగుచర్యలు తీసుకోవాలని ఈ మహాసభ ప్రభుత్వాన్నికోరుతూ తీర్మానించుతున్నది.

8. పాఠశాలలకుకలుగచేయవలసిన సదుపాయములు:- అన్ని జిల్లాలలోను అన్ని మేనేజిమెంటుకింద పనిచేస్తున్న పాఠ శాలలన్నింటికిని, ఆకర్షణీయమైన భవనములు, ఫర్నిచరుబోధనా పరికరములు, మ్యాపులు, బోర్డులు, రిఫరెన్సు పుస్తకములతో కూడిన లైబ్రరీ సదుపాయములు, ఆటస్థలములు, ఆటవస్తువులు బడితోటకవసరమగు స్థలముతోపాటు, తోటపనిముట్లు,సెకండరీ పాఠశాలలకు అన్ని హంగులతోగూడిన సైన్సు లేబరేటరీలు వగయిరా ముఖ్యసదుపాయములుఏర్పరచుటకు ఒకపథకమును రూపొందించి, దాని అమలునకు తగు నిధులను కేటాయించి అమలు జరపాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుచూ తీర్మా నిస్తున్నది.

9. నూతన మూల్యాంకనా విధానం:- నూతనమూల్యాం కనా విధానము మేరకు ప్రతిఉపాధ్యాయుడు పాఠ్యప్రణాళికలు సిద్ధపర్చి బోధనా కార్యక్రమమును అమలు జరపాలను సంగతి హర్షించదగిన విషయమయి నప్పటికినీ, నూతనముగా అమలు లోనికి వచ్చిన ఈ విధానము ఉపాధ్యాయులతోపాటు సూపర్ వైజెషన్ స్టాఫును గూడా గందరగోళములోనికి నెట్టింది. కొందరు సూపర్‌వైజెషన్ అధికారులు వారమున కొకసారి పాఠ్య ప్రణాళికలు తయారుచేయాలని ఒత్తిడి పెడుతున్నారు. రిఫరెన్సు పుస్తకములు సప్లయిచేయబడక పోవడం, పాఠ్య ప్రణాళికలు సిద్దపరుచుటకు టైము చాలకపోవడంలాంటి అసౌ కర్యములవలన అనేకమంది ఉపాధ్యాయులు అసంతృప్తికి లోనగుచున్న సంగతిని ఈ మహాసభ గుర్తించు తున్నది ప్రదేశ్ ప్రభుత్వ ఉన్నత నిర్వహణాధికారులు ఈ పరిస్థితిని గుర్తించి పాఠశాలలకు ఇందుకు సంబంధించిన హేండు బుక్సు రిఫరెన్సు గ్రంథములను అన్ని సబ్జక్టులకు సప్లయిచేయాలని, ఈ పాఠ్య ప్రణాళికలు సిద్ధపర్చుటకు వారాంతపు శలవులలో ఆదివారంతోపాటు శనివారము సాయంత్రం శలవుగా ప్రక టించాలని ఈ మహాసభ ప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మా నిస్తున్నది.

10. ఉపాధ్యాయ-విద్యార్థి నిష్పత్తి :- విద్యాస్థాయిలో గుణాత్మకమైన మార్పులు తీసుకొనివచ్చుటకు వ్యక్తిగత శ్రద్ధ చూపుటకు వీలుగా ఉపాధ్యాయ విద్యార్థుల నిష్పత్తిని ప్రాథ మిక పాఠశాలల్లో 1 20గాను, సెకండరీ పాఠశాలల్లో 1:30 యేజన్సీ పాఠశాలల్లో 1:10 వుండాలని దశాబ్దాల తరబడిగా ఉపాధ్యాయ సంఘాలద్వారా ఉపాధ్యాయులు తమ అనుభవ పూర్వకమైన పరిస్థితిని తెలియజేసి యున్నప్పటికినీ ప్రభుత్వ పెద్దలు ఈ నిష్పత్తిని తగ్గించకపోవటం ఉచితముకాదని ఈమహా సభ అభిప్రాయపడుతున్నది. ప్రదేశ్ ప్రభుత్వం ఈ నిష్పత్తి తగ్గుదల విషయమును సానుభూతితో పరిశీలించి ఉపాధ్యాయ- విద్యార్థుల నిష్పత్తులను పై విధంగా సవరించాలని యీ మహా సభ తీర్మానించుతున్నది.

11. ఏకోపాధ్యాయ పాఠశాలలు మార్పు:- ఏకోపా ధ్యాయ పాఠశాలలను రోలు సంఖ్యతో నిమిత్తం లేకుండా బహుళోపాధ్యాయ పాఠశాలలుగా మార్పుచేసి బిడ్డలస్థాయిని మెరుగుపర్చుటకు అవకాశం కల్గించాలని యీ మహాసభ ప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానిస్తున్నది.

12. పాఠ్యగ్రంథాలు :- ఎ) పాఠశాలలు ప్రారంభించిన తదుపరి నెలల తరబడి పాఠ్యగ్రంథాలు విద్యార్థులకు లభ్యం కావడంలేదు. ప్రైవేట్ వ్యాపారస్తులు గెడులపోటీ పెట్టి హెచ్చుధరలకు అమ్ముట జరుగుచున్నది. ఈ పరిస్థితిని చక్క దిద్ది కట్టుదిట్టములుచేసి పాఠశాలలు ప్రారంభించినప్పటికే పాఠ్యగ్రంథములను సరఫరాచేయవలసినదిగనూ, జిల్లా కేంద్ర ములలోగాక ప్రతి బ్లాకు ఆఫీసునందు పాఠ్యగ్రంథములు సర ఫరాచేయు కేంద్రముల నేర్పాటు చేయవలసినదిగనూ ప్రభుత్వ మును కోరుచూ తీర్మానించడమైనది.

బి) పాఠ్యగ్రంథాలు సమసమాజ నిర్మాణానికి విద్యార్థిని తయారు చేయునటునూ, శాస్త్రీయ దృక్పధం అభివృద్ధికి తోడ్ప డేవిగా నుండవలెను. ప్రస్తుత గ్రంథాలు పుక్కిటిపురాణ కథలతో అశాస్త్రీయ భావములతో నిండియున్నవి. కాన పాఠ్య గ్రంధా లను నూతన సామాజిక, శాస్త్రీయ దృక్పధంతో రచింపజేయా లని కోరుచూ తీర్మానించుచున్నాము. ప్రతి ౫ సం॥ల కొకసారి పుస్తకములను మార్పుచేయాలని, సాంఘిక, సామాన్య శాస్త్ర గ్రంథములకు ప్రతి సంవత్సరము తాజా విషయములతో సప్లి మెంట్సు ముద్రించాలని కోరుచున్నది.

సి) ప్రస్తుత పాఠ్యగ్రంథాలలో విరివిగా తప్పులు దొర్లు తున్నవి. వానిని ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్, ఐక్య ఉపాధ్యాయ పత్రిక ద్వారానూ అనేకమంది మేధావులు తమ విజ్ఞాపనల ద్వారాను ప్రభుత్వ దృష్టికి తేవడమైనది. వానిని వెంటనే సరిదిద్ది పాఠశాలలకు తెలియపరచవలసినదిగా ప్రభుత్వమును ఈ సభవారు కోరుతున్నారు. విద్యార్థి స్థాయికి మించిన సిలబసునూ, పాఠ్యగ్రంథాల భారమును తగ్గించవలసినదిగా కోరుతూ తీర్మానించడమైనది.

డి) పాఠ్యగ్రంథాల రచనలలో బోధనానుభవముగల క్లాసురూమ్ టీచర్లకు ప్రాతినిధ్యం కల్పించవలసినదిగా కోరుతూ తీర్మానించుతున్నాము.

13. విద్యాబోర్డులు :- ప్రస్తుతం ప్రజాస్వామ్య అధికార వికేంద్రీకరణ పేరుతోగల పంచాయితీరాజ్ వ్యవస్థ విద్యారంగంను సరిదిద్దకపోగా అధ్వాన్నస్థితికి దిగజార్చినది. పంచాయితీ పరిపాలన ఆశ్రిత పక్షపాతానికి బంధుప్రీతికి నిలయమయినది. విద్యారంగం పంచాయితీరాజ్, మునిసిపాలిటీ, ఎయిడెడ్, ప్రభుత్వ మేనేజిమెంట్ల క్రింద నలిగిపోవుచున్నది. ప్రభుత్వ ఆర్డర్లను ఆయా మేనేజిమెంట్లు ఖాతరుచేయడంలేదు. ఒక్కొక్క జి ఓ ను రకరకాలైన వ్యాఖ్యానాలతో అమలు జరుపుచు ఉపాధ్యాయులను, విద్యార్థులను అవస్థలపాలు జేయుచున్నారు. ఈ అధ్వాన్నపరిస్థితిని తొలగించుటకై కొఠారిక మిషన్ సిఫార్సులు, వానికి ఉపాధ్యాయ సంఘాలు చేసిన సూచనలు, సవరణలను స్వీకరించి అన్ని మేనేజిమెంట్లక్రిందగల పాఠశాలలను కలిపి స్వయం ప్రతిపత్తి గల విద్యాబోర్డులను నెలకొల్పి ఒకే మేనేజిమెంటు క్రిందికి విద్యాసంస్థలను తేవలసినదిగాకోరుతూ ఈ సభవారు తీర్మానిస్తున్నారు.

14. రిఫ్రెషర్ కోర్సులు :- దేశంలో సామాజిక పరిస్థితులు, విద్యా బోధనా పద్ధతులు మారుచున్నవి. ఈ మారుచున్న పరిస్థితుల కనుగుణంగా బోధనా పటిమ అభివృద్ధికై 3 సం॥ల కొకసారి రిఫ్రెషర్ కోర్సులను యేర్పాటుచేయాలని, ఇందుకై ప్రత్యేక యంత్రాంగాన్ని నెలకొల్పాలని కోరుతూ తీర్మానించుచున్నాము. ప్రతి సం॥ జిల్లా, రాష్ట్ర స్థాయిలలో విద్యా గోష్టులను నిర్వహించ వలసినదిగా కోరుచున్నాము.

15. ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులచేత నిర్వహింపబడుచున్న టీచర్సు అసోసియేషన్ సమావేశ స్థలమునకు 5 కి. మీ. దూరము నుండి వచ్చు ఉపాధ్యాయులకు టి.ఎ., డి.ఎ.లు ఇచ్చు సౌకర్యమును కలుగజేయాలని కోరుచూ తీర్మానించుచున్నాము.

16. తెలుగు బోధించె పాఠశాలలో ఉర్దూ, కన్నడం లేక ఒరియా మాతృభాష గాగల విద్యార్థులు 10 మందికి మించి యున్నట్లయిన ఆ యా భాషలు బోధించు ఉపాధ్యాయులను నియమించి వారి మాతృభాషాభివృద్ధికి తోడ్పడ వలసినదిగా కోరుచూ తీర్మానించడమైనది.

17. మైనారిటీ వర్గముగాగల ముస్లిములకు యితర భాషల వారికి ఆయా భాషల బోధనకై ఉపాధ్యాయులను తర్ఫీదు చేయుటకై ప్రత్యేక ట్రైనింగు పాఠశాలలను నెలకొల్పవలసినదిగా కోరుచున్నాము.

18. అప్పర్ ప్రయిమరీ పాఠశాలలు:- ఎ) సామాన్య ప్రజల కందుబాటులో విద్యావకాశాలు కలుగజేయవలసి యున్నందున ప్రతి 3 మైళ్ళకు ఒకఅప్పర్ ప్రయిమరీ పాఠశాలను నెలకొల్పవలసినదిగా కోరుచూ తీర్మానించుచున్నాము.

బి) ప్రస్తుతం అప్పర్ ప్రైమరీ పాఠశాలలు కొన్నిచోట్ల ఇద్దరు, ముగ్గురు ఉపాధ్యాయులతో మాత్రమే నిర్వహింపబడుటు జరుగుచున్నది. 7వ తరగతివరకుగల యీ పాఠశాలలు పూర్తిస్టాఫ్‌తో పనిచేసినప్పుడే సరియైన ఫలితాలు రాగలవు. కాన ప్రతి అప్పర్ ప్రయిమరీ పాఠశాలకు బి ఇడి.ని ప్రధానోపాధ్యాయుడుగాను తెలుగు, హిందీ పండితులను, సెకండరీ, డ్రిల్లు, డ్రాయింగు మాస్టర్లను తగిన సంఖ్యలో తప్పనిసరిగా నియమించవలసినదిగా కోరుతూ తీర్మానించడమైనది.

19. భాషా పండితులు :- ప్రతి సెకండరీ పాఠశాలకు పీరియడ్‌లతో నిమిత్తం లేకుండా తప్పనిసరిగా గ్రేడ్ I ఒక తెలుగు పండితుని, గ్రేడ్ I హిందీ పండితుని నియమించవలసినదిగాను, హయ్యర్ ఫారాలు బోధించే గ్రేడ్ 2 తెలుగు, హిందీ పండితులకు యిచ్చు అలవెన్సులను పెంచవలసినదిగా కోరుచూ తీర్మానించుచున్నాము.

20. క్రీడలు : ప్రాథమిక దశనుండి క్రీడలకు ప్రాధాన్యత నిచ్చినప్పుడే, విద్యార్థి దేహదార్ఢ్యముతో ఆరోగ్యముగా నుండి విజ్ఞానాభివృద్ధి నొందగలడు. ఈ క్రీడారంగములో మన దేశం చాలా వెనుకబడియున్నది. కాన ప్రతి అప్పర్ ప్రైమరీ పాఠశాలకు ఒక పి.ఇ.టి.ని ప్రతి 400 విద్యార్థులుకల హైస్కూళ్ళలో ఒక పి.యి.టి చొప్పుననూ, 100 మంది విద్యార్థునులుగల హైస్కూలుకు అదనంగా ఒక స్త్రీ పి.ఇ.టి.ని 800 దాటిన ప్రతి హైస్కూలుకు అదనంగా ఒక ఫిజికల్ డైరెక్టర్‌ను నియమించి క్రీడాభివృద్ధికి కావలసిన యితర సదుపాయములను కల్పించవలసినదిగా కోరుచున్నాము.

21. బోధనా పరికరాలు :- ఎ) విద్యాబోధనకు ఉపయోగపడుటకుగాను అన్ని మేనేజిమెంట్లక్రిందగల పాఠశాలలకును వివిధ అధునిక సౌకర్యములతోగూడిన దృశ్య, శ్రవ్య, విద్యాపరికరాలను లేబరేటరీ, లైబ్రరీ సౌకర్యాలను, మ్యాపులు, చిత్రపటములను సప్లయి చేయవలెను. విద్యుత్ సౌకర్యాలు లేని ప్రదేశాలకు ప్రభుత్వంవారు సంచార సినిమాలద్వారా సౌకర్యములను ఏర్పాటు చేయవలెనని కోరుచున్నాము.

బి) విద్యార్థులను విజ్ఞానవంతులను చేయాలంటే ఉపాధ్యాయుడు విజ్ఞానవంతుడు కావాలి. దేశంలో జరిగే అభివృద్ధి, ప్రాజెక్టులు చారిత్రకప్రదేశములను ఉపాధ్యాయునికి చూపించుటకు గాను, ప్రభుత్వం ప్రతి సంవత్సరము ప్రత్యేకముగా విహారయాత్రలను నిర్వహించకోరుచూ తీర్మానించుచున్నాము. సం॥ కొకసారి దేశమంతటు పర్యటించుటకు ఉచిత రైల్వే పాసులు మంజూరు చేయగోరుచున్నాము.

22. ప్రాథమికదశనుండి, యూనివర్శిటీ దశవరకు మాతృభాషలో విద్యాబోధన జరగాలని యీ మహాసభ కోరుచున్నది.

23. టార్గెట్లు :- పరీక్షా ఫలితాలు ఉపాధ్యాయులకృషి, ఆ పాఠశాల భౌతికవనర్లు, తల్లిదండ్రులకు శ్రద్ధ ప్రోత్సాహము, విద్యార్థులకృషి మొదలగు అంశములపై ఆధారపడియుండును. కాని ఫలితాల టార్గెట్లను నిర్ణయించి, వానికి చేరుకొనని

(నాన్‌టీచింగ్ స్టాపువారికి డి. ఎ. మెర్జరు స్కేలు)

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

REVISION OF SCALES OF PAY OF PRE VOCATIONAL INSTRUCTORS IN AIDED UPPER PRIMARY SCHOOLS-Orders-Issued.
(EDUCATION (K) DEPARTMENT.

O. O. Ms. No. 693. Edn. Dated the 2nd July 1977
Read :-

1. G, O. Ms. No. 127. Edn. Dt. 18-1-1963
2. G. O. Ms. No 733, Edn. Dt. 12-3-1964
3. G. O. Ms. No. 911, Edn. Dt. 27-4-1970
4. G. O. Ms. No. 1146. Edn. Dt. 27-9-1975

ORDER:

In G. O. second read above, the Pre-vocational Instructors in Aided Elementary Schools who possessed technical qualification without General Educational Qualification were given D. A. merged scale of pay of Rs. 55-1-59-2-75.

2. It has been brought to the notice of Government that the pay scales of Pre-vocational Instructors in aided upper primary schools have not been revised in 1969 and in 1974 pay revisions

3. Government have careful examined the matter and they hereby direct that the Pre-vocational Instructors who are possessing technical qualifications only in their respective subjects and who are in the scale of Rs. 55-75 be allowed the scale of Rs. 65-3-95-4-115 with effect from 19-3-1969, and Rs. 175-8-255-9-300 with effect from 1-1-1974 on notional basis with monetary benefit from 1-5-1975 as laid down in G. O. Ms. No. 911 Edn. Dated. 27-4-70 and G. O M. S. No. 1146, Edn. dated 27-9-1975 read with G.O.Ms. No 1421, Edn.. dated. 17-12-1975.

4 The Pre-vocational Instructors are also permitted to exercise option to elect the revised pay scales of 1969 and 1974 within period of 3 months from the date of issue of this order in the form annexed to G. O. Ms. No. 1146, Edn., dated 27-9-1975.

5. The principles laid down in G. O. Ms. No. 911, Edn. dated 27-4-70, and G. O Ms. No. 1146. Edn., dated 27-9-1975, in regard to fixation of pay will hold good.

6. The Director of School Education is requested to ensure that these orders are communicated to the said categories of employees under his administrative control who are governed by these orders including those on leave or deputation and obtain individual acknowledgement as Government will not under any circumstances entertain any representations with regard to exercise of options after the expiry of the stipulated time.

7. The revised pay scale of 1974 shall not be admissible to persons who retired before 1-1-1974 and were thereafter re-employed persons, who have retired between 1 1-1974 and thedate of issue of those orders, are, however, eligible to exercise the option.

8. No proposal for any revision of pay scales covered by this order will be entertained by the Government.

9. The additional financial commitment involved in the managements in the implementation of the revised scales of pay will be considered for assessment of teaching grant due to the Schools under "Grant-in-Aid".

10. This order issues with the concurrence of Finance and Planning Department vide their U. O. No. 3451/A1/PRCI/77. dated 1-7-77

(By order & in the name of the Governor of Andhra Pradesh

C. SRINIVASA SASTRY,
Secretary to Government.

---

(ఎయిడెడ్ విద్యాసంస్థలలో నాన్‌టీచింగ్ స్టాఫుకు నూతనస్కేళ్ళు, లిబరలైజుడు పెన్షన్ సదుపాయము)

GOVERNMENT OF ANDHRA PRADESH
EDUCATION (H) DEPARTMENT

Memorandum No. 3042/H1/77-2, Edn.

Dated. 29 8-1977.

Sub: Education-Extension of benefits given to the Government employees to the Non-Teaching staff of Aided Schools & Colleges-Orders-Issued.

Ref: 1. G. O. Ms. No. 647, Edn.. Dt 18-6-1977
2. From the President, Joint Council of action of Aided Colleges and Schools Non-teaching staff Association, Andhra Pradesh, Hyderabad, letter dated 29-6-1977.

The Non-Teaching Staff Association, Andhra Pradesh Hyderabad has requested that the benefit of the revised scales of pay of 1974 sanctioned to the Non-teaching staff of the Aided Institutions in the G. O. Ms. No. 647 Education, dt. 18 6 1977, might be given with effect from 1.1-1974 notionally and with monetary benefit from 1-5-1975, instead of from 1-4-1977, and that the liberalised pension rules might be extended to them with effect from 1-4-1973 instead of from 1-4-1977.

2. The Government, have carefully examined the requests, and direct as follows:-

1. The revised scales of pay of 1974 sanctioned in G.O. Ms No. 647 Education, Dt. 18.6-77 shall be made effective from 1-1-1974 notionally and the monetary benefit be given from 1-5-1975 to the non teaching staff of the Aided Schools and Colleges in the State. This will apply only to regular staff and not to staff employed from contingencies.

2. The Liberalised pension rules applicable to the Government servants be extended to the non-teaching staff working in the Aided Educational Institutions who retire on or after 1 4-1973 with monetary benefit being given from 1-4-1977

3. The orders in paras 2 (1) and 2 (6) of the Government Order read above, shall be deemed to have been modified to this extent.

4. This issues with the concurrence of Finance and Planning Department vide U. O. No. 2478/1851/EE/77-1, dt. 25-8-'77.

C. SRINIVASA SASTRY
Secretary to Government.

---

# తీర్మానాలు
## (72 వ పేజీ తరువాయి)

సి) కొత్తగూడెంలో ఉపాధ్యాయులకోసం ప్రత్యేకంగా 28 గృహములను నిర్మించుట జరిగినది. వాటిని ఉపాధ్యాయులకు సీనియారిటీ ప్రాతిపదికపై క్వార్టర్సు కేటాయించు అధికారమును ఖమ్మం జిల్లా డి. ఇ. ఓ. గారికి కొసంగవలసినదిగా ప్రభుత్వమును కోరుచూ తీర్మానించడమైనది.

డి) తెలంగాణా ప్రాంతములో పంచాయితీరాజ్ వ్యవస్థ ప్రాదుర్భావమునకు పూర్వము పాఠశాలలన్నియు విద్యాశాఖ ఆధీనములో వున్నవి. పాఠశాలలను పంచాయితీ సమితులు జిల్లా పరిషత్తులకు స్వాధీన పరచినపుడు అప్పటివరకు ఆయా పాఠశాలలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులను వారి ఇచ్ఛను తెలుసుకొనకయే పాఠశాలలతో బాటుఅప్పగించినారు. తద్వారా తెలంగాణా ప్రాంతములో రెండువర్గాలకు చెందిన ఉపాధ్యాయులు యీ పాఠశాలలలో పనిచేయుచున్నారు. ప్రమోషన్స్ సమస్య వచ్చినప్పటికీ వీరిలో వివాదములు తలెత్తి హక్కుల సంరక్షణ కొరకు కోర్టులకు పరుగులెత్తు స్థితి యేర్పడినది. జిల్లాపరిషత్తులు పుట్టక పూర్వమునుండి పనిచేయుచున్న వారము కావున మాకు అర్హతలున్నవనెడివాదనతో కోర్టులకు వెళ్ళుట జరిగినది. ఈ విషాద వాతావరణము ప్రభుత్వమువారు పాఠశాలలను బదలాయించినపుడు వానిలో పనిచేయు ఉపాధ్యాయుల యిష్టానిష్టాలను విచారించక పోవుటవలననే యేర్పడినది. ఈ సమస్యకు శాశ్వత పరిష్కార మార్గమును కనుగొనవలసియున్నది. కావున ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ జనరల్ కౌన్సిల్ ఈ సమస్య పరిష్కారానికి దిగువ సూచనలు చేయుచున్నది.

ఎ) కొఠారి కమీషన్‌వారు సూచించిన మేరకు స్వతంత్ర ప్రతిపత్తిగల విద్యాబోర్డు నేర్పరచి అన్ని యాజమాన్యములకు సంబంధించిన పాఠశాలలను సిబ్బందిని దానికి అప్పగించగోరుచున్నాము.

బి) ఇటీవల ఖమ్మం, వరంగల్ తదితర జిల్లాలలో కొంత మంది ప్రభుత్వ ప్రధాన ఉపాధ్యాయులు రివర్టు కాబడిరి. వారు చాలకాలము నుండి ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచు, పొందుచుండిన జీతములకు కూడ ఇందువల్ల నష్టము వాటిల్లినది. వారందరికి స్కేలు నష్టము లేకుండా తగు ఉత్తర్వుల నీయవలసిందిగా ప్రభుత్వమును కోరుచున్నాము.

సి. సీనియారిటీ గుర్తింపులేకపోవడంగాని, ఒకే సర్వీసుగల ఉపాధాయుల మధ్య అసమానతలు వుండటంగాని యు. టి. యఫ్. సమర్థించదు. అయితే తెలంగాణా ప్రాంతములో ప్రభుత్వ పంచాయతిరాజ్ ఉపాధ్యాయుల మధ్య తలెత్తిన విషాదకర పరిస్థితులను యీ కౌన్సిలు గమనంలోకి తీసుకొనుచున్నది. వారికి ప్రస్తుతము కొనసాగించబడుతున్న రేషియో పద్ధతిని కొనసాగించుచునే, సీనియారిటీకి న్యాయం కలిగించి యీ దిగువ చర్య గైకొనాలని కోరుచున్నాము. ఉన్న రేషియో కారణంగా ప్రమోషనులు రాని అదే సర్వీసుగల ప్రభుత్వ ఉపాధ్యాయులకు కూడా అదే జీతము కలిగిన అదనపు ఛార్జీలు సృష్టించి వారిసీనియారిటీకిన్యాయము కలిగించగోరుచున్నాము.

92. పండుగఅప్పులను ప్రభుత్వఉద్యోగులకిచ్చినట్లుగా, ఉపాధ్యాయులకు కూడా యిచ్చునట్లు ప్రభుత్వం వారు ఆర్డరివ్వాలని కోరుచున్నాము.

93. ప్రస్తుత కరువుభత్యమును డియర్‌నెస్ పేగా పరిగణించి పెన్షన్ గ్రాట్యుయిటీ సౌకర్యములు పొందుటకు వీలు కల్పించగోరుచున్నాము.

94. బావిరాజు ధర్మ సంస్థలోని ఉపాధ్యాయుల సర్వీసు సమస్యలు, అన్ ఎయిడెడ్ పోస్టులలో పనిచేసే వారందరికి జీతాలు చెల్లింపు ఉద్యోగాలు పోయిన 16 మంది ఉపాధ్యాయేతరులను పునర్నియమించుట మొ॥ సమస్యలను వెంటనే పరిష్కరించాలని కోరుతూ తీర్మానించడమైనది.

95. రాష్ట్రములోని అన్‌ఎయిడ్ పోస్టులన్నింటిని ఎయిడ్ లోనికి తీసుకొని, ఆ టీచరందరికి పూర్తి జీతములిచ్చు ఏర్పాట్లు చేయవలసినదిగా ఈ సభవారు కోరుచున్నారు.

96. 7-4-77 తేదీన ముఖ్యమంత్రిగారు ఉపాధ్యాయ సంఘాలతో చర్చించి, 21 అంశాలపై అంగీకారమునకు వచ్చిరి. ఈ 21 అంశములపై అనుకూలనిర్ణయాలు తీసుకున్నారు. వారిపై వెంటనే ఆర్డర్లు జారీ చేస్తామని హామీనిచ్చినారు. కాని ఆచరణలో వాగ్దాన భంగం జరిగినది. అంగీకృత విషయాలపై సరియైన జి. వో లు రానియెడల ఉపాధ్యాయులెల్లరు రాష్ట్రవ్యాపిత ప్రత్యక్ష చర్యకై సిద్ధంగా ఉండవలసినదిగా ఉపాధ్యాయులను హెచ్చరించుచూ తీర్మానించడమైనది. ఈ చర్యకుగాను ఇతర సంఘాలతో సంప్రదించి కార్యక్రమ నిర్వహణకు నూతన కార్యవర్గానికి అధికారంయిస్తూ తీర్మానించడమైనది.

97. 42 వ రాజ్యాంగసవరణ రద్దుచేసి విద్యను పూర్వం వలె రాష్ట్ర జాబితాలోనే ఉంచగోరుచున్నాము.

98. మూడుజిల్లాల ప్రాంతములతో 1970లో ప్రకాశం జిల్లా ఏర్పరచినారు. పూర్వపు జిల్లాలలో జిల్లా సెలక్షను కమిటీలు వేరు వేరు కాలములలో జిల్లా ఉపాధ్యాయ సెలక్షన్లు జరిపినవి. ఎప్పుడు సర్వీసులో చేరినా డి.యస్.సి. జరిగిన తేదీ నుండియే సర్వీసు రెగ్యులరైజేషను చేస్తారు. మూడు జిల్లాల ఉపాధ్యాయులకు ఉమ్మడి సీనియారిటీ తయారు చేయుటవలన చాల తీవ్రపరిస్థితి యేర్పడినది. కనుక ప్రకాశం జిల్లాలో జాయినింగు తేది ప్రాతిపదికగా సీనియారిటీ తయారుచేయాలని, 1966లో ప్రమోటయిన గ్రేడ్ 1 హిందీపండితులకు గ్రేడ్-II సర్వీసు ప్రాతిపదికగా సీనియారిటీ తయారుచేయాలని ప్రభుత్వమును కోరుచూ తీర్మానించడమైనది.

99. జూనియరు కాలేజీలు ఏర్పాటుచేసినపుడు ఇతర పోస్టులతో ప్రధానోపాధ్యాయుల పోస్టులను గూడా కాలేజీలో కలుపుచున్నారు. కాని ప్రధానోపాధ్యాయుని మాత్రం జిల్లా పరిషత్‌కు సరెండరు చేస్తున్నారు. అందువలన జూనియర్ కాలేజీ ఏర్పరచినప్పుడల్లా ఒక హెడ్మాస్టరు పోస్టును గూడా జిల్లా పరిషత్‌కు సరెండరు చేయగోరుతూ తీర్మానించడమైనది.

100. హెడ్మాస్టరు ప్యానలు తయారుచేయునపుడు సెకండరీ నుండి ప్రమోటయిన బి.ఇడి. టీచర్లకు సెకండరీ సర్వీసులో 50%ను బి.ఇడి. సర్వీసుకు కలిపి వెయిటేజి ఈయవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుచూ తీర్మానించడమైనది.

101. వేసవి సెలవులలోగూడ అనేక విధులునిర్వర్తించ వలసి వచ్చుట వలన హైస్కూలు ప్రధానోపాధ్యాయులకు, జూనియరు కాలేజీ ప్రిన్సిపాళ్ళకు అదనపు ఎరండు లీవు మంజూరు చేయగోరుచూ తీర్మానించడమైంది.

102. బాల్వాడీ పాఠశాలలో పనిచేయుఉపాధ్యాయినులకు గూడ వారి అర్హతనుబట్టి, హయ్యరుగ్రేడు లేక సెకండరీ గ్రేడు జీతము వారి నియామకపు రోజు నుండి యిచ్చునట్లు స్పష్టమైన ఉత్తర్వు లీయవలసినదిగ కోరుచూ తీర్మానించడ మైనది.

103 బాల్వాడీ పాఠశాలల సెలవు దినములు, యితర పాఠశాలల సెలవు దినములు ఒకేరీతిలో యుండునట్లు స్పష్ట మైన ఉత్తర్వులీయ గోరుచూ తీర్మానించడమైనది.

104. స్త్రీ సంక్షేమశాఖ ఆధ్వర్యములో నడచు పాఠ శాలలో పనిచేయు ఆయాలకుగూడా యితర కంటింజెన్సీ సిబ్బందితోపాటు జీతము లిచ్చునట్లు స్పష్టమైన ఉత్తర్వులీయ వలసినదిగా కోరుచున్నాము.

105. స్త్రీ విద్యను ప్రోత్సహించుటకై యస్ యస్.సిలో సబ్జక్టుపోయినా యింటరు పరీక్షకు హాజరగుటకు అవకాశమిచ్చి నట్లే యింటరులో ఒక సబ్జక్టు పోయినా బి.ఏ. చదువుటకు అవ కాశమీయగోరుచూ తీర్మానించడమైనది.

(అ) ఏవిధమైన విద్యాయోగ్యతలు లేకుండా 18స.లు పైబడిన యువతీ యువకులు నేరుగా యస్.యల్.సి, బి.ఏ, యం.ఏ, పరీక్షలకు హాజరయ్యేందుకు తమిళనాడు,మైసూరుల్లో అనుమతించినట్టు మనరాష్ట్రంలో కూడా అవకాశాలు కల్పించా లని మహాసభ కోరుతున్నది.

106. స్త్రీలకున్న యిబ్బందులను నివారించుటకై ఎంప్లాయిమెంటు ఆఫీసులో స్త్రీలకు ప్రత్యేక విభాగము నేర్పరచ గోరుచూ తీర్మానించడమైనది.

107. చింతలపాటి బాపిరాజు ధర్మసంస్థలలో 140మంది సిబ్బందికి 1-3-75 నుండి 24-2-77 వరకు చెల్లించవలసిన జీత ముల బకాయీలు వెంటనే చెల్లించగోరుచూ తీర్మానించడ మైనది.

108 విద్యాశాఖడైరెక్టరుగారిఉత్తర్వులమేరకుప్రస్తుతము ప్రాథమిక పాఠశాలలో పోస్టులు నిర్ధారించుటకు ఉపాధ్యాయ విద్యార్థి హాజరు 1:40 పరిగణించుచున్నారు. యిది ప్రభుత్వం ప్రకటించిన 1:30 సూత్రమునకు విరుద్ధముగాన సదరు ఉత్తర్వు ఉపసంహరింపవలసినదిగా డైరెక్టర్ ఆఫ్ స్కూలు ఎడ్యుకేషన్ వారిని కోరుచూ తీర్మానించడమైనది.

109. విజయవాడ వయోజన విద్యాకేంద్రములో శిక్షణ పొందుచున్న ఉపాధ్యాయులకు, యి. యల్. టి. సి. శిక్షణ పొందుచున్న అందరు ఉపాధ్యాయులకు దినసరి బత్తెము రు. 6-00 లకు హెచ్చింప గోరుచూ తీర్మానించడమైనది.

110. పనిభారము, విద్యార్హతలనుబట్టి యస్.జి.బి.టి. ఉపాధ్యాయులకు గూడ గ్రేడు II పండితుల జీతము లీయ గోరుచూ తీర్మానించడమైనది.

111. హైస్కూలు ప్రధానోపాధ్యాయులకు 30 రోజులకు మించని ఎరండు లీవు మంజూరుచేయు అధికారముయిస్తూ ఉత్తర్వు లీయ గోరుచూ తీర్మానించడమైనది.

112. ప్రభుత్వ ఉపాధ్యాయుల కమలు జరుపు ప్రావిడెంటుఫండు నిబంధనలే స్థానిక సంస్థల ఉపాధ్యాయులకు అమలు జరపాలి.

బి. స్థానిక సంస్థల ఉపాధ్యాయుల ప్రావిడెంటుఫండు నిల్వలపై ప్రభుత్వ సంస్థలలో ఇచ్చుచున్న 8¼% వడ్డీ రేటు ఇవ్వాలి.

సి. పంచాయితీసమితులలో ప్రావిడెంటుఫండు వసూలు చేసి జిల్లా పరిషత్‌కు పంపుటవలన ద్వంద్వ పాలన ఏర్పడి లెక్కలు తేలుటలేదుగాన ప్రావిడెంటు ఫండు జమచేసుకొనిన మేనేజిమెంటు వారే నిల్వ, అప్పు, చెల్లింపులకు బాధ్యత వహించునట్లు ప్రావిడెంటు ఫండు చట్టము సవరించ గోరుతూ తీర్మానించడమైనది.

113. 1974 లో డి. ఎ. మెర్జడ్ స్కేల్సు అమలు జరిపి నపుడు 1-1-74 నుండి నూతన వేతనములు అమలు జరిపినారు. అదే సంవత్సరములో వారికున్న యింక్రిమెంటు తేదినాడు మరి యొక యింక్రిమెంటు యిచ్చినారు. కాని 1-1-74 యింక్రిమెంటు తేది అయిన వారికి 1-1-75న యింక్రిమెంటు యిచ్చినారు గాన అట్టివారికి చాల అన్యాయము జరిగినది. వారికి గూడ 1-1-74 యింక్రిమెంటు ఈయ గోరుచూ తీర్మానించడ మైనది.

114. రిటైరు తేది యింక్రిమెంటు తేది ఒకటే అయి నపుడు వారి పెన్షను నిర్ణయించునపుడు యింక్రిమెంటు గూడ పరిగణించవలెనని కోరుచూ తీర్మానించడమైనది.

115. ప్రభుత్వ ఉపాధ్యాయులవలె విద్యాశాఖలోని అన్ని డిపార్టమెంటల్ ప్రమోషన్లు పొందుటకు ప్రభుత్వేతరోపాధ్యాయులకుగూడా అవకాశము కల్పించగోరుచూ తీర్మానించడమైనది.

116. ఫామిలీ బెనిఫిట్ ఫండు మొత్తము చనిపోయిన వారికిగాక రిటైరయినవారికిగూడా అదే మొత్తము చెల్లించ గోరుచూ తీర్మానించడమైనది.

117. యస్.యస్ సి. ఇన్విజిలేటర్లకు పరీక్షా కేంద్రము లలోనే టి.ఎ డి.ఎలు చెల్లించగోరుచూ తీర్మానించటమైనది.

## అభినందనలు

118. ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ తీసుకొన్న కార్య క్రమాలు దిగ్విజయము చేసి, ఉద్యమపటిష్టతకు తోడ్పడినకార్య కర్తలకు, ఉపాధ్యాయులకు ఈ మహాసభ అభినందనలందజేస్తున్నది.

119. దేశచరిత్ర మలుపుకు తిరిగిన నూతన దశలో,అన్ని వర్గాల ఆదరాభిమానాలు పొంది, ఏకగ్రీవంగా రాష్ట్రపతిగా ఎన్నికైన శ్రీ నీలం సంజీవరెడ్డికి ఈ మహాసభ శుభాకాంక్షలు అందజేస్తున్నది.

120. నిర్బంధ చండశాసనాలను ఎదిర్చి,తమఓటుద్వారా నిరంకుశత్వానికి స్వస్తిచెప్పి ప్రజాస్వామ్య మనుగడకు దోహదం చేసిన వీర భారత ప్రజానీకానికి, నవోత్సాహంతో నోపలిస్టు శక్తులకు ప్రోత్సాహమిచ్చి గద్దె నెక్కించిన విప్లవ బెంగాల్ ప్రజలకు ఈ సభ అభినందనలందజేస్తున్నది.

# విద్య రాష్ట్ర జాబితాలోనే వుండడం సర్వ విధాలా శ్రేయస్కరం

[విద్య ఉమ్మడి జాబితాలో వుంచాలా? లేక రాష్ట్రాల జాబితాలో చేర్చాలా - అనే విషయంలో యు. టి. యఫ్ నిశ్చితాభిప్రాయాల్ని పాఠకుల ముందుంచుతున్నాం.—సం]

విద్య ఇంతకుముందు రాజ్యాంగ చట్టంలో రాష్ట్ర జాబితాలో వుండేది. ఇందిరాగాంధి అధికారాలన్నింటినీ తన చేతుల్లోనే కేంద్రీకరించుకోవాలన్న దుర్బుద్ధితో ప్రవేశపెట్టిన 42వ రాజ్యాంగ సవరణ చట్టం ప్రకారం విద్యను ఉమ్మడి జాబితాలోకి లాగడం జరిగింది. ఆ విద్యను ఉమ్మడి జాబితాలోనే వుంచాలా లేక అంతకు పూర్వమున్నట్లు రాష్ట్రాల జాబితాలో చేర్చాలా అన్నది నేడు ఉపాధ్యాయ వుద్యమంలో ఒక వివాదాంశంగా వున్నది. విద్య రాష్ట్రాల జాబితాలోనే వుండాలన్నది ఐక్యవుపాధ్యాయ ఫెడరేషన్ నిశ్చితాభిప్రాయం.

విద్యాభివృద్ధి, భాషాభివృద్ధి, ప్రజాస్వామ్య పెంపుదల అవినాభావ సంబంధంగలవి. అవిభేద్యమైనవి. మనదేశం విశాలమైనది. దేశం ఒక్కటే అయినా నిజానికి ఇది వివిధ జాతులకు భాషలకు నిలయంగా వున్నది. మాతృభాషే బోధనా భాషగా వుండటం, భాషను అభివృద్ధి చేసుకోవడం, ప్రాంతీయ భాషలనే పరిపాలనా భాషలుగా పరిగణించడం ప్రజాస్వామ్యం వర్ధిల్లడానికి పట్టుగొమ్మలు. ఆ విధమైన ఆకాంక్షలే వివిధ భాషలుగల మన జాతులు భాషాప్రయుక్త రాష్ట్రాల కొరకు పోరాడి సాధించుకునేందుకు అస్కారమిచ్చాయి.

పరాయి భాషలో ప్రజాస్వామం వర్ధిల్లదు. మాతృభాషలు రాణించవు వైవిధ్యం వమ్మయిపోతుంది. ఆ పరిణామాలనే గతంలో మనం అనుభవించాం. దేశభాషలపై బ్రిటిషు పరిపాలకుల హయాంలో ఇంగ్లీషుకు ఆధిక్యత కలిగింది. అదే అధికార భాషగా చెల్లింది. అందుకు ప్రతికూలంగానే భాషా ప్రయుక్త రాష్ట్ర విభజనకు జాతీయోద్యమంతోపాటే ఉద్యమాలు బయలు దేరాయి. నైజాం నవాబుల పరిపాలనా కాలంలో ఉర్దూ అధికార భాషగా తెలంగాణాలో ఆధిక్యతకు వచ్చింది. తెలుగు భాషను అణగద్రొక్కి విద్యాబోధన అంతా ఉర్దూ భాషలో ఆ పాలకులు కొనసాగించారు. అందుకు ప్రతికూలంగా తెలుగు విద్యాలయాలకోసం, గ్రంధాలయాలకోసం ఉద్యమాలు బయలుదేరాయి. ఆంధ్ర మహాసభ తెలంగాణాలో ఆ విధంగానే ప్రారంభమైంది. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల ప్రజల యీ ఆంకాక్షలే సమన్వయమై సమైక్యాంధ్రకోసం పోరాటాలుగా రూపందాల్చి విశాలాంధ్రకు, ఆంధ్రప్రదేశ్ అవతరణకు అస్కారమిచ్చాయి. దాన్ని సంకుచిత ప్రాంతీయ తత్వాలకోను ఉద్యోగ అవకాశాల ప్రయోజనాలరీత్యానూ బ్రద్దలు గొట్టాలని తలపెట్టిన జైతెలంగాణా జైఆంధ్ర ఆందోళనలను జయప్రదంగా అధిగమించి సమైక్యత కొనసాగింది. ఈ పరిణామాల పర్యవసానంగానే, బానిస శృంఖలాలను బ్రద్దలు చేసుకుని విముక్తి చెందిన తెలుగుభాష బోధనా భాషగానూ పరిపాలనా భాషగానూ అభివృద్ధి చెందడానికి పురోగమిస్తోంది.

ఏ జాతికాజాతి, ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం ఏ భాష కాభాష పెనుగులాడి, నిలదొక్కుకుని, అభివృద్ధి చెందవలసిన అవసరం ఎంతగా వున్నదో యీ ఉదంతం విశదం చేస్తోంది. ఈ భావాన్ని, అంతర్యాన్నీ నిర్లక్ష్యంచేసి కాంగ్రెసు పాలకులు హిందీని ఆధిక్యతగల అధికార భాషగా దేశంపై రుద్దడానికి ప్రయత్నించడం, ఆ ప్రయత్నాన్ని దక్షిణాదినగల వివిధ భాషల వారూ తీవ్రంగా ప్రతిఘటించడం మనకు తెలిసినదే. హిందీ భాష మాట్లాడే ప్రజలు మనదేశంలో పెద్దసంఖ్యలో వున్నందున, వారెన్నుకున్న ప్రతినిధుల సంఖ్యకూడా పార్లమెంటులో ఎక్కువగా వున్నందున ఇతర భాషలను జాతులను నిర్లక్ష్యం చేసే ప్రమాదం ఎప్పటికప్పుడు వుంటూనేవుంటుంది. ఇటీవల కేంద్ర ఆరోగ్యశాఖామంత్రి కనపరిచిన ఛాందసత్వం, అందుకు వచ్చిన ప్రతిఘటన ఇందుకు చిహ్నాలు. అందుకే మాతృభాషలో విద్యాబోధన, ప్రాంతీయభాషలో పరిపాలనా నిర్వహణ, ప్రజల స్వపరిపాలనకు పెట్టనికోటలుగా వుంటాయి. ఆ విలువలను అప్రమత్తులమై మనం కాపాడుకోవాలి. కేంద్రంకంటె, ఏజాతి కాజాతి, ఏ రాష్ట్రానికారాష్ట్రం యీ విలువలను కాపాడుకోవడంలో ముందుండగలవన్నది నిస్సందేహం.

ఇంత సమగ్రతా భావంతో కాకపోయినా, ఆచరణావసరాల రీత్యానే మన రాజ్యాంగచట్టం ఫెడరల్ చట్టంగా ఏర్పరచబడ్డది. రాష్ట్రాల సమాఖ్యగా గుర్తింపు పొందింది. 1956లో భాషాప్రయుక్త రాష్ట్రాల విభజనను సాధించిన తర్వాత దాని స్వభావంలో మరింత మార్పుకలిగి ఆచరణలో దాదాపు వివిధ జాతుల సమాఖ్యగా అది పనిచేస్తోంది. అయితే కాంగ్రెసు పాలకులలో నిరంకుశ ధోరణులు ప్రబలి, ఏకపార్టీ నియంతృత్వ పోకడలు హెచ్చినకొలదీ వివిధ జాతులు తమభాషలను పరిపాలనను తమ అభీష్టానుసారం నెరవేర్చుకునేందుకు అవరోధాలు కల్పించ నారంభించారు. ఏ రాష్ట్రంవారు ఆ రాష్ట్రంలో తమ ఇష్టమొచ్చిన పార్టీని ప్రతినిధులను ఎన్నుకొని ప్రభుత్వాలను ఏర్పరుచుకునేందుకు ఆటంకాలు పెట్టారు. రాజ్యాంగ రీత్యావున్న అవకాశాన్ని వినియోగించుకొని ఏర్పరుచుకోబడిన కాంగ్రెసేతర ప్రభుత్వాలను కలం పోటుతో నిరంకుశంగా రద్దు చేయడానికి పూనుకొన్నారు. అభ్యుదయకరమైన విద్యావిధానం కొరకు విద్యా నిర్వహణనంతటినీ ప్రయివేటు సంస్థలనుండి స్వాధీనం చేసుకొనేందుకు కంట్రోలు చేసేందుకు కేరళలో నంబూద్రిపాద్ ప్రభుత్వం ప్రయత్నించిన కారణానే ఆ ప్రభుత్వాన్ని ఇందిరాగాంధి కూలదోయించింది.

రాష్ట్రాల హక్కులను కుదించే యీ ప్రయత్నాలను ప్రజాస్వామిక శక్తులు ప్రతిఘటిస్తూ వచ్చాయి. రాష్ట్రాల స్వపరిపాలనా హక్కులను మరింత విస్తృతంచేయాలని ఆందోళన చేస్తూ వచ్చాయి. దేశరక్షణ, ద్రవ్య నిర్వహణ, విదేశాంగ విధానము మాత్రమే కేంద్రం చేతుల్లో వుండాలని మిగతా అంశాల నిర్వహణా బాధ్యతను రాష్ట్రాలకే వదలాలని ప్రజాస్వామిక వాదులు కోరుతూ వచ్చారు. ఈ భావాన్ని గౌరవించకపోగా, రాష్ట్రాలకు వున్న హక్కులను కూడా పూడ బెరకడానికి ఇందిరాగాంధి ప్రయత్నించింది. రాష్ట్రాల స్వప

పాలనా హక్కులను ప్రాథమిక పౌరసత్వ హక్కులను అణచి పారవేసి నల్లేరుపై బండివలె కేంద్ర ఆధిపత్యాన్ని తన ఆధిపత్యాన్ని కొనసాగించుకునేందుకే 42వ రాజ్యాంగ సవరణ చట్టాన్ని అత్యవసర పరిస్థితికాలంలో ప్యాస్ చేయించుకున్నది. అందులో భాగంగానే విద్య, వ్యవసాయ శాఖలను రాష్ట్రాల జాబితా నుండి తొలగించి ఉమ్మడి జాబితాలో చేర్పించుకున్నది. ఆ విధంగా కేంద్ర జోక్యాన్ని పెంపొందించుకునేందుకు యీ సవరణ అస్కారమిస్తోంది. ఒకే అంశంపై రాష్ట్రమూ కేంద్రమూ విభిన్న దృక్పథాలతో శాసనాలుచేస్తే కేంద్ర శాసనమే ఆధిక్యతకలిగివుంటుంది.

అత్యవసర పరిస్థితి అవశేషంగా సంక్రమించిన ఉమ్మడి జాబితాలోనే విద్యను వుంచాలని కోరడం మొత్తం చారిత్రక పరిణామాన్ని, ఇందిరాగాంధి నిరంకుశ ప్రయత్నాన్ని మరిచిపోవడమే అవుతుంది. జాతీయ భాషల మొత్తం అభివృద్ధి నుండి విద్యనువిడగొట్టి చూడటం హానికరం. స్వరాష్ట్రంలో స్వభాషలో స్వపరిపాలన కొనసాగించుకోవాలన్న ప్రజాస్వామ్య దృక్పథానికి అది విరుద్ధం అవుతుంది.

విద్యను కేవలం ఉపాధ్యాయుల జీతబత్తేలకు పరిమితం చేసి చూడటం కూడా సంకుచితమవుతుంది. భాషాభివృద్ధి చేయడం, ప్రాంతీయభాషను పరిపాలనా భాషగా పెంపొందించడం, విద్యాస్థాయిని పెంపొందించడం, పిల్లలందరినీ చదువుకునేలా చేయడం, వయోజనవిద్య మొదలైనవన్నీ విద్యాశాఖ బాధ్యతలుగా వుంటాయి. వీటన్నింటి సమగ్రాభివృద్ధిని దృష్టిలో పెట్టుకోకుండా యీవిషయాన్ని పరిశీలించడం తప్పిదమవుతుంది.

అలాగే కేంద్ర జోక్యంద్వారా అవకాశాలు, సదుపాయాలూ కలుగుతాయనుకోవడంకూడా వాస్తవంగాదు. అవసరమైన సదుపాయాలకోసం ఉద్యమాలను నిర్మించుకొని పోరాడటమే హక్కుల సాధనకు మార్గం అన్నది కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలన్నీ మనకు నేర్పిన గుణపాఠాలే. ఉమ్మడి జాబితాలో విద్యారంగం వున్నంత మాత్రాన కేంద్రప్రభుత్వం ఆటోమేటిక్‌గా జీతబత్తేలనుగాని సదుపాయాలనుగాని పెంచదు. విద్యారంగాన్ని ఇందిరాగాంధి ఉమ్మడి జాబితాలో చేర్చింది అందుకు కానేకాదు. ఒకవైపు వేతన స్తంభనను, బోనస్ కత్తిరింపును ప్రవేశపెట్టిన ఇందిరాగాంధి మరోవైపు ఉపాధ్యాయుల జీతబత్తేల పెంపుదల దృష్ట్యా యీ సవరణను తెచ్చిపెట్టిందని ఊహించనైనాలేము. రాజ్యాంగ చట్టపు ఆదేశ సూత్రాలలో పదేళ్ళలో నిర్బంధ ప్రాథమిక విద్యనందరికీ గరపాలనివున్నా ముప్పయ్యేళ్ళపాటు దానిని అమలు జరిపించడానికి ప్రయత్నించని కాంగ్రెసు కేంద్ర ప్రభుత్వం ఆ పవిత్రమైన సంకల్పాన్ని నెరవేర్చేందుకు కంకణం గట్టుకొని యీ సవరణ చేసిందని అసలే చెప్పజాలము.

కేంద్రపాలిత రాష్ట్రాలన్నీ విద్యా విషయంలో ఇప్పుడు ఒకే స్థాయినలేవు. కేంద్ర జోక్యంవల్ల దేశమంతటా ఒకే యూనిఫారమ్ పద్ధతులు ఏర్పడతాయని అనుకోనూలేము. కేంద్రం తనచేతనున్న అవకాశాలను సమతూకంతో ఇప్పుడు అన్ని రాష్ట్రాలకూ విభజించడంలేదు. ఇకముందు అలా చేస్తుందని విశ్వసించేందుకూ అవకాశంలేదు. లైసెన్సులిచ్చే పద్ధతి, పరిశ్రమలను కేటాయించేపద్ధతి, ఉద్యోగాలిచ్చేపద్ధతి, ఉపాధి కల్పించే పద్ధతి, బ్యాంకుఅప్పులిచ్చే పద్ధతి మొదలైనవన్నీ ఎగుడుదిగుడుగానే వున్నాయి. కొన్ని రాష్ట్రాల్లో చూపినశ్రద్ధ కేంద్రం అన్నిరాష్ట్రాల్లోనూ చూపడంలేదు. పెద్దరాష్ట్రాల్లో పెద్ద కేటాయింపులు, చిన్న రాష్ట్రాల్లో చిన్న కేటాయింపులూ రాష్ట్ర ప్రభుత్వాలు చేయగలగడంలేదు. చిన్నదైన కేరళ రాష్ట్రంలో విద్యకు బడ్జెటు కేటాయింపు జాస్తిగావున్నది. అక్షరాస్యత హెచ్చుగానూ వున్నది. అందుకు రెండున్నరరెట్లు పెద్దగావున్న మనరాష్ట్రంలో ఇవన్నీ నాసిగానే వున్నాయి. వీటిని సరిదిద్దుకునేందుకు ఉపాధ్యాయ ఉద్యమం పెంపొంది ఎటూ పోరాడవలసేఉన్నది.

విద్యారంగం ఉమ్మడి జాబితాలో లేదు గనుక కేంద్రం ఇప్పుడు సరైన శ్రద్ధ చూపడం లేదనుకునేందుకు ఏ మాత్రం అస్కారం లేదు. సమైక్యతాభావం పెంపొందించే ఆదేశిక సూత్రాలను రూపొందించీ, ఉపాధ్యాయులకు అవసరమైన కనీస సదుపాయాలను కలిగించీ అమలు జరిపించడానికి అవకాశాలు కేంద్రానికి ఇదివరకూ వున్నాయి.

స్వభాషాభివృద్ధికి, స్వపరిపాలనకు మనం ఎంత ఎక్కువ ఆందోళనచేస్తే అంత ఎక్కువగా రాష్ట్ర ప్రభుత్వాలు ఆ విషయంలో కదలవలసివస్తుంది అవి ఆ విషయంలో ఎంత ఎక్కువ కదిలితే అంతఎక్కువగా ఉపాధ్యాయులకు ప్రాముఖ్యత పెరుగుతుంది. ఉద్యోగావకాశాలు పెరుగుతాయి. విద్యాభివృద్ధి,భాషాభివృద్ధి దాంతోపాటు ఉపాధ్యాయులప్రాధాన్యతలు అవకాశాలూ పెరుగుతాయి.

ప్రజాస్వామిక దృష్టినుండి వేరుబడి ఉపాధ్యాయులు సాధించ కలిగినది శూన్యం. ప్రజాస్వామిక సూత్రాలకు కట్టుబడి పోరాడితే విద్యాభివృద్ధీ జరుగుతుంది, ఉపాధ్యాయుల కోర్కెలూ నెరవేరుతాయి.

---

( 80వ పేజీ తరువాయి )

121. కాలేజీ అధ్యాపకులకు యు. జి. సి. స్కేల్సు సాధించుటకై సమైక్య పటిష్ట పోరాటం సాగించి విజయం సాధించినందుకు కాలేజీ ఉపాధ్యాయ సంఘాలైన అప్టా, టూప్టా, ప్రభుత్వ కాలేజీ అధ్యాపక సంఘాలను, వారికి అన్నివిధాలా చేయూత నొసగిన ఉపాధ్యాయ యం.యల్.సి. లను అధ్యాపక వర్గాన్ని అభినందిస్తూ ఈ మహాసభ తమ సంఘీభావాన్ని ప్రకటిస్తున్నది.

122. చిరకాల అపరిష్కృత సమస్యా పరిష్కారానికి, నిరంకుశోద్యోగుల అక్రమాల నరికట్టుటానికి, సమైక్యపోరాటం జరిపి విజయం పొందిన నందిగామ సమితిశాఖను కార్యకర్తలను అండదండలందించిన ఉపాధ్యాయులను ఈ సమావేశం అభినందిస్తున్నది.

123. రాష్ట్రంలో వివిధ పోరాట కార్యక్రమాలద్వారా సమైక్య ఆందోళన జరిపి సమస్యా పరిష్కారం సాధించిన జిల్లా శాఖలను, సమితి శాఖలను కార్యకర్తలను, తోడ్పాటు అందించిన ఉపాధ్యాయులను ఈ సమావేశం అభినందిస్తున్నది.

---

విద్యాగోష్ఠికి చెందిన మిగిలినవారి ప్రసంగాలు ఇతరాలు 77 అక్టోబరు సంచికలో ప్రచురింపబడును. —సం.

---

## కేంద్ర సహకార బ్యాంకులలో పనిచేస్తున్న ఉద్యోగుల ఆందోళనలను బలపరుస్తూ సంఘీభావం

రాష్ట్రంలోని 26 సహకార బ్యాంకులలో పనిచేస్తున్న 1½ వేల ఉద్యోగులు 18-8-77 నుండి సాగిస్తున్న నిరవధిక సమ్మెను బలపరుస్తూ వారి కోర్కెల్ని ప్రభుత్వం తక్షణం పరిష్కరించాలని ఖమ్మం మహాసభ తీర్మానించినది.

## ఖమ్మం మహాసభ ఆమోదించిన

# నిబంధనావళి సవరణలు

7 వ చాప్టరులో 1 వ అంశము తొలగించి ఈ క్రింది విధముగా చేర్చవలెను.

1. ఫెడరేషను కార్యవర్గములో ఆఫీసు బేరర్లతోసహా 37 మంది సభ్యులుందురు.

2. అ. ఒక అధ్యక్షుడు, 6 గురు ఉపాధ్యక్షులు, ఒక ప్రధాన కార్యదర్శి, 6 గురు కార్యదర్శులు, 21 జిల్లాలనుండి 21 మంది సభ్యులు, ఒక మహిళ /రిజర్వుడు/. ఐక్యఉపాధ్యాయ పత్రిక సంపాదక వర్గమునుండి ఒకరు, కార్యవర్గ సభ్యులుగా యుందురు.

ఆ ఈ ఫెడరేషను బల పరచిన. శాసనమండలి సభ్యులు, జనరల్ కౌన్సిలు సభ్యులయినచో వారందరు కార్యవర్గములో ఎక్స్‌ఫీషియో సభ్యులుగ యుందురు. వీరికికూడ యితర కార్యవర్గ సభ్యులకున్న అన్ని అధికారములుండును. ఈసంఖ్యను అవసరమైన మార్పులతో ప్రతి నూతన కౌన్సిలులో ఖరారు చేయవలెను.

2. 9వ చాప్టరులోని 3వ అంశము తొలగించి ఈ క్రింది విధముగ చేర్చవలెను సమితి కౌన్సిలులోని మొత్తము సభ్యులలో ప్రతిపదిమంది, ఆ పైన అంతకు తక్కువ సభ్యులకు ఒకరు చొప్పున సమితి శాఖ నూతన కౌన్సిలు సమావేశములో జిల్లా కౌన్సిల సభ్యులను దామాషా పద్ధతిలో ఎన్నుకొనవలెను.

3 9 వ చాప్టరులో 5 వ అంశమును తొలగించి ఈ క్రింది విధముగ చేర్చవలెను. జిల్లా కౌన్సిలు సభ్యులనుండి ఒక అధ్యక్షుడు, 4గురు ఉపాధ్యక్షులు ఒక ప్రధాన కార్యదర్శి 4 గురు కార్యదర్శులకు మించక ఆ జిల్లాశాఖ అవసరమునుబట్టి ఆఫీసు బేరర్లను, ప్రతి సమితి, పట్టణశాఖనుండి ఒక కార్యవర్గ సభ్యుని ఒక మహిళ రిజర్వుడుతో కార్యవర్గమును ఎన్నుకొనవలెను.

4 10 వ చాప్టరు 4 వ అంశములో "అన్ని సెంటర్లకు బదులుగా "అన్ని టి ఎ సెంటరు ప్రాంతములకు" అని చేర్చవలెను

5 11 చాప్టరు రెండవ అంశములో హైస్కూలు అను మాట తొలగించి "అన్ని పాఠశాలలు, జూనియర్ కాలేజీలు" అని చేర్చవలెను

6. మహాసభలు అను చాప్టరు 4 వ అంశములో ఫెడరేషను మహాసభకు తర్వాత "రాష్ట్ర జనరల్ కౌన్సిలు సభ్యులు" అని చేర్చవలెను

7. 15వచాప్టరుగా "జాతీయ అంతర్జాతీయ ఉపాధ్యాయ సంఘముతో అనుబంధము కలిగియుండును.

8. జనరల్ నిబంధనలు అ లో "ముందు రోజుకు" తరువాత రోజుకు తొలగించి, ముందు తర్వాత" అని చేర్చవలెను.

కోరం అన్న చాప్టరులో చివరకోరంలేని ఏ సమావేశములు తీసికొనిన నిర్ణయములు చెల్లవు అని చేర్చవలెను.

9. సమావేశముల నోటీసు

అ లో కౌన్సిలు సమావేశములను 19 రోజులకు బదులు 10 రోజులు అని చేర్చవలెను.

అదనపు అర్హతలకు అడ్వాన్సు ఇంక్రిమెంటు ఉత్తర్వు

## GOVERNMENT OF ANDHRA PRADESH
### ABSTRACT

PUBLIC SERVICES - Revised pay scales of 1974 for School Teachers working under all managements Sanction of advance increments to teachers possessing higher qualifications. Orders - Issued.

---

### EDUCATION (K) DEPARTMENT

G. O. Ms. No. 928, Edn. Dated the 13th September 1977

Read:

1. G. O. Ms. No. 1146, Edn., dt. 27.9.1975.
2. G. O. Ms. No. 1421, Edn. dt. 17-12-1975.
3. From the Director of School Education, letter No. 936/A-III/-3.75, dated. 30-3-1977.

ORDER:

The question of sanction of advance increments in the revised pay scales of 1974 to teachers in schools under the Government, Zilla Parishads Panchath Samithis, Municipalities, Aided schools possessing higher qualification has been under the consideration of the Government for some time past.

2. The Government after careful consideration of the matter in all its aspects issue the following orders;

i) No advance increments shall be admissible for those possessing only the minimum qualifications prescribed for the post.

ii) The advance increments to the teachers shall not be absorbed in future increments.

iii) The advance increments in the revised pay scales of 1974 shall be allowed for the teachers who have acquired the higher qualifications prior to 1-1-1974 also.

iv) The number of advance increments shall be at the rate of one additional increment/each of the additional / for qualifications, provided they are not the minimum qualifications Prescribed for the relevant categories, as indicate below:

a) One increment for B. A, or equivalent degree.
b) One increment for B. Ed,
c) One increment for M. A. or equivalent Post-graduate degree.
d) One Increment for M. Ed.

v. In cases where the higher qualification is acquired by proceeding on deputation from Government no advance increment will be admissible as the Government would have incurred expenditure on his pay and allowances for the period of deputation. These who have gone on study leave will, however be eligible for the benifit.

vi) (a) The advance increments shall be allowed in the revised pay scales of 1974, from 1-1-1974 or the date of entry into the revised pay scale of 1974 with monetary benefit from 1-5-1975 for the teachers governed by the revisedpayscales of 74,

(b) In respect of those who acquired the addititional qualification after 1-1-1974 and before 1-5-1975 and governed by the revised pay scales of 1974, the advance increments will be admissible only from the day following the last day of examination falling after 1-1 1974, with monetary benefit from 1-5-1975.

(c) In respect of those who acquire the additional qualifications after 1-5-1975 and governed by the revised pay scales of 1974, the advance increments will be admissible from the day following the last date of examination falling after 1-5-1975.

vii) As the advance increments now sanctioned are interded to provide adequate incentive to acquire the additional qualifications specified against each catagory, the normal increments date will not be disturbeb and hence the subsequent increments after accrual of advance increment will accrue on the date of normal increment.

viii) The advance increments will not be admissible to those who are not governed by the revised pay scales of 1974.

3. The categories of of teachers of schools under Government, Zilla Parishads, Panchayath Samithies, Municipalities and Aided Schools, for whom advance increments for additional qualification are sanctioned in terms of orders in para 2 above are specified below:

(By order & in the name of the Governor of Andhra Pradesh

C. SRINIVASA SASTRY,
Secretary to Government.

---

EDUCATION DEPARTMENT

G. O. Ms. No. 812 Education. Dated 9-8-77

Read the following:

ORDER:

The following amendment to Rule 53 of Andhra Pradesh Educational Rules is issued. This will come into force with effect from the 1st June 1977.

AMENDMENT

For the existing Rule 53 of the Andhra Pradesh Educational Rules relating to Elementary (Primary) Schools uuder Public and Private Management, the following shal be substituted

"53, There shall be one teacher for every fifty pupils in average attendance in every class or section of class"

Note: For single teacher schools, the minimum strength may be thirty.

2. The teaeher - Pupil Ratio of 1: 20 shall continue in the elementary (Primary) Schools located in Agency areas.

C. SRINIVASA SASTRY
Secretary to Government.

---

| Sl. | Category of of posts. | Revised scale of pay '74. | Qualifications for the post. | Additional qualifications for eligibility to advance increments. | Number of advance increments to be allowed. |
|---|---|---|---|---|---|
| 1. | 2. | 3. | 4. | 5. | 6. |
| 1. | Secondary Grade Teachers. | Rs. 250-10.430 | H.S.C./ SSLC & trained teachers certificate of S.G. (SGBT) | a) Graduate with SGBT | One increment. |
| | | | | b) Graduate with B. Ed. with | Two increments. |
| | | | | c) Post-graduate with SGBT | Two increments. |
| | | | | d) Post-graduate with B Ed. | Three increments. |
| | | | | (e) Post-Graduate with M. Ed. ., | Four increments. |
| 2. | Trained Graduate teachers Grad II/ School assistants. | Rs. 320-14-460 15-580. | Degree and Degree in Teaching (B. Ed.) | a) Post-graduate with B Ed. | One incrment. |
| | | | | b) Degree with M Ed. | One incrment. |
| | | | | c) Post-graduate with M. Ed. | Two incrmets. |
| 3. | Pandits Grade I. | | Oriental Title or Degree and Teaching Degree or equivalent. | a) Post-graduate or equivalent with B, Ed. | One increment. |
| | | | | b) Oriental Title or Degree with M. Ed. | |
| | | | | c) Post-graduate or equivalent with M. Ed. | Two incremeuts. |
| 4. | physical Directors. | do | Degree with Diploma in Physical Ecucation | Degree with post-graduate Degree in physical education | One increment. do |

(రెండవ కవరు పేజీ తరువాయి)

మన్న మైనారిటీ కులాల మతసంస్థలకు అవకాశం కల్పించాలి.

**8. దేశ వ్యాప్తంగా ఒకే విద్యావ్యవస్థ :** దేశవ్యాప్తంగా అన్ని దశలలోను ఒకే విద్యావిధానం ప్రవేశ పెట్టబడాలి. వర్గ ప్రాతిపదికపై, విభిన్న సాంఘిక స్థాయి కను ణంగా ఏర్పరచిన పబ్లిక్ స్కూళ్ళు, స్పెషల్ స్కూళ్ళు మొద ు పద్ధతుల్ని రద్దుచేయాలి.

**9. విద్యరాష్ట్రాల జాబితాలో ఉండాలి :** భారత దేశంలోనున్న వివిధ జాతులు, భాషా ప్రయుక్త రాష్ట్రాల వాస్తవాన్ని గుర్తించిన తర్వాత, ఫెడరల్ రాజ్యాంగంలో రాష్ట్రాలకు గల అటానమీ సూత్రాలను సంపూర్ణంగా అమలు పర్చితేనే ఆయా రాష్ట్రాల ప్రజల విద్యావసరాలు తీర్చబడ తాయనీ, అందుచేత విద్య రాష్ట్రాల పరిధిలోనే ఉండాలని, 42వ రాజ్యాంగ సవరణను రద్దుచేయాలని కోరుతున్నాము.

**10. సిలబస్ :** నిరుపయోగంగాను, అధికభారం గాను ఉన్న సిలబస్‌ను తగ్గించాలి. అన్ని విద్యాదశలలోను ఒకే విధమైన సిలబస్, కరిక్యులమ్, బోధనా పద్ధతులు దేశ వ్యాప్తంగా సమాన స్థాయిలో ఉండేటట్లు చూడాలి.

**11. జీతాలస్కేళ్లు :** ప్రాథమిక, సెకండరీ, విశ్వ విద్యాలయ దశలన్నింటిలోను వృత్తిభద్రత గ్యారంటీ చేస్తూ దేశవ్యాప్తంగా ఒకే సర్వీసు పరిస్థితులు, జీతాల స్కేళ్లు అమలు పరచాలి. అట్టివిధానం మాత్రమే ఏ విద్యా సంస్కరణనైనా జయప్రదం చేయటానికి దోహదపడుతుంది. ప్రజాతంత్ర శాస్త్రీయ విద్యావిధానం జయప్రదంగా అమలుపర్చటానికి ప్రోత్సాహకరంగా ఉంటుంది.

**12. మైనారిటీసంస్థల్లోని టీచర్లు:** మైనారటీ సంస్థల ఆధ్వర్యంలోనున్న పాఠశాలల, కళాశాలల, ఉపాధ్యా యుల సర్వీసులకు భద్రత గ్యారంటీ చేయాలి.

**13. నిర్బంధంగా తొలగించిన ఉపా ధ్యాయులను తిరిగి నియమించాలి :** అత్యవసర పరి స్థితి కాలంలో నిర్బంధంగా రిటైర్ చేయబడిన, మీసా, డి.ఐ. ఆర్, నిబంధనల క్రింద అరెస్టు చేయబడిన ఉపాధ్యాయులను వెంటనే తిరిగి ఉద్యోగాలలో నియమించాలి ఈ మధ్య కాలా నికి వారికి జీతాలు చెల్లించాలి. వారి సర్వీసులో ఏర్పడిన బ్రేక్‌ను కండోన్ చేయాలి.

**14. ప్రాథమిక, సెకండరీ విద్యాగ్రాంట్ల కమీషన్ల నేర్పరచాలి :** పాఠశాల భౌతిక స్థితిగతులను, ఉపాధ్యాయుల జీవనస్థితిగతులను అభివృద్ధిచేయటానికి జాతీయ చేతన వ్యవస్థ రూపొందింపబడటానికి, విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్‌లాగా ప్రాథమిక సెకండరీ విద్యా గ్రాంట్స్ కమీ షన్లను ఏర్పరచాలి.

**15. [illegible]్య బోర్డులు :** ఉపాధ్యాయుల [illegible] దం[illegible]ధుల, ప్రభు[illegible] ప్రతినిధులతో కూడిన, స్వయం పాల[illegible] కారంగల్గిన, చట్టబద్ధమైన విద్యాబోర్డుల నేర్పరచాలి. అన్ని మేనేజిమెంట్లుకిందనున్న వివిధ విద్యాసంస్థలను ఈ బోర్డుల ఆధీనంలోకి తేవాలి.

**16. పని గంటలు – పని దినాలు :** శాస్త్రీయ పద్ధతిలో, దేశవ్యాప్తంగా ఒకేవిధంగా రోజుకు 5 గంటలు, వారానికి 5రోజులు, సంవత్సరానికి 200 రోజుల పనివిధానాన్ని అమలు పరచాలి. వారానికి 18 గంటల పనికన్నా ఏ ఉపా ధ్యాయునికి ఎక్కువ వుండరాదు.

**17. పదవీ విరమణ వయస్సు :** పదవీ విరమణ వయసు వివిధ రాష్ట్రాలలో వివిధ రీతులుగా, 55, 58, 60 సంవ త్సరాలుగానున్నది. కేంద్రప్రభుత్వంలో 58సంగలుగా వున్నది. దేశవ్యాప్తంగా ఒకేవిధంగా వుండేటట్లు పదవీ విరమణ వయస్సు 60 సంగలుగా నిర్ణయింపవలసిందిగా కోరుతున్నాము.

**18. పౌరహక్కులు :** ఉపాధ్యాయులు ప్రజా స్వామ్య సమాజంలో మేధావి వర్గానికి చెందినవారు. రాజకీయ జీవితానికి వారిని వేరుగా ఉంచి రెండవతరగతి పౌరులుగా చూడరాదు. కొఠారి కమీషన్ సూచనల ప్రకారం ఉపా ధ్యాయులకు రాజకీయాలలో పాల్గొనటానికి, శాసనసభ, పార్ల మెంటు మొదలగు సంస్థల ఎన్నికలలో పాల్గొనటానికి, ఎన్నిక కాబడటానికి హక్కు కల్పింపబడాలి. శాసనమండలికి సంబం ధించిన ఉపాధ్యాయ నియోజకవర్గ ఎన్నికలలో ప్రాథమికోపా ధ్యాయులకు కూడ ఓటింగుహక్కు కల్పించాలి.

— పై సూచనలన్నింటినీ పరిశీలించి విద్యారంగంలో ఏర్పడిన సంక్షోభాన్ని పరిష్కరించటంలో తగు చొరవను ప్రదర్శింపగలరని విశ్వసిస్తున్నాము

"ఈరోజు బెంగాల్ ఆలోచించేది ... రేపు భారతదేశం ఆలోచిస్తుంది !" అని ఒక రాజకీయ విద్యార్థి వ్యాఖ్యానించి నట్లుగ భారతదేశంలో హేతుబద్ధమైన శాస్త్రీయ విద్యావిధానం ప్రవేశపెట్టుటలో మీరు వంగదేశానికి తగిన ఉత్తమవృత్తులుగా కార్యసాధనలో జయప్రదం కాగలరని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాము.

ఖమ్మం,
18-8-77.

కృతజ్ఞతతో,

తె. నారాయణరావు,
అధ్యక్షులు,

ఎ. వెంకటస్వామి
ప్రధాన కార్యదర్శి,



Published by M. Venkataratnam on behalf of A. P. United Teachers Federation From U. T. F. offic Akulavari Veedhi, Vijayawada-2 and Printed by him at Prajasakti Press, Vijayawada-2
Editor : M. Venkat[illegible]nam

IUVolA129



మహాసభలో పాల్గొన్న ప్రతినిధులు

90



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | IUVO1A129 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 28/08/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Mounika |
| పేజీలు విడదీసినది | Mouni |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |